భారతమాతపూజ.

# వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడు

(నవల)

గ్రంథకర్త:

కీ॥ శే॥ పాటిబండ్ల వేంకటాద్రియయ్యా చౌదరిగారు

వీరులపాడు, నందిగామ తాలూకా.

ప్రకాశకులు.

వాసిరెడ్డి వీరవరప్రసాద్‌గారు.

మొదటికూర్పు

1000 ప్రతులు.

బెజవాడ

శ్రీకన్యకా పరమేశ్వరీ ముద్రాక్షరశాల యందు

ముద్దన కన్నయ్యచే ముద్రింపఁబడియె.

1932

 వెల 1—0—0.

# చందాదారులు

| | | |
|---|---|---|
| మ. రా శ్రీ. | వాసిరెడ్డి హనుమయ్యగారు | 25-0-0 |
| ,, | పాటిబండ్ల రామయ్యగారు | 15-0-0 |
| ,, | యీ రామకోటయ్యగారు | 15-0-0 |
| ,, | యీ వెంకటపతి | 5-0-0 |
| ,, | వాసిరెడ్డి సీతారామయ్యగారు | 5-0-0 |
| ,, | వట్టికొండ మల్లయ్యగారు | 10-0-0 |
| ,, | బుగ్గినేని రామయ్యగారు | 10-0-0 |
| ,, | పాటిబండ్ల రంగయ్యగారు | 10-0-0 |
| ,, | వాసిరెడ్డి లక్ష్మయ్యగారు | 5-0-0 |
| ,, | అల్లూరి వెంకటసుబ్బయ్యగారు | 5-0-0 |
| ,, | పాటిబండ్ల రఘుపతిగారు | 5-0-0 |
| ,, | పాటిబండ్ల హనుమయ్యగారు | 5-0-0 |
| ,, | యీ రామకోటయ్యగారు | 5-0-0 |
| ,, | బుగ్గినేని జోగయ్యగారు | 5-0-0 |
| ,, | వాసిరెడ్డి నాగయ్యగారు | 5-0-0 |
| ,, | వాసిరెడ్డి భద్రయ్యగారు | 5-0-0 |
| ,, | వాసిరెడ్డి మల్లయ్యగారు | 5-0-0 |

## అల్లీనగరం.

| | | |
|---|---|---|
| మ. రా. శ్రీ | వాసిరెడ్డి వెంకయ్యగారు | 25-0-0 |
| ,, | వట్టికొండ జానయ్యగారు | 5-0-0 |
| ,, | యీా వెంకయ్యగారు | 15-0-0 |
| ,, | వాసిరెడ్డి వెంకటప్పయ్యగారు | 8-0-0 |
| ,, | యీా మల్లయ్యగారు | 8-0-0 |
| ,, | నీరుకొండ శేషయ్యగారు | 5-0-0 |
| ,, | వట్టికొండ లక్ష్మీంపతిగారు | 5-0-0 |
| ,, | నీరుకొండ మల్లయ్యగారు | 8-0-0 |
| ,, | నీరుకొండ వెంకయ్యగారు | 10-0-0 |
| ,, | వాసిరెడ్డి తిరుపతయ్యగారు | 5-0-0 |
| ,, | యీా హనుమయ్యగారు | 5-0-0 |

# పీఠిక.

ఈ కథానాయకుండగు వేంకటాద్రినాయని ప్రభువరుండు కీర్తిలతామతల్లికాలవాలంబగు కమ్మవంశంబున వాసిరెడ్డి యాచ్చమాంబా జగ్గయగర్భ శుక్తిముక్తాఫలంబై హాలకుల శాదిరేఖా విశేషంబులు యుక్తస్థానంబుల చెన్నారుచుండ 1177 వ ఫసలీ క్రీస్తు శకము 1767 నకు సరియగు సర్వజిన్నామ సంవత్సర వైశాఖ బ ౧౧ సోమవారము ననూరాధానక్షత్ర యుక్త శుభలగ్నమందావిర్భవించి కృష్ణానది మొదలుకొని నెల్లూరిమండలమున కందుకూరు (స్కందపురము) వరకుంగల కమ్మరాష్ట్రమును పరిపాలించి త్రిలింగదేశమున నత్యంతఖ్యాతి గాంచిన మహారాజు. యీమహారాజు కథనాధారముగా జేసికొని కొంతస్వకల్పితముతో నీనవలను వ్రాసినాడ. అల్పప్రజ్ఞుండగు నేను దీనిని రచియింప బూనుట సముద్రమును తెప్పతో నీదదలచినటులే అయినను ప్రాజ్ఞలీశ్వరుని వలెనేగుణ స్వీకృతిపరాయణు లేయను దృఢనమ్మకముగలవాడనై భగవంతుని కరుణచే నిద్దాని 1920 సంవత్సరము అక్టోబరు 1 వ తేదీన ప్రారంభించి 18 వ డిసెంబరు నాటికి పూర్తిగావించినాడ పాఠక మహాశయులు సహృదయులై మన్నింతురు గాత.

పీరులపాడు,
1—10—20

ఇట్లు విధేయుఁడు,
పాటిబండ్ల వేంకటరామయ్యచౌదరి.

# పండితాభిప్రాయములు

ఈ చరిత్రానాయకుండగు వేంకటాద్రినాయుడు దిగంతవిశ్రాంత కీర్తిమంతుడు. దాతృత్వవైభవములందు సమానుడు ఈతని కాలము వరకు చెంచులు మొదలగు దుష్టులవలని బాధయున యాంధ్రదేశమునందు నతి విస్తారముగా నుండెను. దాని నడంచు కట్టుదిట్టములు చేయుటకు పరిపాలనా విధానము బలిష్ఠముగా లేదు కొద్ది కొద్ది ప్రభువులచే భూమి యాక్రమింపబడి యుండెను. గోలకొండ ప్రభుత్వ మొకింత పెద్దదిగా నుండినను గుడ్డి దర్బారుగా నుండెను. కొండ జాతులును మరాఠీలును దేశము విచ్చలవిడిగా కొల్లగొట్టుచుండిరి. ఈ ప్రభువు దోపిడిగాండ్ర నుపాయాంతరములచేత సాధింప సమకట్టి యందు కృతకృత్యుడయ్యెను. అమరావతీ నగరము నిర్మించి భాగ్యభోగ్యంబులకు కొఱంత లేక యాశ్రితుల పాలిటికల్పతరువై కవిగాయక విద్వజ్జనుల నాదరించుచు సామంత ప్రభువైనను, సార్వభౌముడేమో యని చరిత్రకారులు భ్రమించునట్లు జగత్ పూజ్యంబుగా రాజ్యంబు పరిపాలనంబు గావించె. ఈతని సభారంగమున నప్పుడప్పుడు కవులచే చెప్పబడిన చాటుధారపద్యములు నేటికిని ప్రతిభట్టు నోటను తాండవించుచు దిశల ప్రతిధ్వనించుచున్నవి. ఈనవలలో కవి సందర్భానుసారముగ నా విషయములను పొందుపఱచినాడు

ఇంతలో తనపిజెనక స్వకపోలకల్పిత నాయకను ప్రభువారికి అంటగట్టినాడు. ఇదియెంతగా భావ్యముగ నున్నను నాయికను గురించిన కథాకల్పనము సందసమాన మేధావిశేషమును కనబఱచి పాఠకుల హృదయముల నాకర్షింపజాలి యనుటకు సందియము లేదు.

కొందఱికి నాయికాకల్పన మసంగతముగా జూపట్టు వచ్చునను కొన్నను "ఏకోహిదోషో గుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అను కాళిదాసుని వచనానుసారముగా నిందలి మనోహరకథా సుధాలలహరియందిది మఱుగు తెప్పవలె నుండగలదని నమ్ముచున్నాను.

ఇట్లు,

1—1—32
వీరులపాడు,

జంగా హనుమయ్యచౌదరి
అష్టావధాని.

# విన్నపము

ఈ నవల వ్రాసిన కవి జీవితమునుగురించి యొకింత పేర్కొనెదను. వీరిద్దానిని షుమారు 12 సంవత్సరముల క్రితమే వ్రాసినారు. తదుపరి 8 సంవత్సరముల క్రిందట తనముప్పది రెండవయేట అకాలమృత్యువు వాతనుబడి కీర్తిశేషులైనారు. ఈ యువకుడు మిక్కిలి నిరాడంబరజీవి. పరమసాధు పుంగవుడు. సద్వర్తనా సంశోభితుడు. వినయవిధేయతా శాంతమూర్తి. సూక్ష్మబుద్ధిశాలి. కేవలము భాషయందేగాక గణితమునందును, వ్యవహారజ్ఞానము నందును ప్రజ్ఞానిధి ఇన్నిసుగుణములు గలిగియుండి పౌరులయొక్క మన్ననకును గౌరవమునకును మిక్కిలి పాత్రుడయ్యెను. వీరియకాల మరణము పురజనులనందరిని చాలదినములు దుఃఖవారిధిని ముంచివేసినది. ఈ కవి యీగ్రంథము వ్రాసిన తదుపరి కొంతకాలమునకు దీనరత్నానిధి యను శతకమొకటి రచించెను. అందలి పద్యములు సారళ్యములై మిక్కిలి రసవంతములై భక్తిరసము లొలుకుచున్నవి. ఈ శతకమచ్చొత్తింపబడినది. ఈనవల నచ్చొత్తింప మేము కొన్నిమారులు ప్రయత్నించి ధనాభావముచే మిన్నకుంటిమి కాని యీగాధ సుప్రసిద్ధకథానాయకుని గూర్చి అల్లబడిన దగుటచేతను, కవియందు మాకుగల భక్తి

మూలంబుచేతను, తుదకు కవిస్మృత్యర్థమైనను గ్రంథము ప్రకటించుట యెంతయు భావ్యమని తలపోసి కార్యమునకు పూనుకొని ధనసహాయంబునకు గడంగితిమి. పైజెప్పిన మాయభిమతంబు నెఱింగి యుదారబుద్ధితో ధనసహాయము జేసినచందాదారులకును, పండితాభిప్రాయమును వ్రాసియివ్వవలసినదని కోరినంతనే చక్కని అభిప్రాయమును వ్రాసియిచ్చిన జంగా హనుమయ్య కవిగారికిని అనేకకృతజ్ఞతా పూర్వక వందనము లర్పించుచున్నాము. పరమేశ్వరుడు పూతచారిత్రుడగు గ్రంథకర్త ఆత్మకు శాంతినిగలిగించును గాక.

గ్రంథమచ్చొత్తు కాలమున కొన్ని అనివార్య కారణములచేత మేమెవర మటనుండి తప్పులుదిద్దుటకు వీలుకలుగనందున దోసగులు మెండుగా దొరలినవి. పాఠకులు తప్పులు సవరించుకొని చదువ బ్రార్థితులు

ఇట్లు,

3—1—33
వీరులపాడు.

సుజన విధేయుడు,
వాసిరెడ్డి వీరవరప్రసాద్.



కథానాయకుడు.

# వెంకటాద్రినాయఁడు



## ప్రథమోల్లాసము.

సమస్తప్రాణి సముదయంబులకు జీవనాధారంబులై, నిర్మలనీరసమన్వితంబులై, వర్తకవ్యాపారమున కత్యనుకూలంబులై, స్నానం బొనరించిన మాత్రన సర్వపాపంబులను ఖండించునవియు, దర్శనం బొనరించినంతనే స్వాంతములకు సంతసంబుఁగూర్చునవియై యొప్పునదులతోడను, యసంఖ్య ఫల సమన్వితంబులైన గెలలచే విలసిల్లు కదళీతరువులచేతను, సుధాస దృశంబులగు ఫలంబులుగల నారింజలచేతను నమితంబులగు కొబ్బరిచెట్లచేతను, ఫలముల బరువుచే వినమ్రములై ధరణీ భాగంబునంటిన శాఖా బృందంబుచే చెలువొందు సురసాలముల చేతను, శోభాయమానంబులగు తోటలతోడను, సర్వసస్యంబులు పండునట్టి సారవంతములైన భూములతోడను, పెద్దపెద్ద పట్టణంబుల తోడను, విస్తారమైన

ధనధాన్య సమృద్ధితోడను, బహు విద్యాభ్యుదయంబు తోడను, వెండిబంగారపు గనులతోడను, శత్రువుల కభేద్యము లైన దుర్గములతోడను, విశేష జనసంఖ్యతోడను, పుణ్యతీర్థ ముల తోడను, వాపీకూపముల తోడను, మనోహరములైన సరస్సుల తోడను, కొమరుమిగిలి భూలక్ష్మి మెడయందు దాల్చిన దేశములను రత్నములతో గూర్చబడిన హారమునకు నాయకమణియై యాంధ్రదేశము వెలుంగుచుండును. ఆ యాంధ్రదేశమున నివసించు జనులెల్లరు, విద్యావంతులై, క్షాత్రవంతులై, యభిమానవంతులై, పరోపకార పరా యణులై, ధర్మకార్య తత్పరులై నెగడుచుందురు. వీరిలో కమ్మ వెలమ, రెడ్డి, యీ మొదలగు కులంబులు కేవలము క్షాత్రమే ప్రధానముగా గలవియై, యీ దేశమును పరి పాలించు చుండును. పరమ పవిత్రమగు గోదావరీతటంబున చిరకాలమునుండియు పురాణ చరిత్రాదిక సుప్రసిద్ధంబయి, పూర్వము నిర్మల క్షాత్రతేజోవిరాజితులగు చాళుక్యులచే పరిపాలింపబడినదై, యత్యంతోన్నత సౌధహర్మ్య ప్రసాద విరాజితంబై, యనుపమాన సౌందర్య విభ్రాజితులగు స్త్రీపురుష జనంబులచే నొప్పారెడి రాజమహేంద్ర నగరమునేలెడి రాజ మహేంద్రునకే రాజమహేంద్రుడు సాటియగు నిచ్చట

రేపకడ జరుగనున్న యాంధ్రపరిషత్తును జూచిపోవలయునని యుల్లాసముతో, బదరికాశ్రమ ఋషిసంఘముచే పంపబడి వచ్చితి నారా నేటికి నాశ్రేయంబగు హిందూమత సంఘమంత యు నిచ్చవచ్చినట్లెల్ల కల్లబొల్లులతో నల్లిన కట్టుకథలతో నిండిన పురాణములతోడను, నెవరికొలందివారు కల్పించి చేర్చిన ప్రక్షిప్తశ్లోకంబులుగల ధర్మశాస్త్రముల తోడను, నెంత చీకాకుపడుచున్నది. వర్ణంబులు గుణకర్మ విభాగంబు నగాక జన్మంబుననే కలుగునట. జనకుఁడు బ్రాహ్మణుఁడైన చో కొడుకెట్టి మధు మాంసాది ప్రియుఁడైనను బ్రాహ్మణుఁ డే యగునట. జనకుఁడు శూద్రుఁడైనచో కొడుకెట్టి సత్య దయాశౌచ విద్యావినయ వివేకాదులు గల్గియున్నను శూద్రుఁ డేయగునట. వారు వేదశాస్త్రాదులు చదివిన జిహ్వకోయ టయు, వినిన చెవులయందు సీసముకరగించి పోయుటయుఁ జరుగునట, పక్షపాతరహితుఁడగు పరమేశ్వరునిచే దయచేయ బడిన వేదములను నొకరినిచదువుమని మఱియొకనిని వద్దని చెప్ప వీలుండునా. సకలమానవులు సర్వవేదములను జదివి తదర్థమును గ్రహించి తన్నియమంబులను ననుసరించి ప్రవర్తిం చ వలయునని వేదములయందే సృష్టికర్త విధించియున్నాడు బ్రాహ్మణగర్భ సంజనితులు నిష్ప్రయోజనముగా నర్థమెఱుం

గక వేదము బకబకలాడినను వారిదేహములు పవిత్రములై పోవునట. శూద్రకులజుండు శ్రుతులపఠించి వానియర్థము నెఱింగినను, వాడు పాపభూయిష్ఠుండేనట, బ్రాహ్మణులను వారు భగవంతుని ముఖమునుండి తెల్లనిరంగుతో నూడిపడిరట. క్షత్రియులను వారు బాహువులనుండి రక్తవర్ణముతోఁ బుట్టిరట. వైశ్యులను వారూరువులనుండి పచ్చనిరంగుతోఁ బుట్టిరట. శూద్రులనువారు మాలకాకులవలె నల్లగా పాదములయందుబుట్టిరట. పోని ఒకవేళ నట్టులే పుట్టినారేమో యనుకొందమన్న తెల్లగాగానీ, యెఱ్ఱగాగానీ, యీ యాంధ్ర దేశంబునను నొక్క మనుష్యుండుగూడా లేడే బ్రాహ్మణ క్షత్రియకులంబులు రెండును నీదేశంబున లేవేమో అటులైన నీదేశంబున వేదముచదువుట కర్త్వాత యొక్కనికిఖూడ లేదు వేదము లీదేశము కొఱకుసృజించ బడినవికావు. ఈ శ్రుతి కిట్టియర్థము చెప్పినవాని తెలవినెంతకొని యాడినను తీరదు ఇదిగాక నేజాతియందు బుట్టిన స్త్రీకిఖూడ శ్రుతిపఠనార్హత లేనేలేదట. స్త్రీల విషయమున నీదేశములో మిక్కిలి యన్యాయము జరుగుచున్నది. స్త్రీలు పురుషులతోపాటు సర్వవిషయములయందు స్వాతంత్రములు గలవారినిగా భగ వంతుండు సృజింపక పోలేదు స్త్రీలకు పురుషులకు బుద్ధీంద్రి

యాదులయందు భేదములేవియు కానరావు. మగవాడు భార్య చనిపోయిన మఱల నెన్నిసారు లెందరినైన పెండ్లిచేసి కొనవచ్చును గాని పుష్పవతికాకముందు పెనిమిటి చనిపోయినను స్త్రీకి పునర్వివాహార్హత లేదట. పుట్టినదాది ప్రాణపదముగాఁ బెంచుకొనిన కురులనుకూడ మంగలకత్తి పాలుసేయవలయునట. ముదుకనూలు సైనుదోవతులుదక్క రంగుచీరెల ధరింపగూడదట. వేయేల నన్నముకూడ రెండవపూట భుజింపగూడదట ఇదియెట్టి పాపము. యెంత ఘోరము. ఇదిగాక నీదేశంబున పశుపక్షి మృగాదులకన్నను నీచముగాఁ జూడబడు జాతి యొకటిగలదు. అది భగవంతుని కెక్కడనేరంగుతోఁబుట్టినదో తెలియదుగాని పేరుమాత్రము పంచమజాతియట తజ్జాతిసంభవుల ముట్టుకొనఁగూడదట పర్వదినములయందు వారి మొగంబులు కనుపడిన తత్పాపహారణార్థము పుణ్యనదీస్నానంబొనరించి బ్రాహ్మణులకు దానాదులొనర్చవలయునట వీరు తక్కిన వారి గృహంబుల గోడలలంటుకొనిన నాయిండ్లకు పుణ్యాహవాచనాదు లొనరించి సున్నము కొట్టించవలయునట వీరుగ్రామమునకు చాలాదూరమున గాని నివసింపగూడదట ఇట్టివనేకములుగలవు. వీరి దురవస్థనేమని చెప్పవలయును నేనీదేశమున కాలుబెట్టినది మొదలు

నిట్టి పక్షపాతయుతంబులైన యన్యాయముల నన్నింటినో ప్రతి నిముసంబును కన్నులార జూచుచుంటిని. అల్లదే త్రిమూర్త్యాత్మకుండైన సూర్యభగవానుండపరదిశా సంగతుండయ్యె గగన భామిని సిందూరంపు రంగు చీరెధరించెనే మోయనునటు లొక సంజెంతయు నరుణరోచిర్యుతంబై వెలుఁగొందసాగె నింక కొంచెమాలసించిన నంధతమిస్రభూతము జగమెల్ల నావరించును కనుక నేనిప్పుడే యీపురంబు ప్రవేశించి యీ రాత్రియే పుణ్యశాలియింటనో కొంచెము తలదాచుకొనియెదనని పురంబులోనికి ప్రవేశించి కొంతదూరము నడచుసరికి నొక గృహంబు విశాలంపుటరుగులుగలది యాసిద్ధునికంటబడియె నంత నాసిద్ధుండా యింటిగుమ్మమువద్దకువెళ్ళి వారిని పిలచి వారి యనుమతివెంట నొక యరుగుమీఁద విశ్రమించియుండెను. ఇట్లుండ కొంతసేపటికా యింటిలోనుంచి మెఱుంగునలొకవంటి కన్యకారత్నంబొండు బయలువెడలివచ్చి సిద్ధునివైపు తేరిపారజూచి స్వామీ తమరెవ్వరెందునివసించువారు ఏటికి మద్గృహంబు పావనంబుసేయు తలంపుమీకుదయించె కృపామతి ననుగ్రహింపవేయనిన నాసిద్ధుండు దాని వినయ వాక్యంబుల కచ్చెరువంది యబ్బాలామణితో నిట్లనియె నేను సర్వదా దేశసంచారంబొనరించు సిద్ధుండ రేపుదయంబున నీపురంబున

జరుగఁబోవు నాయాంధ్ర పరిషత్తును జూచుటకై బదరికాశ్రమ తాపసానుమతి నిటవచ్చితిననిన నక్కన్యాకారత్నంబు ప్రహృష్టమానసయై సిద్ధునకుచితరీతినుపచారంబుగావించెను. ఇట్లా కన్యకాకృత బహుళోపచారంబుల కలరి యారేయి గడిపి సూర్యోదయారంభమున పరిషత్తున కేఁగుచు నక్కన్యంజూచి నీ సుశీలగౌరవాదులకు మిక్కిలి సంతసించితి. నీ కనురూప వరుఁడగు వరుని బడసి సుఖింతువుగాతయని దీవించి నడువబోవు సమయమున నక్కన్నియ సిద్ధుంజూచి తమరీపురంబు వెల్వడు నపుడు మీ పునర్దర్శనలాభంబొడగూర్చి మీదాసురాలి నానందింపజేయుడని ప్రార్థించిన సిద్ధుండు తనదివ్యదృష్టిచే నాపె కామితంబు నెఱింగి యాపె తన కొనర్చిన యుపచారమునకు బదులుగా నామహల్లాభంబామెకు జేయువలయునని నిశ్చయించి వల్లెయని యాంధ్రపరిషదున్ముఖుండై నడచుచుండెను.



# వెంకటాద్రినాయఁడు

## ద్వితీయోల్లాసము.

ఇట్లా సిద్ధుండు కొంతదూరము నడచు నరికి నొక విశాలప్రదేశమున బారులుదీర్చి వరుసలవెంబడి రకరకంబుల కుర్చీలు బల్లలు వగైరాలువేయఁబడి యుండెను. అంతట నలుదిక్కులనుండి ప్రముఖులైన వారెల్లరువచ్చి యుచితాసనంబుల నలంకరించుచుండిరి. రవంతసేపచట నిలుచునరికి నాప్రదేశమంతయు నేల యీనినట్టు లాంధ్రమహాజన బాహుళ్యముచేనిండి కన్నులపండు వొనరించుచుండెను. అంతనా సిద్ధుండు తానొక బెంచీపై గూర్చుండియుండెను. అంతలో ఘంటానాద మొకటి పెద్దగావినవచ్చె. నదివిని సభ్యులందఱు నిశ్శబ్దముగానుండిరి. అంతనొక పురుషుండు వేదికపైనెక్కి యెలుంగెత్తి స్మృతిపురాణోక్తములైన వర్ణాశ్రమాచార ధర్మముల కొంతవరకు నుగ్గడించి ముఖ్యముగా మన యాంధ్రదేశీ

యులకు రజస్వలానంతరవివాహములు కూడవనియు విధవా వివాహము లసలే పనికిరావనియు,పంచముల నంటుకొనగూడదనియు, ప్రమాదవశమున తాకిన ప్రాయశ్చిత్తములు చేసికొనవలయుననియు, ద్విజకులములలో మగవారికే తప్ప వేదపఠనాధికారము మఱియొకరికి లేదనియు నొక్కివక్కాణించెను. మఱియొకండు లేచి ప్రథమోపన్యాసకుండు చెప్పినదంతయు సత్యమని యాయాధర్మములు చెప్పబడియున్న శ్లోకపద్యము లచ్చట జదివెను. మఱియొకండు మొదటి యిద్దఱు జెప్పినసంగతుల నుపమానోపమేయములతో నెల్లరకు విశదమౌనట్లుగా నుపన్యసించెను. నాల్గవవా డింతవరకుపన్యసింపబడిన ధర్మములను మన యాంధ్రదేశమందలి ప్రజలకెల్లరకు బోధించుటకై ప్రవక్తలు కొందఱు బయలువెడలి యిప్పుడిప్పు డచ్చటచ్చట నవనాగరికులబోధామృతంబుచే నంకురించుచున్న నూతనాచారబీజంబుల నిర్మూలించి మన దేశము నుద్ధరించుకొనవలయు ననెను. వీరల యుపన్యాసంబుల సభ్యులెల్ల రానందముతో నాలించి తమ సంతోష స్ఫూర్తిని దెలుపు కరతాళధ్వనులు ప్రకటించి సభ ముగించుటకు యత్నింపబోవుసమయంబున సిద్ధుండు లేచి, అగ్రాసనాధిపా!సభ్యులారా!నామనవి నాలించి నావిన్నపమునకుగూడ

కొంచెము గడువిప్పించి సావధానమనస్కులై వినుటకు ప్రార్థించుచున్నాడ. కటాక్షింపుడు. జనులందఱు వేదములే ప్రధానముగా గైకొని వేదోక్తధర్మముల ననుష్ఠించవలయును గాని స్మృతిపురాణాదులు శరణ్యములుగావు. జనులందఱు ప్రమాణముగా జూచుకొని వేదముల పఠించి యందలి యర్థముల గ్రహించి యందు నుడువబడిన ధర్మపద్ధతుల ననుసరించి నడచుకొనుటకుగాను నిష్పక్షపాతియగు భగవంతునిచే వేదములు దయచేయబడినవి. శ్రుతులయం దెచ్చటగూడ నతిబాల్యవివాహములు చేయుమనియు, రజస్వలానంతరవివాహములుగాని విధవావివాహములుగాని కూడదనియు జెప్పబడిలేదు. వేదములయందే 'సర్వవర్ణముల స్త్రీ పురుషులు వేదములు చదివి, యందలి ధర్మములు తెలిసికొనుటకుగాను వేదములు రచియింపబడి'వని చెప్పియుండగా మీ రీయపమార్గమున నేల నడచుచుండిరో తెలియదు. కులంబులనునవి గుణవృత్తంబుల నేర్పడును గాని పుట్టుకచేత గాదు. వ్యాసవాల్మీక్యాదిమహర్షు లేకులంబులవారు? పుట్టుకచే కులంబులేర్పడిన వనిన నాయాకులంబులవారి కాయా నైసర్గికభేదము లుండి తీరవలయును. అటుల కానరావు. నే జెప్పిన సంగతుల న్నియు నీవేదగ్రంథముల నున్న ముక్కలే చూడు డని

తన బొక్కసాను విప్పి తత్తద్గ్రంథంబుల నీపైనుదువబడిన యా
శేయ ధర్మముల నన్నిటిని జూపించి స్పష్టముగా నర్థమును
బద్దలుగొట్టి వినిపించెను. అంత నాసభ్యులంద ఱాశ్చర్యంబున
దేలి యీత డెవ్వడో మహాపురుషుండు.మన దేశ మెంత వివేక
శూన్యదశలోనున్నది. మన వర్ణాశ్రమధర్మములకు శరణ్యము
వేద మనుమాట మఱచిపోయి యెప్పటికప్పటికి కాలానుసర
ణంబుగా స్వార్థపరులు రచించి చేర్చిన ప్రక్షిప్తశ్లోకములుగల
స్మృత్యాదులే మనల నుద్ధరించు ప్రధానగ్రంథంబు లను భ్రమ
లోబడి మాననీయమైన స్త్రీజనంబును మనసోదరులైన పంచ
ములను యెట్టియధోగతులపా లొనరించి వేడుకగా జూచు
చుంటిమి? గడచినదానికి వగచిన నేమిలాభము? ఇంకనైన
నుపేక్ష సేయక యీ మహాపురుషుండు జూపిన శ్రుతిధర్మముల
ననుష్ఠానములో బెట్టి త్వరలో మనదేశంబునగల దురాచార
వృక్షంబుల సమూలంబుగాఁ బెల్లగించివైచి శ్రుతిధర్మబీజం
బులనాటి వాటినంకురింపజేసి యనతికాలములో మహావృక్షం
బులుగా నొనర్చి ఫలింపజేసి వాటి ఫలంబుల మనదేశీయులంద
అనుభవించవలయును. నీ పురుషుండు మన దేశము నుద్ధరింప
నేతెంచిన మనపాలిటి భాగ్యదేవతగాని యన్యుండు గా డని
తమలో తా మినకరస్పర్శచే విరియు తామరలుంబోలె కళకళ

లాడుమోములతో యా పురుషపుంగవుం గాంచి దేవా! తమ రెవ్వరు? యెందు నివసింతురు? తమనామంబుచే పవిత్రతములైన దివ్యాక్షరము లెవ్వి? తమ యకారణదయావిశేషంబులు మాపై బరపి మా దేశం బధోగతిపాలుగాకుండ కాపాడుట కెందుండి వచ్చితిరి? మీ యీదాసులు వినగూడునే యనిన వారలకు నా సిద్ధుండు నా కొకచోట నివాసంబులేదు. నేను సిద్ధుండ. శ్రుతి ధర్మంబుల బోధించుచు పరోపకారార్థము నే నన్ని దేశంబులు తిరుగుచుండుదు. బదరికాశ్రమమునుండి నే నిప్పుడిచ్చటికి ఋషుల పనుపున మీ యాంధ్రపరిషద్దర్శనార్థమై యేతెంచితి ననియె. అంతట నా సభవారందఱు సిద్ధసందర్శనంబున మా నేత్రంబులు పవిత్రంబులయ్యె, మా దేశం బుద్ధరింపబడియె నని బహుప్రకారంబుల గొనియాడి సెలవుగైకొని తమతమ గృహంబుల కరిగిరి. సిద్ధుండంత తాను గడచినరేయి నిదురించిన యింటికివచ్చుసరికి తనకు పరిచితురాలైన కన్యకారత్న మెదురుగావచ్చి నమస్కరించి యుచితరీతి పూజించి కొన్ని మధుర తరఫలంబుల నతనికి కానుకగా సమర్పించెను. సిద్ధుం డాఫలంబుల బుచ్చుకొని సుఖంబుగానుండు సమయంబున నాపె యా సిద్ధుని దరిజేరి మహాత్మా! నేను మీబోటి పెద్దల పేరు వినినంతనే యేవగించుకొనెడి భోగముకులంబునజనించినదాన.

నాకు గొంచెము జ్ఞానముకలిగినదాది నీయాంధ్ర దేశములో చింతపల్లికోటను బరిపాలించు వేంకటాద్రినాయుని రూపగుణాదులు బహుజనుల నోళ్లనుండి శ్లాఘాపూర్వకముగా వినుట వలన నామనంబా మహారాజునందు లీనంబయ్యె. నాతల్లి బహుద్రవ్యాపేక్షురాలు. నన్నేతుచ్ఛనిపాలనో బడవైచి ధనమును సంపాదించుకొన నెంచియుండె. నే నందుల కెంతమాత్రము సమ్మతించనిదాననై చేపట్టిన వేంకటాద్రినాయ మహీపాలునే చేపట్టవలె. లేనియెడ నీదేహంబు బ్రహ్మచర్యవ్రతంబు పాలు సేయవలసినదియే యని దృఢనిశ్చయముతో నుంటి. నాకెట్లైన నమ్మహీపాలుని పాదపద్మసేవ లభించుభాగ్యంబు గలదే యనిన నాసిద్ధుండు ప్రసన్నహృదయుండై దివ్యదృష్టిచే జూచి యారాజచంద్రునియం దనుగతమైన నీబుద్ధిని మరలించుకొనుము. మరలించుకొనవేని కొలదికాలములోనే మహత్తరమైనకష్టంబులు నీపాలబడనున్నవని చెప్పిననక్కన్యకారత్నంబు స్వామీ! యెన్నికష్టముల ననుభవించుటకైన నీదాసురాలు తలయొగ్గియున్నది. ఈ పాపిష్టిఘటము నెటులైన నామహారాజపాదసేవాప్రాప్తిచే పవిత్రమగునటు లొనరింపుడు. అటుగా దీజన్మమున అంత మహాభాగ్యము లభించదందురా దీని నుజ్జగించి మరుజన్మనైన నాభూలోక దేవేంద్రుని దాస్యలాభ

ము వడయుటకై యత్నించెద నన నాసిద్ధుం డోహో సాధ్వీ
తిలకమా! నీదృఢనిశ్చయబుద్ధికి నేమెచ్చితి. నీకొఱకు నేనే
స్వయముగా చింతపల్లికోటకు వెళ్లి వేంకటాద్రినాయ మహీ
పాలునితో నీయుదంతంబు నెఱింగించి నాశక్తిధారవోసి యత
నికి నీయందు మమతగల్గించి నిన్ను తన నగరంబునకు దోడ్కొ
నిపోవునటు లొనరించెదను. వనట దక్కియుండుమని పలికెను.
భోగవధూరత్నం బంత ధన్యోస్మి ధన్యోస్మి మీకృపాసము
ద్రంబు నాపై వెల్లవిరిసె. నా నోములపంట చక్కగా ఫలించె
నా పాపపుంజమలినంబు కడుగబడియె నని కృతజ్ఞతాసూచ
కముగా సాష్టాంగ ప్రణామం బాచరించెను. సిద్ధుండు తనకు
ప్రణామంబాచరించిన వధూతిలకంబును 'శీఘ్రమేవ యిచ్ఛా
ప్రాప్తిరస్తు' అని దీవించి యచ్చటనుండి వెడలి రాజమహేం
ద్రనగరమును వీడ్కొని చింతపల్లికి బోవలయునను తలంపుతో
దక్షిణ దిశాభిముఖుండై చనుచుండెను.





# వేంకటాద్రినాయఁడు



## తృతీయోల్లాసము.

చింతపల్లిలో నొకనాఁడు వేంకటాద్రినాయఁడు కార్యాలోచనామందిరంబునకు మంత్రిసామంతవిద్వజ్జనపరివృతంబుగా జనుదెంచి సింహాసనంబు నధిష్ఠించి వారినందఱ నుచితపీఠంబుల కూర్చుండ నియోగించి మంత్రివర్యుంజూచి మన రాజ్యపాలనంబున దేశంబెల్ల సుభిక్షముగానుండి ప్రజలెల్లరు నేవిధంబైన కష్టమెఱుంగక ధనధాన్యసమృద్ధిగల్గి సుఖముఁగా జీవించుచున్నారా? చోరభయంబిసుమంతైన లేకుండెనా యని ప్రశ్నించిన మంత్రివర్యుండు లేచి చేతులుజోడించి మహాప్రభూ! మనరాజ్యంబంతయు రామరాజ్యంబువలె నెంచునూ కొఱంతవడక సర్వసౌఖ్యప్రదమై యొప్పారుచున్నది. ప్రజలెల్లరు రాజభక్తి విశ్వాసపాత్రులై తమ పరిపాలనాసౌఖ్యంబున గుండెలపై జేతులుబెట్టుకొని హాయిగా నిద్రించుచున్నారని

సమాధానముచెప్పి కూర్చుండెను. రా జంత సభాసదులందఱి నీక్షించి నామనం బేలాఁకో మహోత్సాహముతో నూతన నగరనిర్మాణాసక్తిగలదై త్వరపడుచున్నది. కావున పుణ్య క్షేత్రమున నొకనగరము నిర్మింపవలయు. దానికి దగిన పవిత్ర స్థల మెద్దియో మీమీబుద్ధిచాకచక్యంబులకొలంది నాలో చించి నిర్ధారణ చేయవలయుననిన సభికులందఱు తమ తమ బుద్ధిబలంబుల కొలంది యోచింపసాగిరి. యింతలో నొక విద్వద్వరేణ్యుడు లేచి మహాప్రభూ! మన దేశంబున పరమ పవిత్రమగు నదికృష్ణానది. దానితీరమం దెచ్చటనో మీకు నమ్మ తమగుచోట నగరంబును నిర్మించిన బహులెస్సగా నుండుననిన సభికులెల్ల కానోననిరి. సిద్ధుండా సమయములో మహారాజును సమీపించెను. సభికులెల్ల రెవరా యితండని సంశయాస్పదులై చూచుచుండిరి. రాజును నాసిద్ధునివైపు నిదానించి చూచి యీతం డెవ్వరో మహాత్ముండని గ్రహించి సింహాసనంబుపై నుండి దిగి నమస్కరించి యాతని నుచితపీఠంబుపై గూర్చుండ నియోగించెను. పిదప సభాసదులంద ఱొక్కపెట్టున నాతనికి వందనంబు లాచరించిరి. మహీపాలుం డంతట నానవీనపురుషుం గాంచి స్వామీ! తమవృత్తాంతమును సావకాశముగా వినిపించి తమరాకకు గారణంబు దెలిపి మమ్ము ధన్యుల జేయుం డనిన

నతఁడు సర్వదేశసంచారం బొనరించు సిద్ధుండ. భవద్దర్శ
నార్థమై రాజమహేంద్రనగరమునుండి వచ్చితి. తమ కేకాం
తంబున కొంతనీతికథాభాగం బుపదేశింపవలయును గనుక తమ
యేకాంతదర్శనంబునకు నిరీక్షించుచున్నాడ ననిన రాజు
సభ్యులకు సెలవు నొసంగి తా నొకవిజనప్రదేశమందలి శృం
గారహర్మ్యంబున సిద్ధసహితుండై ప్రవేశించెను.

అప్పుడు సిద్ధుండు రాజుం జూచి—దైవసమములుగా
నీ వేయే వస్తువుల భావింతు వనిన నాతం డిట్లనియె.

రా—ముఖ్యముగా బ్రాహ్మణు లను వారిని మాత్రము
నానేత్రి నిడికొని దైవమునకంటె నెక్కువగా పూజించి
వారిపదసేవ యొనర్చుచుందును.

సి॥—బ్రాహ్మణు లనగా నెటువంటివారు?

రా॥—పూర్వమునుండి బ్రాహ్మణనామకులై యుండిన వారి
గర్భముల బుట్టినవారు.

సి॥—బ్రాహ్మణనామకగర్భసంజనితుడై మధుమాంసాదుల
రుచు లెఱింగిన నీచాగ్రేసరచక్రవర్తి కూడ పూజ్యు
డగు బ్రాహ్మణుడేనా?

రా—వారిపాపములచే వారు నశింతురు. అత డెట్టివాడైనను
బ్రాహ్మణునియింట బుట్టినవాడు మన కన్నివిధముల
పూజార్హుండుసుమా!

॥—కాదు, కాదు పొరబడితివి. వేదసారమైన వజ్రసూచికోపనిషత్తిదుగో. కొంచెము విశాలబుద్ధితో పరిశీలించుము.

రా—వజ్రసూచికోపనిషత్తు చేతబుచ్చుకొని సాంగోపాంగముగా బరిశీలించెను.

సి॥—ఏమిరా? మనంబునకు సరిగా బోధపడినదా?

రా॥—స్వామీ! దీనిలో నిట్లు చెప్పబడియున్న దేమి? పుట్టుకతోడనే బ్రాహ్మణత్వము కలుగ దట! బ్రహ్మజ్ఞానమెవ్వని కుండునో వాడే బ్రాహ్మణు డట! ఇది యెట్టి వింతమాట? నే నిదివర కెన్నడు నే పురాణంబున గూడ నీసంగతి వినియుండలేదే-

సి॥—మీకు శరణ్యగ్రంథములు వేదములా, పురాణములా?

రా॥—మే మిదివరకు పురాణములే ననుకొనుచుంటిమిగాని వేదములలో నేమి వ్రాయబడియున్నదో కూడ నెఱుంగము.

సి॥—రాజా! యీరోజు మొదలుకొని వేదము నీవు చదివి యందలి యర్థంబులతో పాటు ధర్మంబుల గ్రహించి యవి యనుష్ఠానములో బెట్టి నీ వాచరించుచు నీదేశమందలి ప్రజలనుగూడ వేదములు చదివి తద్ధర్మముల

ననుసరించి నడచుకొను మనుచు గఠినముగా నాజ్ఞాపింపుము.

రా॥—స్వామీ! మీచే నీయబడిన వజ్రసూచికోపనిషత్తు నర్థముతో సహా చదివినవెంటనే నామనంబు వ్యాత్యాసంబు చెందె. నిజముగా నిక బ్రహ్మజ్ఞానము గల్గినవారెందుండినను గాని వారి నాదేశంబునకు బిలిపించి యమ్మహాత్ములతో సాంగత్యం బొనరించుచు వారి పాదోదకంబు శిరంబున దాల్చుచుండెద. మీదివ్య బోధనామృతంబున నామనోబీజంబున జ్ఞానాంకురంబుదయించె. దాని బహుశ్రద్ధతో వృద్ధిపరచి ఫలింప జేసి కొలదికాలంబులో నాఫలంబుల నారగించి బ్రాహ్మణుండ నయ్యెద.

సి॥—రాజా! నేను ముఖ్యమైనమాట యొకటి చెప్పెద వినుము. పరులు నీ కేయేకార్యము లొనర్చిన కష్టముగా నుండునో యాయాకార్యముల నీవు పరులకు జేయకుము.

రా॥—నిజము స్వామీ! నిజము. నిజము.

సి॥—అట్లయిన నొకదేశంబున నొకకన్నియ యొకపురుషుని దృఢనిశ్చయబుద్ధితో కామించియున్నది. అతడు లభిం

చనియెడల మృతించుట నిశ్చయము అది యెట్టిహీన జాతి యని పిలువబడుదానిగర్భమున బుట్టినప్పటికి నాకామితపురుషునియందు దానిని భరించు భారమున్నదా! లేదా?

రా॥—నిన్నందేహముగా నాపురుషుండా యతివను స్వీకరించి తీరవలయును.

సి॥—వినుము. రాజమహేంద్రినగరంబున నొక భోగవధూరత్నంబునిన్నుదృఢనిశ్చయబుద్ధితో కోరియున్నది. దాని పేరు కలభాషిణి. దానియిల్లు గోదావరీతీరంబున నూరిలోనికి వచ్చుబాటకు కుడిప్రక్కగా నున్నది. దానితల్లి వివేకశూన్యురాలై దాని నేతుచ్ఛనిపాలనో బడవైచి ధనమును సంపాదించుకొనన నెంచియుండె. దాని నీవచిరకాలంబున నీకోటకు రప్పించుకొని నీముఖచంద్ర దర్శనంబున దాని నయనచకోరసాఫల్యత గాంచ జేయుము.

రా॥—స్వామీ! అటులనే యొనరించెదను. మీరు మద్గృహంబునకు వేంచేయుటచే నే నన్నివిధముల ధన్యుడను. ఇదే నమస్కరించుచున్నాడ నని నమస్కరించినరాజును "శీఘ్రమేవ బ్రహ్మజ్ఞానసిద్ధి రస్తు" అని దీవించి

సెలవుగైకొని సిద్ధుండు పరోపకారార్థమై దేశాటనంబు పనిమీద వెడలెను. వేంకటాద్రినాయుం డంతట సిద్ధునిచే జేయబడిన జ్ఞానబోధంబును, భోగవధూరత్నమును స్వీకరించు మనిన సంగతిని, మంత్రులం బిలిపించి శ్రోత్రపర్వంబుగా వినుపించెను. మంత్రులు రాజుతో స్వామీ! తమభాగ్య మన్యజనదుర్లభము. మీసాంగత్యము మాకు లభించుటకు తొలిజన్మంబున మేము నెన్నియో పుణ్యంబు లొనర్చితి మని యెంచుకొనవలయును. మీరును సిద్ధనిర్దేశితమైన గణికామతల్లిని మనపురంబునకు గొనివచ్చుటకై తగువాని నొకని నియమించుడు అనిన నారాజమౌళి తగువా డెవడో మీరలే నిర్ధారణచేయుం డనియె. మంత్రులు మార్గములన్నియు జక్కగా నెఱిగినబుద్ధిమంతు డగు మనవేగులవాండ్రలో నొకని పంపిన మెలకువతో నామె నిటకు తోడ్కొని రాగలం డన రాజు వల్లె యని వారిలో నుత్కృష్టుం డగు వానిని బిలిచి నీవు రాజమహేంద్రనగరంబునకు వెళ్లి గౌతమీతీరంబున నూరిలోనికి వచ్చు రాజమార్గంబునకు కుడివైపుగా నున్న వేశ్యాగృహంబునకు వెళ్లి తద్గృహంబున నివసించు కలభా

షిణి యను కన్యకారత్నంబునకు నీముద్రిక నానవాలు జూపి దానితల్లి కీయుదంతంబు దెలియకుండ దాని నా సన్నిధానంబునకు దోడ్కొని రమ్ము. నాపేరు జెప్పి యీయానవాలు జూపిన నక్కాంత సంతసంబున నీ వెంట వచ్చు నని చెప్పి తనయంగుళీయకమును వాని కిచ్చెను.

రాముసిం గాయంగుళీయకమును గైకొని యుత్తర దిశాభిముఖుండై పుష్పఫలతరుశోభితంబులై అత్యంత రామణీయకంబులగు వనంబులను మందసమీరంబు వీచును డెందంబునకు హాయిని గూర్చు సమయంబుల విశాలపులినతల్పాభిరామంబులై పరిశుద్ధజీవనంబున విలసిల్లు నవిద్యైన నదీమతల్లికలను నిర్గమించుచు నసంఖ్యాకంబులైన జనపదంబుల దాటుచు లేజివురు మెక్కి కర్ణానందంబుగా గానమొనర్చు కోకిలల నగ్గించుచు నత్యంతోన్నతంబులైన సౌధహర్మ్యప్రాసాదవిలసితంబులగు పట్టణరాజంబుల దిలకించుచు భూలోకకైలాసంబయిన రాజమహేంద్ర నగరమున కనతిదూరమున నొక విజన ప్రదేశంబున తననిజరూపంబు మాటుపఱచి బైరాగివేసం బొకటి ధరించి నడచుచుండెను.

ఇట్లు కొంతదూరంబు నడచునరికి మహారమ్యంబుగా

నగరరాజంబును గౌతమీనదీతటంబును గన్నులపండువుగా న
లంకరించెను. ఆనదీతీరంబున నుద్యానవనంబులో యౌవనారంభ
దశచే నొప్పారు గులుకు మేనులుగల తరుణీమణులిద్దఱు
విహరించుచుండిరి. ఆకపటవిరాగి యాయువతీమణుల జూచి
సంశయించి వారిపరస్పరసంభాషణలచే వారియుదంతంబు
నారయుచలయు నని సమీపగౌతమీజలంబుల స్నానంబొనర్చు
నెపంబున గాలయాపనం బొనరించుచుండెను. అంత వారిరువు
రిలో నొకచిన్నది కలభాషిణీ! తల్లిమాటను త్రోసివేయుట
ధర్మముగాదు. మనకులంబునబుట్టినవారెట్టిదైన ధనమును
సంపాదించుటే ప్రధానముగాని వారల కులరూపగుణాదులతో
నావశ్యములేదు. భోగపుజాతియందు బుట్టినయాడుది యెట్టి
హీనుడైన నెట్టిదుర్గుణుడైన ధనవంతుడాయెనేని వాని
చేపట్టి వానియైశ్వర్యసర్వస్వము నపహరించుటే దానిప్రయో
జకత్వము. ఒకనియందు మమత మనకులంబున బుట్టినవారికే
కోశంబున నుండగూడదు. ఎవడో వేంకటాద్రినాయుడను
వానిపై వెఱ్ఱినమ్మకము బెట్టుకొని సిరి యింటికి వచ్చుచున్న
మోకాలొడ్డెదే? పాతూరిపట్టాధీశుండైన సూర్యనారాయణ
రావుం జేపట్టి పెద్దయగ్రహారం బొకటి సంపాదించుకొని
సుఖించుము. నీబోటి తెలిసిన దింతగా జెప్పించుకొనుట

మూర్ఖ మనుపించుకొను నని బోధించిన సర్కలభాషిణి దానిం జూచి కిరవాణీ ప్రియమైనవస్తువును వీడి యప్రియంబును జేపట్టు మనిన నెంతయవివేకురాలను సమ్మతించునే? కాయం బుకాని ద్రవ్యంబుకాని శాశ్వతమైనవి కావు. మనయం దున్నజీవాత్మయే పరమాత్మ. ఇది యెప్పటికైనను చెడని పదార్థము. అస్థిరపదార్థముల నెంతమాత్రము నమ్మకూడదు. దృశ్యరూపంబైన ప్రపంచబంతయు మిథ్య. మిథ్యాప్రపంచ మందలి యస్థిరసుఖంబుల కాసించి యంతరాత్మను హింస జేయుట పాడిగాదు. నాయంతరాత్మ యామహాపురుషుని దివ్యతేజంబున నైక్యం బయ్యె. దూదిపింజలచే నగ్నిహో త్రంబు కప్పంబడునే. నీహితబోధం బిం దెంతమాత్రంబును పనిజేయజాలదు. వృథా కంఠశోష నీకేందుకు? నీపనిమీద నీవు బొమ్ము అని నిర్మొగమోటమిగా వచించిన యక్కిరవాణి యెంతవేదాంతివి బయలువెడలితివే. ఒకరికర్మమున కింకొక రేమి చేయుదురు? నీగతి యెట్లున్న నట్లు జరుగు నని మొగ ము చిట్లించుకొని వెడలిపోయెను.

ఇదియంతయు శ్రద్ధమెయి నాలకించుచు స్నానం బొన రించుచున్న బైరాగి గౌతమినుండి బయలువెడలి మనమహా రాజుగారు తోడ్కొనిర మ్మనిన కన్యకారత్నం బిదియే యని

వెదుకబోయిన లత పదముల దగిలినందుల కెంతయు సంత సించుచు మెల్లగా తత్తీరముననున్న నక్కన్నియ చెంతకు నెల్లి నిలిచియుండెను. కలభాషిణి యంతట బైరాగిం జూచి యెవరు నీవు? ఇచ్చటి కేందుకు వచ్చితి వని యడిగిన బైరాగి తనచెంత నున్న యంగుళీయకమును దీసి చేతి కిచ్చి యీమహారాజు పనుపున నిన్ను చింతపల్లికోటకు దోడ్కొనిపోవుటకు వచ్చితి ననెను. భాగవధూరత్నం బాయంగుళీయకంబున బిరుదు సహితముగా చెక్కబడియున్న వేంకటాద్రినాయునిపేరుం గాంచి యమ్మహారాజు దర్శనంబు తన కిచ్చిన యట్లు సంతసించి కండ్ల నద్దుకొని వెంకటాద్రినాయునిదూతయే యిట్లు ప్రచ్ఛన్న రూపంబుతో నెవరికంట బడకుండ తన్ను దోడ్కొనిపో వచ్చి నాడని యెంచి యతనితో మహాప్రసాదము! ఇచ్చటనుండి యే యీదారినిబట్టి వెళ్లుదము. నడువుమనెను. రామసింగాపె నూరివెలుపలి బాట పట్టించి తానును బైరాగిమాదిరి నాపెకు కొంచెము దవ్వుగా ముందు నడచుచుండెను. నగరంబు దాటువరకీమాదిరి నిష్క్రమించి గోదావరీనదిని దాటి కొంచెముదూర మేగి తననిజరూపంబు ధరించుకొని నిర్భయ ముగా నామాసినీరత్నముతో నెమ్మదిగా నడచుచుండెను.





# వేంకటాద్రినాయుడు



## చతుర్థోల్లాసము.

కలభాషిణి తల్లిభుజించుసమయం బతిక్రమించినను ముఖచంద్రమండలమున వెల్వడిన చిఱునగవువెన్నెలల నయనచకోరముల నలరించుపుత్రికారత్నంబు మదగజయానంబున క్రాంజ్జగూనడలతో మట్టియలకింకిణులు కరకంకణఝణంఝణలు చెలంగ నిర్భాగ్యధామంబగు తనమందిరంబు నలంకరింపమి చెన్నుదఱిగి విన్ననగు మొగంబున వక్రమార్గంబునకు వన్నెబెట్టు నడలతో క్రన్నన క్రొన్నన పొన్నగున్నలచెన్నున వన్నెకెక్కిన యుద్యానంబును దఱిసి యాం దరసి తనమురిపెంపుబరణి తననోములపంట తనభాగ్యంపుపేటిక గాంచు భాగ్యంబు వ్యర్థం బగుడు దరిదోచక దురవగాహంబగు పరవశత్వంబున ధరణీతలంబున మూర్ఛవ్రాలి తచ్ఛీతలవాతాఘ్రాణస్పర్శనంబుల తెప్పిరిలి శోకదేవత మూర్తిభవించిన తెఱంగున చెవులు చిందఱగొనునట్లు హాహాకారంబులు సేయుచు కెంధూళితో పొందొనరించుచుండెను. అంత సమీపస్థులుకొందఱా వేశ్యమాతం గలిసి దానిరోదనంబునకు

గారణం బెఱుఁగఁగోరిరి. కాని యొకరైన తద్వృత్తాంతంబు నెఱుంగమి సఫలీకృతమనోరథులు కారైరి. కొందఱు పుణ్యాత్ములుమాత్రము నోటింగో నోరు వెట్టి బిగ్గరగా నవ్వా! యేటి కిట్లడలెదవు? నిన్నెవ్వ రేమనిరి? నీ కేమి విపత్తు సంభవించె? ధైర్యం బవలంబించి మాకు నీశోకభారంబును దెల్పి కొంత మాన్పి మోము మని నేత్రాశ్రుధారల తమయుత్తరీయాంచలంబుల నొత్తుచు కొంతవడికి విశ్వప్రయత్నంబున కొంచెము ధైర్య మావహిల్లం జేసిరి. అప్పు డవి పెదవులు తడబడ హీనస్వరంబుతో నాయనలారా! యేమి చెప్పుదును. నాబంగారుబొమ్మ నాముద్దులగుమ్మ నాకలభాషిణి నానోట మన్నుగొట్టి యదృశ్యమయ్యె. నాపెన్నిధాన మెం దరిగెనో తెల్పి పున్యంబుగట్టుకొను డయ్యలారా! యని బావురు మని తొంటి రీతి నేడ్వసాగెను.

పిదప నచ్చటిజనులందఱు గ్రామ మంతయు వెదకిచూచిరిగాని కలభాషిణి కల దని పలుకువా డొక్కండును లేకయ్యె. ఒకవిదేశీయుండుమాత్ర మచ్చటివారివలన నాసంగతి యెఱింగియూరికి దక్షిణముగా నున్న యరణ్యమునందలి యొకమార్గంబున నొకభాసురాంగి యొకపురుషుని వెంబడించి పోవుచున్న దని చెప్పి దాని రూపరేఖావిలాసంబులు ప్రత్యక్షముగా నుండిన ప్రతిమను వర్ణించి చెప్పినట్లుగా వర్ణించి చెప్పెను. అది విని వారంద ఱాపోవునదే కలభాషిణి యని నిశ్చయించుకొని యావృద్ధవేశ్యను సమీపించి ఓసీ! మూర్ఖురాలా! యెందు కేడ్చెదవే? నీకూఁతు రీయరణ్యంబునం బడి

యొకనూతనపురుషునివెనువెంట నెచ్చటికో యేగుచున్నదట. అదియేమి పిచ్చిది కాదులే! రెండురోజు లెచ్చటనో తిరిగి వాఅల నిలు సేరును. దానికై నీవు వగవ నవసరములే దని యూరడించిన నావృద్ధవేశ్య కాదు కాదు తండ్రులారా! అది కొంతకాలమునుండి యెవరో వేంకటాద్రినాయుడట. వానిని వరించి యుతడున్న చోటికి వెళ్లవలయుననుయత్నములో నున్నది. నేనే వలదని వారించుచుండ నిన్నిరోజులనుండి యుండినట్టేయుండి నాకు చెప్పకనే బయలుదేఱిపోయినది. దానినివిడచి నేనెట్లు జీవింతు ననుచు నేడ్చుచుండ నొకయింతి వచ్చి యామూసలిదానిని తనయింటిలోనికి గొనిపోయెను.

పాతూరిపట్టణాధీశుం డగు సూర్యనారాయణరావుచే బంపబడి తన్ప్రజ్ఞావిశేషంబున కలభాషిణి కలకదీర్చికొని పోవలయు నని వచ్చినవా డాజనసంఘంబున నొక డుండెను. వాడు రాజమున్ననకు పాత్రుడగుభాగ్యంబు తన కబ్బమి విచారక్లేశములతో పాతూరిలోనున్న భూవిభుం జేరి తన్ను నియమించిపంచిన కార్యపర్యవసానము మాటలతో గాక మొగంబుతోనే విన్నవించుకొనునట్లు నిలిచియుండెను. భూవిభుండును నిరాశాహతమానసుండై నీపోయినకార్యసిద్ధి వదనమే సూచించుచున్నది. కాని వాగ్రూపమునగూడ వినవిచ్ఛగించుచున్నాడ ననిన జరిగినవృత్తాంతము పూసగ్రుచ్చినట్లు విన్నవించె. పౌరుషంబునకు మూలస్థానం బగు వెలమలవంశంబున బుట్టినవా డగుటను, రాజ్యమదాంధీకృతచేతస్కుండగుటను, యువప్రాయుండై భవోపేతుండగుటను. అవమానభరంబు భరింపరామి తైలసంపర్కంబున ప్రజ్వలించు వహ్నిచందంబున

తీక్ష్ణతరమానసుండై యబ్బాభ్రుండు వెలుంగసాగెను. ఆక్రో
పరూక్షవీక్షణంబులు సమీపస్థభటవర్గాదులగుండెల కీలుపో
టులై నాటుచుండెను. ఇట్లుండ నామహాగ్నిజ్వాలాముఖం
బున 'రాజాజ్ఞ యని మంత్రిసత్తములు నిటు దోడ్కొని రండు'
అను శబ్దము కర్ణగోచరం బగుడు భటులు కొందఱు వడివడి
నేగి మంత్రుల కెఱింగించి తోడ్కొనివచ్చిరి. మంత్రుల
ముఖచంద్రమండలంబుల డంబుల దర్శించిన యంతన రాజు
కోపాగ్ని చల్లారి శాంతివహించెను. మంత్రులు నమస్క
రించి యుచితపీఠంబుల నలంకరించిరి. అప్పట్టున రాజు
మంత్రులారా! నాయాజ్ఞ నుల్లంఘించి నన్నొల్లక కలభాషిణి
రాజమహేంద్రనగరమునకు దక్షిణారణ్యమార్గంబున నొక
పురుషాధముని వెంబడించి పోవుచున్నదట! అతం డెవ్వరో
కాని యావేశ్యమాత్రము వేంకటాద్రినాయమహాత్ముని వరించి
చింతపల్లిఁబోవుచున్నదట. ఆరణ్యమార్గంబుల గాచి దానిని
బట్టి తెచ్చి మన కొప్పగించగల బుద్ధిబలకౌశలంబుండు మన
భృత్యవర్గంబున నెవడో త్వరితముతో సావధానచిత్తముల
నాలోచించి నిరూపింపు డని ముదలయిడ కొంచె మాలో
చించి మంత్రిసత్తములు రాజుతో నృపాలచంద్రమా! మన
భృత్యవర్గంబున నయ్యారణ్యమార్గంబుల సరిగా గుర్తెఱింగిన
వా డొక్కండును లేడు. అదియునుంగాక యన్యునివలచియున్న
భామినిని బలవంతముగా దెప్పించుట భావ్యము గాదు. దాని
వలన ననేకజనసంఘంబులు బద్ధవైరమగుటయే ఫలముగాని
యన్య మేమియు లేదు. మనపాపపుణ్యముల విచారించు
న్యాయాధికారియెదుట యిది సమంజసకార్య మని బుజ్జ

వీయలేము. ఏతత్ప్రయత్నం బుడుగు టుత్తమం బని బహువిధంబుల బోధించి చూచిరి కాని తనను వరించక యన్యుని వరియించిన దనెడు యవమానభరంబున ఘూర్ణిల్లుచున్నచిత్తసముద్రంబును శాంతింపజేయవీలుగామి మనకు బరమాప్తుండై భిల్లనాయకుండై సమస్తారణ్యమార్గసంవేదియైన భైరవనాయకునిచే నీకార్యంబు సఫల మగు ననిరి. ఆమాట నృపాలుండు విని కడునుత్సాహముతో తనకు విశ్వాసపాత్రుండైనవాడును, భైరవనాయకుని బాగుగా గుర్తెఱింగి యతని పరిచయముగలవాడును గొంచెము బుద్ధిశాలియు నగు దూతను బిలిచి భైరవనాయకుని కెఱింగించెడువిషయంబంతయు వానికి దెల్పి కార్యసాఫల్యంబొనరించుకొని రమ్ము పొమ్మని యాజ్ఞాపింప నతండు మహావేగంబునం జని భైరవనాయకుని సమీపించెను. సర్పంబువోలె బుసకొట్టుచు నతివేగముగా తన్నుసమీపించిన రాజదూతను భైరవనాయకుం డీక్షించి "ఏమేమేమి" యని యాతురంబున దీనత్వంబు సూచించుమొగంబుతో బలుకరించెను. అంతట నతం డిట్లనియె—

దూత—రాజుగారొకకార్యార్థమై సత్వరంబున నన్ను నీకడకు బుత్తెంచిరి.

భైరవుడు—అదేదియో త్వరగా వినుపించి నామనోవేదనను బాపుము.

దూత—రాజమహేంద్రనగరనివాసిని యగు కలభాషిణి యను భోగకన్యను రాజుగారు చేపట్టవలయు నని వర్తమానములంపుచుండుట మీకు దెలియునుగదా!

భైర — తెలియును. అదేమైనది? మనరాజుగారియింటికి నలంకరించినదా?

దూత — అట్టిభాగ్యము దానికుండిన నాకీగతి యేల బట్టును?

భైర — ఆదౌర్భాగ్యవంతురాలు మనరాజుగారియాజ్ఞ నుల్లంఘించెనా?

దూత — దానిసకు బరమాన్న మిముడునా? నిన్నటిరోజున దానికొఱకు మనరాజుగారు దూత నొకని బంపించిరి. అతడు వెళ్లువరకది యెవ్వరినో నొకపురుషుని సహాయంబుగా గొని రాజమహేంద్రనగరదక్షిణారణ్యమార్గమునుబట్టి నడచుచున్న దని యొకబాటసారి చెప్పగా విని యుతం డావర్తమానము మనప్రభువుగారి కెఱింగించెను.

భైర — ఔరా! ఇంతసాహసించినదా? భైరవనాయకుం డతని భృత్యుం డని యెఱుంగదు కాబోలు! బోగపుజాతిని జీల్చి చెండాడినను బాపంబు లేదు.

దూత — అప్పుడు రాజుగారు నీ కెట్టియాజ్ఞ యిడునో యూహించుము.

భైర — ఏమియాజ్ఞ యిడును. దానినిబట్టి దానిరక్తమాంసంబుల మము విందొనర్చుకొను మనును.

దూత — అట్లుగాదు. దానిని పట్టి తెచ్చి తనముందట బెట్టవలయునట! అప్పని నీవలననే యాగు నని నిశ్చయించి తన మాటలగా నీతో జెప్పుమనిన వాక్యంబులు వినుము. తా నాముక్కడివేశ్యచే నిక్కముగా నుక్కుదక్కి మొక్కవోయి ప్రసుక్కతి ననియు, దానిశ్రమల బరచి

దుఃఖవారాశి ముంచినకాని తనయవమానాగ్ని చల్లా రదనియు, ఈగహనమార్గంబులు నీవుదక్క నన్య్ లేరును సరిగా దెలియజాల రనియు, అది చింతపల్లి కోట చేరకుండ మార్గమధ్యమునబట్టి తేగలసమర్థుండ వీవె యనియు, తన కీమేలొనర్చిన జన్మాంతము మఱువ ననియు దీనముసూచించుమొగంబుతో విన్నవించె.

భైర—ఇంతిస్వల్పకార్యంబున కింతగా చెప్పవలయునా? కాకిచే కబురంపిన నాదుష్టురాలి బట్టి కట్టి కొనివచ్చి తనకాళ్లముందు బెట్టనా? ప్రభువున కవమానం బొడ గూడిన నాకు గల్గినటులుగాదా? ఇదే చూడు. నాసై న్యమంతయు గూర్చుకొని యాయామార్గంబుల కాపు వెట్టి యానీచురాలి నిప్పుడే బట్టితెచ్చెద నని నగారా నించుక ప్రయోగించెను వెంటనే నలుదెసలనుండిచిమ్మ చీకటులు గ్రిమ్ముకొనునట్లు నేలయీనినచందంబున చెంచుసైన్యంబు క్రిక్కిఱిసె. అంతట భైరవనాయ కుండు తనసైన్యమున కిట్లు ముదలయిడియె. మీా రీయ రణ్యమార్గంబులనన్నింటిని గాచి చక్కనిచుక్కలవంటి కన్నె లెందవుపడినను నాయొద్దకు దొడ్కొని రండు, పొండు. నేను నొకబాట కాచియుండెద.జాగ్రతజాగ్రత.

అత్తఱి భిల్లులందఱును బరుగుపరుగున వెళ్లి యరణ్య మార్గంబులనన్నింటిని గాచియుండిరి. అయ్యరణ్యంబున నొక కలభాషిణి పథశ్రమంబు దోపకుండ నప్పురుషుం డుగ్గడించు వినోదకథాశ్రవణంబున నతికుతూహలమానసయై నడచు చుండెను.

---

# వేంకటాద్రినాయడు



## పంచమోల్లాసము.

ఆహా! ప్రకృతిసౌందర్యంబు వేయిగన్నులం గాంచిన గఱవుదీరదుగదా! నైజసుందరంబైన వనంబునగల వృక్షంబులు చిగురించి యాచిగురు మెక్కి పికసముదాయంబు రాగమాలాపనఁ జేయుచు శ్రవణానందము గావించుచుండ వృక్షంబులనుండి వచ్చు చల్లనిగాలి గమనాయాసంబు బోగొట్టుచుండ సంతసంబుగా కలభాషిణిరాజపూత లొకరోజు నడచి సాయంత్రంబున నచ్చటికి సమీపమందుండు గ్రామంబు జేరి యందా రాత్రి గడపి మఱుసటిరోజు యాసుదయం బగువఱకు నడచి యచ్చటి కనతిదూరమందున్న నదియొద్ద విశ్రమించుటకై యేగుచుండ తమకు సమీపమందున్న గుంపుపొదలలో నాటవికుల గుసగుసలు వినంబడియె ఆ గుసగుసలు చెవులబడినతోడనే వీరిగుండెలు దడదడలాడె, కాళ్లు గడగడలాడె చిత్తంబు లుత్తరించె. నడలు తడబడియె మోములు కళలుదప్పె తనవులు చెమరించె అంతలో బమ్మరాకాసుల, యమభటుల దలపించు వారిభయంకరరూపంబులు కన్నుల

బడియె. అప్పుడు వీరిస్థితి యెట్లు లుండునో యూహింపదగును
గాని వర్ణింపననువుపడదుగదా! మిన్నువిఱిగిపడినట్లైన వా
రేమి తెలియక చేతనంబులుడక్కి చిత్రించిన తెరబొమ్మలవలె
నిలువంబడి యనిమిషభావంబు సూచించుచుండిరి. అంతలో
దైత్యసములైన చెంచులు వారిని సమీపించి మృత్యువక్త్రం
బులబోలు వక్త్రంబులు దెఱచి యింక నెందు బోయెదరు
నడువుడు నడువుడు మా భైరవనాయకునికడ కంచు బిగ్గఱగా
నఱచిన పరవశస్వాంతులై ఝంఝామారుతంబున గూలు
కదళికాపాదపంబులచందంబున నేలం బడిరి. చెంచులు వారిం
జూచి ఓరా! వీండ్రు బహుటక్కరులు. మనము జూచి
నంతనే చచ్చినవారిమాదిరి నేలపై బడిన విడిచిపోవుదు మని
యెంచి యిట్లుచేసిరి. పట్టుడు, రెక్కలువిఱిచికట్టుడు. మన
నాయకునికడకు దోడ్కొనిపోదము అని హెచ్చరించుచు
ప్రాణావశిష్టులైయున్న కలభాషిణీరాజదూతలరెక్కలు విఱిచి
కట్టి యెత్తుకొనిపోయి భైరవనాయకునియెదుట బెట్టిరి. వెంటనే
భైరవనాయకుండు కట్లువిప్పు డని యాజ్ఞాపించెను. కట్లు విప్పి
నను గొంతతడవు వారు నిస్పృహులై యుండి యచ్చటి శీతల
వాతస్పర్శనంబు తెప్పరిలి కన్నులు దెఱచి రాజదూత ధైర్యం
బవలంబించి చూచి వాండ్లు చెంచు లని తెలిసికొని నాయకు
నితో నయ్యా! మ మ్మిచ్చటి కెందులకు దెప్పించితిరి. మేము
మీ కెన్నడు నపకారము తలపెట్టి యెఱుంగమే నిరపరాధుల
మ మ్మిట్లు హింసించుట పాడియే యనిన భైరవనాయకుండు

ఓరీ కుంకా! నీతో మా కేమియు పనిలేదు. మాకన్నుల యెదుట నుండక శీఘ్రంబ వెడలపొమ్ము. లేదేని నీకంఠం బుత్తరించి మామైసమ్మకు బలిబెట్టించెద నని గ్రుడ్లుఱుముచు పలికిన నాతండు మహాభయంబుతో చిత్తము చిత్త మనుచు తడబడునడలతో నచ్చోటు వాసెను. కలభాషిణి తనవెంట నుండిన రాజదూతనట్లు గ్రుడ్లుఱిమి వెడలగొట్టుట జూచి తన ప్రాణంబుపై నాసవదలెను. కాని యట్లు జరుగలేదు. భైరవ నాయకుని కాకన్యకారత్నంబును వీక్షించినంత దానియదృ ష్టమేమోకాని దాని నేమనుటకు మనసొప్పక కొంచెము ప్రసన్నదృష్టితోనే జూచుచుండెను. అతండు ప్రసన్నదృష్టితోఁ జూచుట నీపెను సముద్ధరించుటకు కాదు. తనదౌష్ట్యంబుఁ గనుపరచి ఘనాఘనోద్ఘోషంబుమాదిరి మాట్లాడిన నయ్యువతి మృతించునేమో. యజమానునికోర్కె నెఱవేర్చినవాఁడ గాక యన్యథా వర్తించినవాఁడ నగుదు నని యట్లు నటించుచుండెను. అయ్యువతియు నాతనిప్రసన్నదృష్టి నీక్షించి పోనున్నప్రాణంబులను జిక్కబట్టి యించుకధైర్యం బవలంబించి బాబూ! నన్నిక్లేటికి గొనివచ్చి యిక్కట్లపా లొనరించెద వన భైరవనాయకుండు బుద్ధిశాలిగనుక నిజాభిప్రాయం బెఱింగింపక కల్లబొల్లులతో నాపెమనంబున దృఢంబు నెలకొల్పి మెల్లమెల్లగా కథావిధానం బిట్లు నెలువరించె — సాధ్వీతిలకమా! పాతూరిపట్టణంబు నెఱుంగుదువుగదా! యన్నగరంబు సకలవస్తుసంభరితంబై సర్వసౌఖ్యముల కాలవాలంబై దివ్యోద్యానవనవిరాజితంబై మందపవమాననిరాఘాటసంచా

రంబై సుకుమారపనితాజననివాసయోగ్యంబై భూలోకస్వర్గం బన నెజరిల్లుచుండు. ఇక నాపట్టణాధీశుని భవనం బన్ననో సాక్షాదింద్రునిభవనంబే. అమ్మహారాజు కులశీలవిద్యావయో రూపభోగపరాక్రమోపేతుండు. అతని పవిత్రగాత్రంబులు సూర్యనారాయణరావు. ఆనృపాలచంద్రుని బహుశా నీ వెఱింగియే యుందువు. అతండు నీదివ్యముఖారవిందమును గాంచవలె నని కబురంపె ఓహో! పొరబడితిని. ఈ సౌందర్యఖని నేముద్దరాలో యెఱుఁగక యే నిట్లు బేలరీతి వాపోవుచుంటి. కాదు కాదు ఇదినిజముగా మననృపాలుండు వరించిన కలభాషిణియే యైయుండవచ్చును. కానియెడ నీజగన్మోహనరూపంబు మఱియొక యువతీమణి కుండునా? యుండుచో నది యీరోజుననే యీగహనంబున కెందుకు వచ్చును వచ్చుచో మనరాజు వచించినట్లు లీపెవెంట నొక్క పుషుండే యుండునా? ఇది నిశ్చయముగా నాకలభాషిణియే! యేమో అవునో, కాదో? దాని నడుగక యే నూతనకన్య కామణినామంబు నెట్లు నిర్ధారణఁ జేయవచ్చును అడిగి చూచె దగాక! తరుణీ ముందు నీనామం బెద్దియో నా కెఱింగింపుము, వినవలతు ననుడు యగ్గణికామతల్లి మనంబున నిట్లు వితర్కించెను. ఈపాపాత్ముండు నానామం బడుగుచున్నాఁడే వీఁడింత వరకు జెప్పుచుండిన సంగతిబట్టి చూడ నాసూర్యనారాయణ రావు పనుపున నన్ను దోచుకొనిపో వచ్చిన మోసకారిగా నగుపడుచున్నాఁడు. వీనిబారినుండి నే నెట్లు తప్పించుకొందు వీని నెట్లైన తప్పించుకొనినను యీయడవియంతటను వీనిబంట్లే

సంచరించుచున్నట్లు దోచుచున్నది. కాన యిక్కార్యంబు పొసఁగదు. ఎట్లైన నాసూర్యనారాయణరావు దర్శనముఁ జేసియే తీరవలయు నామముమార్చి చెప్పిన యితఁడు నన్ను విడుచునా? విడువఁడు వీఁడిదివరకే నేనా కలభాషిణి ననియెంచి యే యీ రాజాధమునిగూర్చి వర్ణించి నిన్నుఁ జూడఁగోరు చున్నాఁడనియే కాన పేరుమార్చి చెప్పిన ఫలంబుగలుఁగదు. వృథగా నసృతవాక్యదోషం బేల పైఁబెట్టుకొనవలె నిజమే వచింతు నని చెప్పఁబోవుసమయములో నేమే! దేబెలాగునఁగ్రు డ్లఁబెట్టి చూచుచున్నావు. భూతమేమైన సోకెనా యేమి! భయములేదులే నేను భూతవైద్యంబుఁ జక్కగా నెఱుంగుదును చెప్పు చెప్పు పేరుఁ జెప్పు మన నయ్యింతి నన్ను కలభాషిణి యని పిలుతు రనియెను.

అంత నతఁడు మనంబున సందియంబుఁ దక్కి నే నాతని భృత్యుఁడను కనుక నతనికోరిక నెఱవేర్చుటకై నిన్నుఁ బట్టు కొనితెం డని నాభటుల కాజ్ఞనీయ వారు నిన్నుఁగొనివచ్చిరి. నీ విఁకముందు మాకు రాణివి కాఁబోదువు. అప్పుడు మేము మీకు జ్ఞాపక ముండుదుమా? అబ్బో నీసంపద యేమో? నీసొమ్ములేమో? నీయందచందములేమో! నీయొయ్యారములేమో అవి జూచుకొని యుబ్బి తబ్బిబ్బులొందుటయే సరిపోవు మాదాక నీ కెక్కడఁ బట్టు నని తనవచోచమత్కృతిచే నామె మనంబును వికసింపఁ జేయఁజూచెను కాని యట్లు జరుగలేదు. క్రాగినచమురుపై శీతలోదకంబుఁ జల్ల భగ్గునమంట లెగయుఁ గాని కాక శాంతించునా? అనిష్టవచోశ్రవణంబు చేఁగలతఁ జెంది

యున్న యాపిమనం బానీచునియుత్సాహ ప్రహసిత వాక్య
వహ్నిచే దహింపఁడి కన్నులెఱ్ఱనై బొటబొట శోకరసం బుబి
కిరాసాగెను భైరవనాయకుఁ డటిసిలిలోనున్న యబలామణి
నీక్షించి యేమీ, యేడ్చుచున్నావు? ఆరాజకంఠీరవుండు నీకుల
శీలవయోరూపంబులకుఁ దగినజోడుగా నుండవచ్చు నీకుఁదగిన
వాఁడు మా యిట్టపండ్ల దాసరయ్య యొకఁడున్నాడులే వాని
కిచ్చి పెండ్లిఁజేసెదములే? ఏడువఁబోకు. కుక్క కైమునక రుచించు
నుగాని నేయి రుచించునా? భ్రష్టముండా! మహారాజు కబు
రంపితే పోక యింట్లోనేమువాని నొకని తగులాకొనిపోవు
చున్నావు వాఁడి యింట్లోముటకు బకులు మాయింట్లు
తోముదువులే. మాకు నొకబానిస కావలసియే యున్న దని
పాపభీతి లేక విడుచు భైరవనాయకుని నీచవచోబాణంబులు
కర్ణకుహరంబుల నాటి వేధించుచుండ నంగుళులు శ్రోత్రంబున
నిల్పి హరిహరీ శివశివా! నే నేపతివ్రతామణి నెట్టియిక్కట్లపా
లొనర్చితినో ప్రహ్లాదమార్కండేయాదులఁ బ్రోచిన భగవ
ద్రూపంబులు న న్నీపాపతమిస్రమునుండి యేలఁ దొలగించవు?
నీచవాక్శరజాలంబు హృదయభేదనం బొనరించి నను యీ
జీవాత్మ పాపిష్ఠిఘటమునే ఛేదించుచున్నదే ఏమిచేయవలె.
నని విచారాక్రాంతమనస్కయై నమ్రవదనయై ధరణీతలంబునఁ
జూచుచున్నసమయంబున నాభైరవనాయకుండు ఓసీ తొత్తా
యెంతటక్కరి నేర్చితే తలవంచుకొని చెవులలో వ్రేళ్లుఁబెట్టుకొని
హరిహరీ శివశివా యను నిక్కంపు భక్తురాలిచందంబున
ముక్కుమూసుకొని కూర్చుండినజాలిదలఁచి వదలివేతుమనియా

నీయాన, ఇట్టి కల్లబొల్లి టక్కరులు మా కెన్నియో దెలియును. టక్కరివిద్య యనఁగా మాకుఁ బుట్టినప్పుడు వెన్నతోఁ బెట్టినది. మేమా నీమాయలోఁ జిక్కువారము సర్వజనోచ్ఛిష్టనిలయం బగు నీరసనచే భగవన్నామంబును స్మరించి యంటువఱచు చుంటివా? ఔను పాపము రంకుబోతులకు వేశ్యలకు కులటలకు యనృతవాదులకు భగవంతుఁడొక్కఁడే లోకువ మాటిమాటికి రామరామ యని వచించుచుందురు నిన్ను కారాగృహంబు వలచియుండ రాజు నేల పరించియున్యథా వర్తింతువు చూడు నాదెబ్బ నిన్నే కనుక ముప్పాతిప్పలు వెట్టి మూడుచెఱువులనీళ్లు ద్రాగించకున్న నా పేరు భైరవుండు గాదు అని గ్రుడ్లుఱిమి పండ్లు పటపటగొఱుకుచున్నంతలో నయ్యోషామణి వివశాత్మయై నేలబడెను. అప్పుడు భైరవనాయకుండు భటులారా! రండు యిది యెట్లైనను మంచిమాటలచే వచ్చునట్లు లేదు. దీనిని మంచపుకుక్కిపై వేసి కట్టికొని రాజసమ్ముఖంబునకుఁ గొనిపోవలయు ననుడు వాండ్లురవడి నొక మంచముఁ దెచ్చి దానిపై నొడలుఁదెలియక పడియున్న యింతినిఁ బరుండఁ బెట్టి కాలపాశంబులఁ బోలు త్రాళ్లతోఁ గట్టిరి. అప్పుడు నాయకుండు భటులు మంచము మోసికొనిరాఁ దాను ముందు నడచి దారిఁదీయుచుండెను.





# వేంకటాద్రినాయఁడు

షష్ఠోల్లాసము.

పావనసుధాజలపూరితంబై, చలదూర్మికాపరంపరాభిరామంబై, త్రిజగజ్జనజేగీయమానంబై, యలరారు యీకృష్ణానదిం గాంచిన యేసుందరునికి మనసు వికసింపకుండును. ఆహా! గట్టులం దన్నిపట్టుకొని యచ్చటచ్చట పల్లపుప్రదేశములకుఁ బొరలి పార్శ్వంబుల పచ్చికబయళ్ల నావరించుచు నిండార ప్రవహించెడు యిమ్మహానదిపై పాటు గాలి విసరు నప్పుడు తెరచాపల నెత్తిన పడవలపై నౌనర్చెడి విహారంబునకు నాకాశంబునఁ జరించెడు పుష్పకం బెక్కి చేయుసంచారంబైన దీటుగానోపునే. ఇచ్చటి శీతలవాతపోతంబు లెట్టిమనఃపరిశ్రమఁ జేసినవారికైనను తలదిమ్మునడంచి, రవంతలో స్వాంతంబుల సంతోషసౌఖ్యసాగరంబుల ముంచి, యోలలాడింపకుండునే! ఆహా! మిన్నేటికి మిన్న. భోగవతి కనురాగవతి. గంగాసింధుగౌతమీప్రముఖంబులగు నదులకుఁ బ్రథమగణ్యంబు. దీనితీరంబున వసియించి యెల్లప్పుడిందలి యుదకంబులం గ్రోలుచు దీనియాటుపోటులం గన్దారఁ గాంచుచు దీనిశరచ్చంద్రచంద్రికాధవళపులినతల్పంబులఁ గ్రీడించుచు నుండు మానవులకు

దేవత్వ మన నేటిగౌరవము? ఓరా నేఁదలంచిన నూతననగర
నిర్మాణం బిచ్చటనే చేయవలయు. అందుకు నేను కొంత
త్యాగంబుఁ గనుపరచి, యనల్పకళా విశారదులగు శిల్పుల
రావించి, విశాలంబగు వీథులతో, రమ్యహర్మ్యంబులతోఁ,
బురంబు నిర్మింపఁజేసి, సకలవస్తుసంభారంబులతో, భోగ
భాగ్యంబులతోఁ దులదూగెడి పౌరుల రావింపఁజేసి, యుని
చిన. నది మందాకినీతీరమందలి యమరావతికెనయగుంగావ
మందాకిని యనఁజెల్లు, నీకృష్ణానది రాకపోకలకు, విదేశస్వదేశ
వ్యాపారములకు, మఱియు నెన్నియోవిధంబుల నుపకరింపఁ
గలదు. ఇంతటియూహా నాకుఁ బొడమించిన పరమేశ్వరుండే
యిక్కార్యము నిర్వహించుకొను భారము శిరంబున నిడుకొను
గాక! ఇంతటిగొప్పకార్యము నానుంచి కాఁగలదే యని వెను
కంజవేయఁగూడదు. స్వల్పుఁడు ఘనకార్యముఁ జేయఁదలంచుట
కతనిబుద్ధిబలమే చాలదు, మధ్యముం డున్నతసంకల్పముఁ
జేసి, యిట్టిమహాకార్యము నానుంచి కాఁగలదే, యని
త్రొక్కటపడి, సంకటములవలన డోలాయమానుఁడై, తుద
కది యారంభింపలేకపోవును. ఒకవేళ ప్రారంభించిన నరగొ
రలగా నొనరించును. ఘనులగువారు మహాకార్యముల
సంకల్పించి యారంభించి, మధ్యనెన్నియిక్కట్టులు వచ్చినను,
రవ్వంతయైనఁజలింపక యెడతెగని ప్రయత్నమున వ్యయ
ప్రయాసల కోర్చి నెఱవేర్చుదురు. కనుక నే మున్ను చరిత్ర
ప్రసిద్ధులగు మహాపురుషు లాచంద్రార్కమగు కీర్తిని గడించి
యున్నారు. ప్రతిభావిశేషంబుఁగల ప్రతిమానవుఁడును, పైని
వచించిన యుత్తమ తరగతియందుఁ జేరగోరుచుండు నని,

యమ్మహారాజు సమీపమున నున్న యొకపటుపురాతిపైఁ గూరుచుండి. ప్రధానుని విద్వజ్జనంబులం బిలిచి, తనమనోభీష్టంబుఁ దెలుప. నందులకు వారమందానందాంబుధిమగ్నులై యిట్లనిరి. రాజేంద్రా! ఈనీసంకల్పము కడులెస్స. అనుపమానంబగు లగ్నంబునఁ జేయఁబడినది. ఈస్థలము పరమపావనమైనదియుఁ, బ్రాచీనకాలమునుండి చరిత్రప్రసిద్ధమైనదియు, భరతఖండంబునకు హస్తిపురంబెల్ల నాదినుండి రాజధానియై, గౌరవంబందుచుండెనో, ఆంధ్రదేశంబున నిచ్చటి ధరణికోట యును, నామాంతరముచే విలసిల్లు ధాన్యవతీపురము, పురాతనమునుండి యట్టిమహార్దశ ననుభవించె, ననుటకు సందియము లేదు. ఇచ్చటి శిలాశాసన స్తంభములును, స్థూపములును, విగ్రహములును, పూర్వపుటౌన్నత్యములఁ జాటుచున్నవి. కావున ఖిలమైన యీ మహాపట్టణంబును పునరుజ్జీవింపఁజేసినఫలంబు మీపాలగుఁగాక! ఆంధ్ర రాష్ట్రోద్ధారణ కారకుండవై, యమరాపతిప్రభుండవై, విబుధరక్షకుండవై, మహేంద్రు ననుకరించుమని హెచ్చరింప, నామోదించి, ప్రధానునితో నూతననగర నిర్మాణవిధానమునుఁ జక్కఁగాఁ దెలియఁ జెప్పవలయు ననుచుఁ ధనమును బొక్కసమునుండి తీసికొనుట కనుజ్ఞ నిచ్చెను. అంతట నతండొక దివ్యముహూర్తంబునఁ బురనిర్మాణారంభముఁగావించి నెలవేర్పుచుండ ప్రభుండొక పటకుటీరంబున కొన్నాళ్లచ్చట నివసించె. ఆసమయంబున చింతపల్లికోటనుండి, యొకప్రతీహారి చనుదెంచి, జోహారొనరించి, దేవా! యిదిలేఖయని యిచ్చెను. అందు శ్రీమన్మహారాజరాజ దేవేంద్రవాసిరెడ్డి వేంకటాద్రి

నాయమహీపాలవరేణ్యునిపాదపద్మములసన్నిధికి-యుష్మద్విధేయాప్తుఁడు క. వెంకట్రావు వ్రాసుకొన్న విజ్ఞప్తి యేమన. తమరు చింతపల్లినుండి బయలుదేఱి ధాన్యకటకమున విడసి చాలదినములయ్యెను. మీ యోగక్షేమములకు నిరీక్షించుచుంటిమి. అవి యట్లుండ మహారాష్ట్రమునుండి యొకబంది పోటుదండు బయలువెడలి మనకు పశ్చిమమున నుండుగ్రామములందు కల్లోలముఁగావింపుచు, వనితా పశుధనధాన్యరత్నంబుల హరియించుచు, వచ్చి వేదగిరియందు మకాముఁ జేసినట్లు తెలియుచున్నది. దండోకమహారాజునకుండు సైన్యమునకంటె మించియున్నదఁట. మీరిచ్చట లేరని తెలిసెనేని వాండ్రే రాత్రియో యేపగలో కోటపైవచ్చి పడుదురను భీతిచేగవనులు బహుజాగ్రత్తగాఁగాపాడఁబడుచున్నవి. కాన తమ కెచ్చట నెన్నితొందరలున్నను, శీఘ్రంబుగా రానిచో మాకు మానప్రాణములఁ దక్కవని తోచెడిని. చిత్తగించవలయునని యున్నది. సమగ్రముగాఁజదివి, ధైర్యోత్సాహంబులతోఁ దానువచ్చిన జమాబందికార్యము నాపివేసి, నూతననగర నిర్మాణకార్యమున సచివునకు సర్వస్వాతంత్ర్యములొసంగి, వెంబడించియుండిన స్వల్పసైన్యంబుతో వేదగిరికిఁ బ్రయాణమాయెను. ఇమ్మహారాజు ధాన్యకటకమునుండి వేదగిరికిఁ బోవునప్పుడాతని తీవ్రదృష్టింగాంచి దారిలో గ్రామములందు, పౌరుషాభిమాన వివేకంబులుఁ గలప్రజలెల్లను నతండుబిలువకయే దేశరక్షణ రాజరక్షణములకై, వెన్నంటిరి. పొలంబునగల కాపులు ములుకోల, రాగోల, గొడ్డలి, కొడవలి, మొదలగు వ్యవసాయోపకరణంబులనే యాయుధంబులుగాధరించి ప్రభు

వు వెంట నడచిరి. అభిమానపూరితమై, నిజమైనభక్తిగలయట్టి సైనికులచే రాజునకు జయమేలకలుఁగకుండును! ఈపరోపకారపరాయణుఁడైన రాజోత్తమునకును, రాజభక్తివిశ్వాసపాత్రులైన తత్సైనికులకును, దక్షిణనేత్రప్రకంపనాది శుభనిమిత్తంబులు, పూర్ణానందదాయకంబులుగా నుండెను. అంతట సైన్యంబంతయు రాజువెంట నిశ్శబ్దంబుగానేగి యొక్కపెట్టున నప్పర్వతంబంతయు ముట్టడించెను. తదుపరి నప్రభువరేణ్యుం డోరీ బందిపోటుదొంగలారా? ఇంక నెందుఁబోయెదరు. మీప్రాణవాయువులన్నియు నొక్కసారిగాఁ బీల్చునేతెంచిన మహానాగము వేంకటాద్రినాయుండిదే మిమ్ము సమీపించె. మీరిదివరకెన్నియో దినములనుండి మధుమాంసభక్షణాదులచేఁ బెంచిన మీశరీరములనున్న క్రొవ్వంతయు, నీరోజున నస్మదీయ కరవాలంబునకెఱఁజేసి, సర్వజనుల నాపదోత్తారకులఁగావించి, దేశమంతయు, సుఖనిద్రనొందించెద, మీకోర్కెలింకేమైన తరువాయియున్న యెడలనంతకాలయమున కతిథులగా నేగి, యచ్చటఁదీర్చుకొండు. అనిగర్జించుచు లయకాలరుద్రాకృతిందాల్చి, మృత్యుకరాళోపమంబైన తనకరవాలంబు కరంబునవెలుంగ, మీదికురుక, నబ్బందిపోటు దొంగలందఱు కకావికలై, మిన్నువిరిగి పైఁబడినట్లు లేమియుఁదోచకొకరు బోయినత్రోవ నొకరుబోక, నడిమిట్టుగా నుండుబండపైవైచిన నిద్దంపుగోలీల మాదిరి, పరువిడసాగిరి. ఇట్లుపలాయనంబు జూపిన దొంగలలోఁగొందఱిని, ప్రభువరేణ్యుఁడు తన వాడిఖడ్గంబు పాలుగావించుచు, పోనీకుఁడు, పోనీకుఁడు, శూరాగ్రేసరులారా? యనిపెద్దయెలుంగున కేకలువైవ,

నప్పేటు మానిసులందఱు నేరికిసరిగా వచ్చినవాండ్రను, వారత్యుత్సాహముతోఁ దమయాయుధంబులచే బిట్టుగామోది వారలప్రాణవాయువులఁ బీల్చివేసిరి. ఆమరాఠీలవద్ద రాజునకసంఖ్యాంబైన ధనంబులభింప, దానినేనుఁగులమీఁద, గట్టించుకొని రక్తసిక్త కరవాలంబులు కృష్ణానదింగడిగి, ధనంబు చింతపల్లె లోనికోశాగారంబునకుం జేర్చెను. భూపాలుని యసహాయశౌర్యంబునకుఁ గోటలోని బంధుమిత్రామాత్యసామంతాదులాశ్చర్యంబునం దేలిరి. పూర్వమా బందిపోటు దొంగలచే బాధలనొందుచుఁ, బ్రాణంబులఱచేత నిడికొని యున్న యాయాగ్రామవాస్తవ్యులు, పుష్పఫలాంబరాభరణంబులఁ గానుకగాఁగొనివచ్చి, యమ్మహారాజునకిచ్చి వందనశతంబులర్పించిరి. అంతట నారాజశేఖరుండు వారలనుచితరీతి సత్కరించి, మృష్టాన్నపానాదులఁ బరితృప్తులఁ గావించి, వీడుకొలిపె. తరువాత నాచింతపల్లి కోటలోఁ గాపురముఁ జేయుచున్న జనులాబాలవృద్ధముగాఁ జనుదెంచి, మహారాజ దర్శనంబాచరించి, యమందానందకందళితహృదయారవిందులైరి.





# వేంకటాద్రి నాయఁడు

## సప్తమోల్లాసము.

మంత్రివర్యా? నాయదృష్టయోగము నేమనికొని యాడుకొందును. నేఁదలంచిన కార్యమెట్టి దుర్ఘటమైన దైనను, నిరాయాసమున నెఱవేరుచున్నదే. భైరవనాయకుండు కలభాషిణినిఁ గొనివచ్చి నాడనిన వార్త, శ్రోత్రపర్వంబుగా వింటివి గదా? ఆమాట వినినతోడనే నామనంబానంద రసైకనిర్మగ్నమై, ముక్తికాంతా సౌఖ్యంబునకుఁ ద్వారపడుచున్నది. నేను ధన్యాత్ముఁడ ననిపలికిన, మంత్రి, శ్రీహరీ! పాపంబుశమించుగాక. యని రాజచంద్రా? ఏల. ఇట్లువిని సహించరాని వాక్యంబును వచించితిరనుడు, రాజు అవును మంత్రీ, నేనా కాంతను నిశ్చయంబుగా వరించఁగోరియున్నాఁడ, అది నన్నెట్లవమానపఱచి పోయినదైనను, దానిముఖంబుఁగాంచిన, ముక్తికాంతాముఖంబుఁ గాంచినట్లే యనియె. అంతట మంత్రి స్వామీ! తమరానంద పరవశులై, వినువారి మనంబులకు భయావహంబుగా, ననరానిమాటల ననుచున్నారు. ఏమి చేటు వాటిల్లనున్నదో కదా, నామనంబు తత్తరించుచున్నది. అనిదీనత్వంబుసూచించు చుఁబలికినరాజు మంత్రీ! నేనేమంటిని నన్నవమానపరఱచినదైనను నేనువరించెద నంటిననియా

పలుకుచున్నావు. నిజముగా నేనుదానినిఁ జేపట్టక మనఁజాల. నివిషయములోమాత్రము నీమాటనిరాకరించితినని యెంచు కొని, కష్టంబువహింపకుము. అదినాకూర్వశీసంగమసౌఖ్యంబుఁ గూర్చునది యన, మంత్రి దేవా? తమరసలే దారిదప్పితిరి. నే వచించునది మీరావేశ్యను జేపట్టకుండుడనికాదు. మీనోటి నుండి వెలువడిన యశ్లీలవాక్యంబులకు భయమందుచుంటి, అదివినిపించెద వినుండు, ముక్తికాంతా సంగమసౌఖ్యంబేమి! యూర్వశీసంగమ సౌఖ్యంబేమి? ముక్తికాంతాముఖంబుఁ జూచినట్టేయేమి? మీనోటినుండి యిటువంటి మాటలేల వెలు వడవలయునని నాగుండె తల్లడిల్లుచున్నది. అనుడు రాజు ఇది యానీకుఁగల్గిన విషాదము. మంత్రీ? యెంతవెఱ్ఱివాఁడవు. దాని తోఁగూడియుండిన నాకుజ్ఞానులకు ముక్తికాంతాసంగమసౌ ఖ్యంబెట్టిదో, యట్టిసౌఖ్యంబొనగూడుననఁబోయి, యానంద పరవశత్వంబున నట్లంటి. నింతమాత్రముననే వెలువవలయు నా! మానవుండాయుః ప్రమాణాంతమున మరణించునేకాని మధ్యనశ్లిలములచేఁ జచ్చునా,? సర్వజ్ఞుండవగు నీవీకించిన్మాత్ర మునకే ఖేదంబువహించి మొగంబున దీనత్వంబు సూచించుటఁ దగదు. ధైర్యంబు వహించుము. నాముద్దులగుమ్మం డొ డ్కొని, నాబహిఃప్రాణమైన భైరవనాయకుండదే వచ్చుచు న్నాడు. యెవ్వఁడురా అక్కడ. లోపలనున్న సింహాసనంబిటుఁ దోడ్కొనివచ్చి నాకెదురుగానుంచుము. అనిన నొకసేవకుండు లోనున్న యున్నతాసనంబు నొకదానిఁ గొనివచ్చి సభలో రాజుగారికెదురుగా వేసెను. అంతట భైరవనాయకుండు కొం చెముసుంచుగాఁ జనుదెంచి రాజునకు నమస్కరించి, యతని

యనుమతి పీఠమునధిష్ఠించి, స్వామీ? యానిర్భాగ్యురాలిని మోయించుకొని వచ్చుచున్నాఁడ. అదిటక్కరిఁ జేసి యూపిరి బిగఁబట్టుకొని, మీసమ్ముఖమునకు రానిష్టము లేక, పండుకొని యుండుటంజేసి, దానికొఱకింత ప్రయాసఁబడవలసివచ్చినది. దానినాకొఱకు కరవాలంబున కిప్పటికే బలిఁ బెట్టియుందును. కాని మీయాజ్ఞలేమి నింతవరకు నదిజరిఁగియుండ లేదు.

అనునప్పటికి రాజు భైరవనాయకునింగాంచి, సఖుఁడన్న నీయట్టివాఁడుండవలె. కాకిచ్చేఁగబురంపిన కార్యంబుఁ జక్కఁబెట్టుకొనివచ్చితివి. నీఋణమునుంచి వేయిజన్మములకైన విముక్తినొందఁజాల, ననిపట్టరాని తమకంబున నట్టెచూచుచుండెను. అంతలోఁ జెంచులు మంచమునచ్చటదించిరి. వెంటనే బంధంబులువదల్పుఁడని రాజాజ్ఞనిచ్చెను. భృత్యులు కొందఱా బంధంబులు వదల్చిరి. కాని, యాపియటులనే చైతన్యంబు లేనిదానివలెఁ బడియుండెను.

అప్పుడు చెంచులు చూచితిరా స్వాములు! యీగండా గొండితొత్తు మాయవేషములనుడు, రాజువారలంజూచి, మీరు దానినేమియుననకుఁడు, అది స్పృహఁదప్పి యున్నది. శీతలోపచారంబులంగాని స్మృతిఁగనునటుల లేదు. ఓరీయెవఁడురా అక్కడ, మనపరిచారికల కిరువురికి నాయాజ్ఞఁదెల్పి ఇటుఁదోడ్కొని రండు. అనువరకొక బంటుత్వరగావెళ్లి తీసికొని వచ్చెను.

నృపాలుండా మానినులంగాంచి, యీమంచము, లోనికిఁబట్టించుకొనివెళ్ళి దీనికి స్పృహవచ్చునటులుతగు జాగ్రతతో శీతలోపచారంబు లొనర్పుఁడని, యాకన్యకారత్నంబు

నాపరిచారికల కొప్పగించి, భటులచే మంచమునొక విజన మందిరంబునకనిపెను.

పిమ్మట రాజా చెంచుమూకకును, భైరవనాయకునకును, భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, పానీయములతో, విందుఁ జేసి యెవఁడు మోయఁగలిగినంతధనమును వానికిబహుమతిగా నర్పించి, సంతోషపరచి, వారినినెలవులకంపివేసెను. క్రూరులగు చెంచులకు సహచరుండై వర్తించుచు, వలవని పరకాంతను బలవంతముగాఁ జెఱబట్టియున్న పాపాత్ముండీరాజాధముని మొగంబుఁజూడనోప నన్నట్లు జగాదాప్తుండ పరదిశాసంగతుండయ్యె. క్రమముగా నీరాజు మూలమున నాంధ్రదేశంబంతయు, నిట్టిరక్తప్రభలచే నొప్పారు నన్నట్టులరుణకాంతి జగమెల్ల నావరించెను. ఈతండిట్టి యజ్ఞాన సముద్రంబులో మునిఁగియున్నవాఁడని తెల్పునట్లు చీఁకఁటి దశదిశలాక్రమించె. ఈనృపాలుండును దోషాకరుండు, నేనును దోషాకరుండనను, నామసంబంధంబుఁగల్పించుకొని, ఈరాజునకుఁ దోడ్పడ నారాజు వచ్చుచున్నాడేమో యనునట్లు, చంద్రుండుదయశిఖరికిఁ బ్రాకివచ్చుచుండెను. మదనుఁడమ్ములనూరి, విటినీ భుజంగుల వక్షంబులు లక్ష్యంబుగాఁజేసి, వేయుచుండ, పరస్పర సందర్శనాభిలాష, ద్వారకవాటంబులపైఁ జేతులు మోపి, వీధులరయుచుండిరి. చకోరకంబులు తనివిదీర చంద్రకిరణామృత పానంబొనర్చుచుండెను. కలువపూవులు మనోహరంబుగా వికసించెను. వధూవర్గంబెల్ల వల్లభాలింగనబంధబంధితంబై, మదనసామ్రాజ్యపట్టాభిషిక్తమై, యనిర్వచనీయాబ్రహ్మానందమున నోలలాడుచుండె, పవలెల్ల శరీరాయాసం

బొనర్చిన జనసంఘంబు గాఢనిద్రాపరవశత్వంబుననుండె. ఆసమయంబున నీసూర్యనారాయణరావు మాత్రము కలభాషిణీ స్మృతి వంశయాస్పదమతియై, జాగరణఫలంబుఁ దక్కించుకొనుచుండె. ఇట్లుకొంత సమయంబుఁ గడచుసరికి 'కొక్కొరుకో' యని కోడికూతయతనికి వినఁబడెను.

అంతనతండు తాత్కాలిక కృత్యంబుల నిర్వర్తించుకొని, కలభాషిణి దేహకాంతులు వ్యాపించి, ద్విగుణీకృతమై ప్రకాశించు మందిరంబు దర్శించవలయునని, త్వరపడుచుండెను. రాత్రినుండి పరిచారికలు కలభాషిణికి స్పృహరాగలందులకై, మొడలికి మంచిగంధములఁది, కప్పురపు రసంబుఁ జెవులలోనుంచి, పన్నీరుపైఁజిలుకుచు వీవనంగైకొని విసరుచుండిరి. ఇట్లుపచరింప, కొంతవడికి నీపక్కనుండి మఱియొక ప్రక్కకుఁబొరలెను. అంతట పరిచారికలుల్లాసమతులై, విడువని ప్రయత్నంబున, నట్లులనే యుపచరింప, మఱికొంత సేపటికి గాఢనిద్రనుండి మేలుకొన్న కురంగంబు చందంబునఁ ద్రుళ్ళిపడి లేచి,యటునిటు దిక్కులు పరికించుచుండెను. అత్తరి పరిచారికలాకలభాషిణినింగాంచి, యేమి యిటుల బెదరి బెదరి చూచుచున్నావు. ఇది మహారాజైన సూర్యనారాయణరావుగారి మందిరము. మేమాతని పరిచారికలము. మైమఱచియున్న నీకురాత్రినుంచి శిశిరోపచారము లొనర్చి, యీస్థితిలోనికిఁ దెచ్చినాము. నీకేవిధమైన భయంబులేదు. వనఁటఁ దక్క, నిశ్చింతమొయి ప్రవర్తించి, మమ్మానిందింపఁజేయుమని పల్కునంతలో, రాజచ్చటికి సామాన్యవేషముతో బిరబిర నేతెంచి, "శారికా శారికా" యని పిలిచెను. అంతట పరిచారి

కలలో నొకతె త్రివ్వన మందిరమునుండి బయటికివచ్చెను. రాజు దానింజూచి, యేమే కలభాషిణి యెట్టి స్థితిలోనున్నది. తెలిసి ముచ్చటమీర, ముద్దులూరఁ, బల్కుచున్నదా? నా భాగ్యమెటులున్నదో యెఱింగించి, నామనోవేదం బాపవే, యనుడు శారిక నృపసత్తమా? కలభాషిణి యిప్పుడే మనలో కములోనికి గొంచెము వచ్చినది. రండు వీక్షించుడని లోనికిం గొనిపోవ, రాజు నేత్రానందకరముగా, నాబంగారుబొమ్మనుం జూచుచు, యనిమిషభావంబు వహించి, చిత్రప్రతిమవోలె నిలువంబడి యుండెను.

అట్లు వెఱ్ఱిచూపుఁ జూచుచుండిన రాజుంజూచి, కలభాషిణి భీతిగొని తత్తరించ సాగిన, పరిచారికలాపెంజూచి, అమ్మా! భయ మొందకుము. యీమహాపురుషుండే రాజేంద్రుండు, ఈతండు నీరూపంబుఁగాంచి విభ్రమంబుఁజెంది, బొమ్మమాదిరిఁ జూచుచుండె నేకాని వేరుకాదు. ఈరాజచంద్రుఁడు మిక్కిలి మంచివాఁడు. నీపూర్వపుణ్యంబు మంచిది కనుకనే దేవరవారి దర్శనంబబ్బినది. నీమనంబున నేసందియంబుంచక, ఈమహారాజుం జేపట్టి మాకురాణివై, చల్లని చూపుతో మమ్ముఁజూడుము. నీతో నేకాంతముగా మాట్లాడఁ దలఁచి వచ్చియున్నాఁడు, నీవాలుకనుఁగవనుండి వెడలు సోయగంపుఁ జూపులు రాజేంద్రుపైఁబరపి, కృతార్థురాలవుఁ గమ్మా, మేమరుగుచున్నాము. అనివారలామందిరమునుండి, నిష్క్రమించిరి.

సూర్యనారాయణరావంతట నమ్మానినీతిలకంబుతో ముద్దుగుమ్మా? యిటుఁజూడుము. నీదయకుఁ బాత్రుఁడగాఁద

లఁచి, నీమందిరమునకువచ్చిన నన్నిట్లు పెడచూపుతోఁజూచుట ధర్మముగాదు. నిన్నెన్నియో బాధలఁబెట్టితినని మనంబున నెంచకుము. నేను నిన్నుఁ బువ్వులలోఁబెట్టి పూజించుకొననెంచియుండ, నన్నొల్లమి నీకిట్టియిక్కట్టులు సంభవించినవి. భవత్కృత కర్మఫలంబునకు నేనేమి చేయవలయు. నేనెన్నివిధంబులనో సేవకాముఖంబున, నిన్నుఁబ్రతిమాలుకొంటినిఁ గాని, నీయనుగ్రహ వాహిని నాపైఁబారలి, నన్ను కృతార్థునిఁగా నొనరించినదికాదు. గతజలసేతుబంధనంబికేల. ఇంకనైన నీయనుగ్రహంబునకుఁ బాత్రుండు గాఁదలఁచినయీదీనునిపైఁ గరుణవహించి, సుధాకరబింబ సదృశంబైన మొగంబెత్తి, లోలేక్షణంబుల వీక్షింపుము. నానయనచకోరకంబులు నీదరహాస చంద్రికలఁగ్రోల నువ్విళ్లూరు చున్నవి. పూఁబోణులకు మకరందసదృశంబైన మనంబుండవలయుఁగాని, శిలాసదృశంబుగా నుండఁగూడదు. నీయీదాసుండెట్టి దుర్ఘటకార్యభారంబుఁబై మోపిన నోపఁగలండు. కాని, నీవియోగ దుస్సహ భారంబు భరింపనోల్లఁడు. నావలననేరంబులుండిన నీసొగసు కీల్జడఁబ్రేట్లచే నొప్పించి, కసిదీర్చుకొందువు గాని, పెడమొగంబుఁబెట్టిన బ్రతుకఁజాల, యువప్రాయంబున నవమన్మథుండైన పురుషునిఁగూడి, బ్రహ్మానంద సౌఖ్యమునకు మొబ్బడియగు మదన సామ్రాజ్య వైభవంబనుభవించుటుచితంబగుఁ గాని, యీరీతి బ్రహ్మచర్యంబు నడపుటుచితమే. ఒకేతీరున నేనిటుల బ్రతిమాలుచుండ, నీవుమారుపలుక కుండుట మోటుతనమనిపించుకొనును. "ఇటుఁజూడుమిటుఁజూడు" మనికామాగ్రహావేశంబున నొడలుఁ దెలియక, సమీపస్థుఁడైన సూర్య

నారాయణరావుతో, నన్నా? ఇట్టి దుర్భాషలాడఁజనదు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యంబులను నాఱును, పురుషునికిఁ బ్రబల శత్రువులు. ఈశత్రువర్గంబునఁ జిక్కిన పురుషుండు, సమూలంబుగా వినాశనంబు నొందును. కాన నీబోటి ప్రాజ్ఞుండిట్టి దుష్టశత్రుషట్కంబునకు,దూరంబున నుండవలయును. శత్రుషట్కంబునఁగూడ, కామంబనునది ప్రబల శత్రువు. దీనిచేఁజిక్కి, రావణ నరకాసురాదులెందఱు ఘోరపాపదవాగ్నికినంధంబులైరో యోచింపుము. తలవని పరకాంతను బల్మినిఁబట్టి, సుఖింపఁజూచుట మూర్ఖుని విరస లక్షణము. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములకు, మనస్సు రాజు. మనంబు పరాధీనంబై యుండ నింద్రియంబు లన్యధావర్తింప నేర్పునే. తనలోనిప్రాణి యెట్టిదో తదితర ప్రాణులుఁగూడ నట్టివి యేయని ప్రాజ్ఞుఁడూహించనగు.

కం. ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తనమ ♦ నంబునకగుఁదా
నొరులకు నవి సేయకుఁకి
పరాయణము పరమధర్మ ♦ పథములకెల్లన్"

అను పంచమవేదవాక్యంబును వినవే నిన్నొకండు బలవంతముగాఁబట్టి చెఱఁబెట్టిన నీమది కెట్టులుండునో నీకుమాత్రము దెలియదా? పరులుఁ గూడ నట్టివారేయని భావించుకొనవలదా? సమస్త జంతుసంఘంబులనున్న జీవాత్మయును, పరబ్రహ్మ తేజంబొక్కటే కదా? జీవాత్మను హింసింపఁజేసిన పరబ్రహ్మను హింసించునట్లు కాదా? దాని వలన పాపంబు

కొండల ముట్టఁబెరుగదా? పాపంబుచే నరకకూపంబు
సిద్ధించుఁగదా? రౌరవాది నరకంబులపాలై మహాదుఃఖంబులను
భవించుటకు మూలకారణంబు కామంబుగదా? అట్టి కామంబు
నఁజిక్కియైహికాముష్మికములకుదూరమై, సమస్తనిందాజనభాజ
నంబై, శ్రేయోహానికరంబై, పాపప్రదంబైనదుర్గతి పాలుగాకుము
సమస్తజన్మములందును మానవజన్మ ముత్తమము. యీమా
నవజన్మమందే కామగ్రహావేశుఁడవైయొడలెఱుంగక చెప్పరాని
చేయరాని దుష్కార్యములొనర్చినఁదరించునదెప్పుడు. ఎన్ని
విధముల యోజించినఁబరప్రాణి హింసకన్న మహాపాప కార్యం
బింకొండు లేదు. కనుక నిర్మల జ్ఞానముఁగల్గి, నిశ్చల మతివై,
పాపవృక్షంబునకు బీజస్వరూపంబైన, కామంబును నీమనోక్షే
త్రము నుండి వెలిఁజేసి, సర్వభూత సమదృష్టిత్వమందు స్థాపించి,
చెడని పదార్థమును వెదకుకొనుము. అని యనేకవిధంబుల
బోధించెను. కాని పైత్యరోగికి పంచదార రుచింపనట్టులా,
పాపాగ్రేసరచక్రవర్తి శ్రోత్రంబులకవి యెగటాయెను. అంత
నతఁడో కలభాషిణీ! ఇట్టిపట్ల నీవైదిక ఛాందసపు మాటలు
రుచించుటెట్లు. మదనుఁడదయుఁడై పదనైన విరికోలలు చెఱ
కువింటంగూర్చి, గుఱిఁజూచి, యురమ్మురవడిఁబఱియలుఁగావిం
చుచుండ, కరుణవీడి, పెరవారి చందంబున, నొప్పరికించుట
నీకుభావ్యంబే. ఇట్టినిర్దాక్షిణ్యమైన కాఠిన్యచిత్తంబు నీకొడఁ
గూర్చిన బ్రహ్మదేవుని యవివేకంబు నేమనఁదగు. శరీరమందుం
చవలసిన కఠినరేణువులన్నియు. మనంబున నుంచిన టులఁదో
చుచున్న యది. హా. ఇఁక నేమిచేయ వలయు. శరీరంబంతయు
మోహారస వ్యాపితంబై, కంపంబెత్తుచున్నది. ప్రపంచముదృష్టి

గోచరంబగుట లేదు. కర్ణంబుల కాకర్ణన శక్తి కోలుపడినది. మిన్ను విఱిగి పైఁబడినట్లు లేమియుఁదోఁచుట లేదు. హా! కలభాషిణీ! యధర సుధారసంబొసఁగి రక్షింపుము. రక్షింపుము. అని గాటంబుగాఁ గౌఁగలించుకొనఁబోవ, నమ్మానినీరత్నంబు, హా పరమేశ్వరా యని, ధరణీతలంబున వివశయై వ్రాలెను. అంతట నారాజాధముండు నిరాశాహత మానసుండై, వెనుకకుఁదగ్గి ఓహో! మోసము వాటిల్లె. ఇది ప్రాణావసానదశలోనున్నది. దీనినిప్పుడు మదీయ హస్తంబుచే ముట్టితినేని యిహలోకంబు వీడి చనుట నిక్కువము. నేనిఁక నిచ్చట నుండఁగూడదు. త్వరగా నంతఃపురములోనికి వెళ్ళి, దుర్ఘటన కార్యసానుకూలఘటనా సమర్థులైన, నీలవేణి, కోకిలవాణి, యను వారలఁ బిల్చి, దీనిమూర్ఛఁదొలంగించి, నాయందు మమతఁగలుగునటులఁ జేయుమని ప్రార్థించి, దీనికిఁ జెలులఁగా కొన్ని రోజులు పరకునుండుమని యాజ్ఞాపించెద. నని యతండా మందిరంబును వీడి, యంతఃపురంబుఁ బ్రవేశించెను.





# వేంకటాద్రినాయఁడు

## అష్టమోల్లాసము.

చెంచులచే భయపెట్టి వెళ్లఁగొట్టఁబడిన, వేంకటాద్రి నాయఁడుగారి దూత, పులులమధ్యమునుండి విడువడిన కురంగంబు చందంబున, నరణ్యమునంబడి కొంతదూరము పరువెత్తి, బుసకొట్టుకొనుచు, నచ్చట నిలువంబడి, అయ్యో! దైవమా? యెట్టికష్టంబులు సంఘటిల్లె. పాపము కామినీ తిలకంబును క్రూరులెట్టి శ్రమలఁబెట్టుచుండిరో గదా? నేననాథనై నన్నునమ్మి, నా వెంటవచ్చిన కాంతను, చెంచుల పాలఁబడ వైచి, నేనెటులేగుదు. ఆమె జీవించియున్నది లేనిది తెలిసికొనక, రాజుగారి వద్దకు వెళ్ళి, యచ్చటయెటులున్నదని చెప్పుదు, "ఛీ" యెటులైన నా చెంచులదగ్గఱ కేగి, దానియుదంతంబు నారయకుండుట హీనునిలక్షణము. కాన ధైర్యంబవలంబించి, తిరిగి వెళ్లెదను. ఆహా! మఱచితి నాభిల్లులు మఱియొకసారి నన్నుఁజూచిన, బ్రతుకనిచ్చుట కల్ల. ఎటులేగుదు. ఎటులైన నిజస్వరూపంబు మాటుపఱచి, వారల సమీపించి, వారివల్లనే ప్రస్తావనముఖంబున నీయంశంబును, రాఁబట్టుకొనవలయును. అందుకే వేషమనుకూలించును. యేజాతినై

నను స్వకులంబునుదరిఁజేరనిచ్చునటులు మఱియొకకులంబును జేరనీయరు. చెంచులభాషఁ జక్కఁగా నేర్చినవాఁడనగుటచేఁ, జెంచువేషంబు వేసికొని, వెళ్లితినేని, వారనుమానపడరు. వారిండ్లలోఁగలసి మెలసి, యుండి, విపులముగా నాపె యెక్కడ నున్నది యెటులున్నది వారేయేయిబ్బందులు పెట్టుచున్నది కనుఁగొనవచ్చును. కనుక నెమలియీకలు, గోచిగుడ్డ, పూసల పేరులు, వగైరాలు సంపాదించి, భిల్లవేషంబు ధరింపవలయు. అవియెట్లు లభ్యంబగు అదుగో చెంచువాఁడొకఁడు యీమార్గమునఁబడి వచ్చుచున్నాఁడు వానికంటఁబడిన మోసంబువాటిల్లు. నదియుఁగాక యీవేపచెట్టు మాటుననుండి, వానిపుత్తినిబడితతో నొక్కదెబ్బకే చక్కఁగావించిన, నెమలియీకలు వగైరా చెంచువేషపరికరంబులు చేఁజిక్కును. ఇంతకంటె నుపాయంబుఁగానరాదు, కనుక నీసాలంబు మరుగుననుండి, పని నెగ్గించుకొనియెద నని, దాగియుండ, చెంచువాఁడు సమీపంబునకువచ్చి, కొంచెముముందుకుసగిలెను. అంతలో నతండు తనచేతనున్న గట్టిబడితతో, శిరంబుపై బిట్టుగా మోది, ప్రాణంబులఁగోల్పుచ్చి, వానిపరికలంబులలాగుకొని, చెంచువేషంబు ధరించి, తిరిగి వరువెత్తివచ్చిన మార్గమునేపట్టి చెంచులుండు తావునకు వెళ్లుచుండెను. కొంతదూరంబు నడచువరకు చెంచులగుడిసెలు కన్నులఁబడియె. ఆగుడిసెలయొద్దకు వెళ్ళిన, నిర్మానుష్యంబుగా నిశ్శబ్దంబుగా నుండెను. కాని, యొకరిద్దరు ముసలిచెంచులు మాత్రమాగుడిసెలయందు మూల్గుచుండిరి. అంతట సీమాయాభిల్లుండొక ముసలివానిని సమీపించి, తాతా మనవారందరెచ్చటికేమిపని మీదవెళ్ళినారు. ఒకరైనను కను

పడలేదే, నన్ను గుర్తించలేదా? నేను మొన్నటిరోజున గ్రామాంతరంబు వెళ్ళిన, నరసన్ననుగాదే! అన నమ్ముసలివాఁడు నీవటోయి నాయనా? నాకుఁ గండ్లుబొత్తిగా నగుపడుటలేదు. కూర్చుండు నాయనా కూర్చుండు. మన వాండ్రింతకుముందే మన ప్రభువైన సూర్యనారాయణరావుగారి దర్శనమునకు వెళ్లియుండిరి. నేడో రేపో రాఁగలరు. చూచిపోవచ్చితివా? నాయనా ఉండు ఉండు మన నాతండు కాదు తాతా? నేనెచ్చటనుండియో వచ్చిన క్రొత్తవాఁడను కాను మీ వెంకన్న కొడుకను గాదటే యన ముసలివాఁడు నాకు బొత్తిగా మతిమరలి పోయినది, నీవోయీ మనవాండ్రా బోగపుశోత్తును పట్టుకొని తెచ్చి రాజుగారిదగ్గఱకు తీసికొని వెళ్లిన సంగతి యెఱుఁగనే యెఱుఁగవా అన కృత్రిమభిల్లుండు యెఱుఁగను తాతా? అది యెవతె దానినెందుకు రాజుగారి వద్దకు తీసికొని పోవలసి వచ్చినది. అన వృద్ధుండు అదియా? దానిది రాజమహేంద్ర నగరము. అది మనరాజుగారినొల్లక, వేంకటాద్రినాయనిదగ్గరకు వెళ్ళవలెనని, పోవుచుండగా రాజుగారు కబురంపితే మన వారు దానినీయరణ్యంబునఁబట్టుకొని, తెచ్చి మంచముమీదఁ గట్టుకొని, పాతూరినగరంబునకుఁ దీసికొని వెళ్ళినారు. అటులనా! తాతా? దానినెందుకు నడపించుకొనిపోక మంచముమీద వేసి, కట్టి తీసికొని, వెళ్ళినారు. అది బహుటక్కరిదిరా అది ప్రాణాలుబిగఁబట్టుకొని, చచ్చినదానివలె పండుకొని, పిలిచి నను పలుకకుండ యుండిన విడిచిపెట్టదరేమోయని యట్లు చేసినది. అందుచే మనవాండ్రు దానిని మోసికొని పోవలసి వచ్చినది. మంచిపనిఁజేసినారు. తాతా? నేనుఁగూడనచ్చటికి

వెళ్ళుచున్నాను. రేపటిరోజున తిరిగి యిచ్చటికి వచ్చెదను. దయయుంచుతాతా? అని యతండచ్చటనుండి, తాను భిల్ల వేషంబుధరించిన తావునకువెళ్ళి, యీవేషంబు మార్చి తన యెప్పటిరూపంబుఁదాల్చుకొని, పరుగుపరుగున నేరులు కొండలు చెట్లులు పుట్టల నక నారణ్యమార్గమునంబడి పోవుచు, మధ్యమధ్యహాకలభాషిణీ, నిన్నెట్లుశ్రమలపాలొనర్చితిని.ప్రభువు వారికికఠోరవార్త నేమని విన్నవింతును. రాజుగారీపనికై నన్నేల నియోగించవలె. నియోగించెబో నడుమనీగ్రహచారంబేల సంభవింపవలె, ఇదియంతయు నీశ్వరకల్పితము. తప్పింప నెవరితరము. అనివిషాదాక్రాంత మనస్కుఁడగుచు కొన్ని రోజులలోఁ జింతపల్లికిఁజేరుకొనెను. అచ్చట వేంకటాద్రినాయప్రభువరేణ్యుండు సిద్ధుండువచించిన కన్యకారత్నంబును నేడో రేపో నేత్రానందకరంబుగాఁ జూచుకొనఁగలనను యాశతోఁ గూడి, మోహరసావేశితస్వాంతుఁడై, యెదురెదురుఁజూచుచుండెను. అంతలో తడబడునడతో, చెమరించిన దేహముతో, మాఱినుపడి దీనత్వంబుసూచించు మొగంబుతో, వీడినకచబంధంబుతో, ధూళిధూసరితుండై యొకపురుషుండు కన్నులంబడియె. రాజువానింజూచి, వీఁడెవఁడో యిట్టివికారస్వరూపముతో రాఁబనియేమోనని సంశయాస్పదుండై యోచించుచుండ, నతండు సమీపించి నమస్కరించి మహాప్రభూ? దేవర వారు నియోగించిన కార్యసాఫల్యంబొనర్చుకొని, వచ్చి సంతోషపెట్టు భాగ్యంబీదాసుండ్యనకు లభింపదయ్యె. ఈకఠిన వార్తను నేనేమనివిన్నవింతుఁనని పశ్చాత్తాపంబునఁబల్కునఁ, యతనిని తనదూతగానెఱింగి, "చింతంపకుఁ జింతింపకు" ధైర్యం

బవలంబించి జరిగినకథను సవిస్తరంబుగా నెఱింగించి,సందేహ నివృత్తియొనర్పుమన, పూసఁగ్రుచ్చినట్లు తండు జరిగిన కథయంతయు విన్నవించె. యానృపాలచంద్రుండీదివిని, రోష భీషణకషాయితాక్షుండై ప్రళయాదిత్యునిమాడ్కి, చూపఱకు భయంకరంబుగాఁ గాన్పించు రూపంబుతో, సింహాసనంబుపై వెలుంగుచుండెను.





# వేంకటాద్రినాయఁడు

## నవమోల్లాసము.



అయ్యో! యీమార్గములందు చెంచులబాధ భరింపరానున్నదిగదా? నేనీరోజున బండిపాలెములో సుబ్బావధానులగారి, యింట సంతర్పణజరుగుచుండగా, నచ్చటికివెళ్లి, యప్పడములు, బూరెలు, గారెలు, పూర్ణాలు, నావడలు, కలమాన్నము మొదలైన సర్వభక్ష్యంబులను, నాభిప్రదేశంబు మొదలుకొని కంఠము వరకించుకంతయైన వెలితిలేకుండ మెక్కి, సంభావనందుకొని, త్వరగా నచ్చటనుంచి బయలువెడలి, కొణకంచి గ్రామములో కరణముగారు తనకుమారుని పెండ్లిఁజేసుకొంచూ వున్నారని, అబ్బయ్యగారు సుబ్బయ్యగారి చెవిలో మెల్లగాఁ జెప్పుచుండగా, నొకస్తంభము మరుఁగున నుంచి విని వారికన్న ముందుగా నచ్చటికివెళ్లి సంభావనఁ బుచ్చుకొనవలె నను పేరాసతో నిట్లొంటరిగా వడివడి నీమార్గమున వచ్చుచుంటిని. వచ్చుచుండగా నిచ్చటికిఁ గ్రోసెడు దూరమందున్న కొండసమీపమునందలి, యారణ్యమందుఁ గొం

దళుచెంచులు నన్నుముట్టడించి, తరుముకొనివచ్చి పట్టుకొని, యీచెంప యాచెంప వాయించి, నాయొద్దనున్న కొల్లాయి గుడ్డను బుడిచెంబును మొలకుఁగట్టుకొన్న మడిపంచను సుబ్బావధానులుగారు సంభావనగా నిచ్చిన రూపాయనుకూడ బలవంతముగా లాగుకొని, నానోట నింతమన్నుఁగొట్టి, నా తలమీఁద నున్న పిల్లజుట్టు నూడఁబెఱికి, యింకనెన్నియో చెప్ప గాని నీచకార్యము లొనర్చి, వదలివేసిరి. అని తనకగుపడిన ప్రతిమనుష్యునకు నీకథఁజెప్పుకొనుచు శివమెత్తిన మాదిరి, బాటంబడి దిగంబరియై, రామశాస్త్రియను బీదబ్రాహ్మణుఁడు బుసబుస వేడినిట్టూర్పులు విడుచుచు, నామార్గమందలి యొక గ్రామ సమీపమునకు రాగా, యీయన స్థితినిఁజూచి కడు జాలి నొంది, దయాంతఃకరణుండైన యొక్కపురుషుండు తన పైబట్టను తీసి, యీయనగా నాతండది మొలకుఁగట్టుకొనెను.

అంతట నాగ్రామ వాస్తవ్యులందఱొకరివెనుక నొకరా బీద బ్రాహ్మణుని సమీపించి, అయ్యా? నీవిప్పుడు చింతపల్లి కోటకు వెళ్లి, యమ్మహారాజ చంద్రుండైన వేంకటాద్రి నాయఁడుగారితో, నీపడిన పాటంతయు విన్నవించుకొనిన, నప్పృథువరేణ్యుండు నిన్నాదరించి, శీఘ్రకాలంబులో నద్దురాత్ములైన చెంచులఁ బట్టుకొని, కంఠములునరికించి, తనకోటకు బలిఁబెట్టఁగలండు. కావున నిప్పనిఁద్వరగా నాచరింపుమని వారందఱు నేకగ్రీవముగా నుడువ, నవ్విప్రుఁడచ్చోటనుండి చింతపల్లికి వెళ్లి, తనదురవస్థ నంతయు నిప్పాలుగక్క రాజ చూడామణితో విన్నవింప, నాశ్చర్యమొంది, యమలమనీషా వంతులగు మంత్రులరావించి, యాకథనంతయు సవిస్తారంబు

గా వినుపించి, యచ్చెంచుల సంహరించుటకు నిరపాయంబైన యుపాయంబొకటి యాలోచించి చెప్పుమనెను. అంతట నమ్మంత్రి సత్తములు కొంత దవ్వాలోచించి, రాజేంద్రునితో నిట్లనిరి.

మహాప్రభూ! ఆచెంచులు మిక్కిలి దోర్బలవంతులని యు, మాయోపాయ నిపుణులనియు, ఆయుధ సామగ్రీ సంపన్నులనియు, నసంఖ్యాకులనియు, వినియుందుముగదా? వారలతో నెదిరించి పోరి జయంబుఁగొనవలె నన్న కొంతసైన్యనష్టంబును, కొంత శరీరకష్టంబును, కొంత ధనవ్యయంబును కాఁగలదు. కావున నిదియంత సమంజసముగా మాకుఁగనుపడలేదు. వాండ్రనెట్లైన మోసపుచ్చి, మనకోట లోనికి వచ్చునటులఁజేసి వారల కంఠంబులుత్తరించిన, మనబలంబుల కించుకంతయైన హాని సంధిల్లనేరదు. సర్వవిధంబుల నిదియుత్తమంబని మామనస్సులకుఁదోచినది. తరువాత దేవరవారి చిత్తము. అనిమంత్రులు వలుకనాభూపాల తిలకుండు సెబాసని యమ్మంత్రోపమాన రుచ్యవాక్యమత్కృందును, మాయోపాయ విశారదుండును, దృఢకాయుండు, నగుభుజంగరావుం బిలిచి, యాచెంచుల నెట్లైన నీచమత్కార వాక్సుధాలోలురఁజేసి, మనకోట లోనికిఁబ్రవేశపెట్టుమనెను.

అంతట భుజంగరావు సంపూర్ణజవసత్వంబులుగల గుఱ్ఱంబు నధిరోహించి, యాచెంచులు సంచరించు పర్వతాగ్రంబుపైఁ జేరెను.

అప్పుడా చెంచులందఱు భుజంగరావుంగాంచి సంచలి

స్వాంతులై యెవఁడురా వీఁడు గుఱ్ఱముపై నెక్కి యొంటరిగా నిరాయుధుండై మనవెనకే వచ్చుచున్నాఁడని. యాలోచనా పరులై, యొకరి మొగమొకరు చూచుకొనుచుండ నీరావు వారలంగాంచి, ఓరీ చెంచులారా! నేను మీకొక యుపకారంబుఁదలపెట్టి వచ్చి శత్రుకోటిలోని వాఁడను కాను. మీకొక మహోపకారంబుఁ జేయుటకై నేను మీచెంతకు వచ్చుచున్నాడ. నన్నుఁజూచి మీరన్యథా భావింపకుఁడని, సముచితానునయాలాపములతో, నోదార్చుచు వారియొద్దకుఁ జేరి, కొన్నిరోజుల వరకు వారల తన చమత్కారవచోపారావారమున నోలలాడించి, తదనంతరము వెంకటాద్రినాయఁడుగారిదూతయగు భుజంగరావు ననియు, ఆరాజు మీబలధైర్యశౌర్యోత్సాహంబుల నెఱిఁగినవాఁడై, మెచ్చి మిమ్ముల నందఱిని, తనకోట యందు రక్షకభటులగా నుంచుకొని, సాకవలయు ననెడి యభిలాషచే. నన్నిచ్చటికిఁ బుత్తెంచెననియు, ఆమహారాజు నాశ్రయించి యుండిన మీకేవిధమైన లోపము లెఱుంగక జీవనములు చేయవచ్చు ననియుఁజెప్పి వారల నొప్పించి, వెంటఁదీసికొని, చింతపల్లి దారిఁబట్టి నడచుచుండెను.

నడచునప్పుడా సన్నని కాలిజాడ కడ్డముగా వచ్చియున్న కొమ్మలను వంచి తప్పించుకొనుచు, పూఁబొదరిండ్లందూరిపోవుచు, నచ్చటచ్చట సెలయేరులవెంట ననుగమించుచు, భీతావహస్థలంబుల దాటుచు. కేకలతోడను, కరతాళధ్వనుల తోడను, నిర్గమించుచుఁ, జెంచులుకోసి యిచ్చెడు యాటవిక ఫలంబుల నారగించి, తద్రుచి విశేషంబుల బిట్టుఁ

గొని యాడుచు, కొంతదూరంబు వచ్చిరి. అత్తఱి లంబాడి
దొంగలకు నాయకుండగు ఠాకరును దర్శించి, చేయనుద్య
మించుచున్న జటప్రోలు బందిపోటు విషయములోఁ దమభిల్ల
సైన్యముం గలుపుకొని, మనుష్యుల లెక్క వెంట భాగంబు
లిచ్చుటకై తగునేర్పాటులు మాట్లాడఁబోయిన చెంచులకు
మొనగాడైన భైరవనాయకుండెదురుగా వచ్చెను.

అప్పుడు వారందఱు జోహారొనరించి, పోయిన కార్య
మేమి జేసివచ్చితిరని యడిగిరి. అతండు, నేనుబోవుటయు
కార్యము నెఱవేరకుండుటయునా? నాతండ్రియు ఠాకరుతం
డ్రియు మాచిన్నతనమందు పాపికొండలలో నుండి, మేనులు
రెండుగను ప్రాణమొక్కటిగను తలంచుచుఁ జిరమైత్రి
తోఁ గాలముఁగడపుకొనుచుండెడువారు. మేమిరువురమును
వారుససైన్యముగా ధాళాలు చేయుటకు వెళ్ళినప్పుడునికి
పట్టున నుండి,కుందేళ్ళవేట సల్పుటయుఁ, దప్పించుకొని వచ్చిన
దూడలనుతోలుకొని వచ్చుటయు, మొదలగు బాల్యక్రీడ
లందు నత్యంతసహాయ మిత్రత్వములతో మెలంగుచుండెడు
వారము. అతండునాకు మొదటి సంగడికాడు. నేనుగీచిన గీత
దాటునా? నేటికి నరసింహస్వామి దయాతప్పుటవలన వానికి
నాకు దూరమైనది. ఇప్పుడతని స్థిరనివేశము గోదావరి గట్టు
నందలి పర్ణశాల సమీపము. అయినను మేమిద్దరముఁగలుసు
కొన యదృష్టయోగ ముండుటచే నేటికతండీప్రాంత్యములకుఁ
జీఁకటియాత్ర వచ్చినాఁడు. వాఁడు నన్నుఁజూచి చిన్నతన
మందుఁజూచిన పోలికలంబట్టి,కొంత గుర్తించి, పేరువిన్నంతనే
పరమసంతోషమునఁ గౌగలించుకొనెను. తదనంతరంబు

యోగక్షేమంబులడిగి, మధుమాంసాదులతో విందుఁగావించి నారాకకు కారణంబరసి, సంపూర్ణముగా నిష్టపడెను. ఆరణ్యకులగు చెంచులు లంబాడీలు నైకమత్యముతో నేకీభవించుట దనకుఁబరమ సమ్మతమనియు, బాల్యస్నేహితులమగు మనమిద్దరము నొక్కచో సేనాధ్యక్షులుగానుండుట కడువేడుకగానుండు ననియుఁజెప్పె.

ఈమాటలు చెంచులందఱు శ్రోత్రపర్వంబుగా వినిన వెనుక, భైరవనాయకుండాటవిక భాషతో దూరముగానున్న బంకిదొనలో మంచినీరుఁద్రాగఁబోయి వచ్చిన, భుజంగరావుం జూపి, యతఁడెవ్వరని యడిగెను.

చెంచులు—ఈయన చింతపల్లి దొరగారి దూతయఁట.

భైర—మనవద్దకెందుకు వచ్చినాఁడు

చెం—మనను తీసికొని పోవుటకు

భైర—ఏమిది తీసికొనిపోవుటకా! ఎట్లు తీసికొని పోవును.

చెం—మంచితనము చేతనే బలవంతముచేఁ గాదు

భైర—మననేమి-దొరలేమి-మంచితనముచేతనేమి. తీసికొని పోవుటేమి. కోటలోనికి మీరు పోవుటేమి. ఆశ్చర్యముగా నున్నదే, యెందుకై.

చెం—మఱేమి యుపద్రవము లేదయ్యా. దొరగారు మన ధైర్య శౌర్యసాహసాదులు లోకులవలన విని, యిట్టి వారినిఁ దానన్నవస్త్రాదులిచ్చి, సాకి, దేవిడీకి రక్షకభటులుగా నుంచుకొన్నచోఁ దనకు శత్రుభయము చో

రభయము లేకుండ, హాయిగా ఱొమ్ముపైఁజేయివైచుకొని, నిద్రఁబోవచ్చునని తలంచి, మనకీ వర్తమానముఁ జెప్పి, తీసికొని వచ్చుటకై, యితని సంపెను.

భైర — ఓహో! ఇదివట్టిమోసము. తిరుగుడు తిరుగుడు.

చెం — కాదయ్యా. యీయన పాపము బహుమెత్తని వాఁడు. ఈయన మాటలునీకై నిరీక్షణఁజేయుచుఁ బదిరోజుల నుండి, మనయిండ్లయొద్దనే బువ్వఁబెట్టి యుంచుకొని వినుచున్నాము. రాజు మనను కడుమెచ్చుకొనెనఁట. దొరసాని కోటకావలికి మననుపెట్టినఁగాని వల్లగాదని పోరాడుచున్నదఁట. మంత్రిముండాకొడుకు మాత్రము యిక్కడ యెంతబెట్టినను. వాండ్రుదొంగతనము మానరని, పుల్లలేయఁగా మహారాజుగారప్పుడప్పుడు నైజాం పల్లెలఁ దోచుకొనుటకు, వదలుదము లెమ్మని, చెప్పెనఁట. అందుపై మంత్రికూడ సమ్మతించి. చెంచుసైన్యపుఖర్చుకుఁగాను, యేడాదికి లక్షరూపాయలు బొక్కసమునుండి, యిచ్చుట కనుమతించెనఁట. మన చెంచు నాయకులకందఱికిఁ, గోటలోని దాసీలేయన్నమువండి పెట్టెదరఁట. మనకీనెమిలియీకలన్ని తీసివేయించి, బట్టలు అంగీలు పాగాలు యిస్తారఁట. మనమేరోజున నెచ్చటికిఁ బోవఁదలఁచుకొన్నను నభ్యంతరపుఁ జెప్పరఁట. మనమింక నెందుకుఁబోవఁగూడదు. భైరవ నాయకుం డాటవికుండైనను, కడుదూర దృష్టిఁగల వాఁడు. పరేంగితజ్ఞుఁడు. కనుకనే యింత సంఘమును వెనుకటినుండి నిరపాయముగాఁ గాపాడుకొని వచ్చు

చున్నాఁడు. దుర్మార్గ జనమునకు నాయకుఁడై, సంరక్షించుట సామాన్యము కాదు. అందుకు ప్రత్యుత్పన్నమతి కావలయును.

అప్పుడతఁడు తన సైనికులయొక్క మాటలువిని, భుజంగరావుతో సంభాషించి, యాతని వాగ్ధోరణింగని పెట్టి. శత్రువుల యకారణ దయావిశేష మవిశ్వసనీయమనియు. నెట్టిలాభంబుఁ గనుపర్చినను శత్రుహస్తగతంబుఁగాఁగూడదనియు, నీమొదలగు రాజనీతులం దలంచి, సైనికులకు బోధించి, వెనుకకు మరల్చి, కావులకుం జేర్చెను.





# వేంకటాద్రి నాయఁడు

## దశమోల్లాసము.

ఇట్లా భుజంగరావు చెంచుజేనివలనఁ బ్రాప్తఫలనాశం బగుటఁ గొంతవడి చింతించి, యెట్టకేలకుఁ దన్నుఁదాఁ దేర్చుకొని, పంకముఁ బోలు విషాదము నడుగు వట్టించి, తేరిన కొలంకువలె స్వచ్ఛంబగు మనంబున నొకకపటనాటక నిర్మాణంబొనర్చి, దృఢపఱచుకొని, కార్యక్రమమునకు దిగువాఁడై దానికి నాందిగా జటావల్కల దండకమండలాది పరికరంబుల సంపాదించి, మౌనివేషము ధరించెను.

ఇట్లు కృత్రిమయతియై భైరవనాయకుఁడు నివసించు కొండగుహకు వెళ్లెడు మార్గమున నొకప్రక్క, పుష్ప ఫల తరు లతా శోభితంబై, శీతల వాత పోత సమాయుక్తంబై, పరిశుద్ధ జలప్రపూరిత కాసార సమన్వితంబై, వంచక యతి జన మనోహ్లాద కరంబై, యొప్పు వనవాటి యందలి లతా గృహ సమీపంబున, దర్భాసనంబు వేసికొని కూర్చుండి, యస్త్ర శస్త్ర పరిశ్రమ కిణాంకమైన తనహస్తంబున రుద్రాక్ష

మూలికందాల్చి, నిమీలిత లోచనుండై, నిశ్చలంపు యోగి చంద్రునింబోలెఁ దపంబొనర్చు కొనుచుండెను.

కొంతకాలము వఱకిట్లు తపంబొనర్చుకొను చుండిన కపటయతి నొక్కనాఁడు కొందఱు చెంచుస్త్రీలతో సమీప వనవిహారంబుఁగావింప వచ్చిన భైరవనాయకుని భార్యబంగారియను నదికాంచి, యతని లావణ్య తారుణ్యంబుల కచ్చెరు వంది, కనుఱెప్ప వేయక చుఱుకుఁజూపులతో భస్మవిలేపనంబుతోఁ గూడి తెల్లని వలిపెపావడపైఁ గప్పిన బంగారు విగ్రహంబుకైవడి, ప్రకాశంబును వెలిగ్రక్కు నయ్యతీశ్వరుని దివ్యాకారంబు నానందంబుగా నీక్షించి, కుసుమశరశరాహతి నొచ్చిన హృదయముఁ గలదాయెను.

అంతట నాబంగారి తీవ్రోచ్ఛ్వాస నిశ్వాస పరంపరచేఁ జెమరించిన తనూతిలకఁ గలిఁగినదై, చిత్తస్వాస్థ్యంబుఁదక్కి, యతనిఁ బలుకరింప నెంచెను. కాని మునికినియు నేమో యను భయంబున సాహసింపదయ్యె. చెలికత్తియ లందఱు దొరసాని యందలి చంచలభావోత్పన్నంబైన యనిమిషత్వంబును, దేహ వల్లిపై ముత్యాల లీలఁగ్రాలు స్వేదబిందు సముదాయంబుఁ గని, సంశయాకుల మానసలై. తల్లీ! నీవిట్లేదో యొకవిధంబునఁ గనుపట్టుచు ముఖంబుపై స్వేదబిందువులు. వెలుంగనొక్క పెట్టుననీచూపునేలనిమ్మునిచంద్రుని పైఁబఱపెదవు. అనియడుగ నాబంగారి మిక్కిలి ప్రౌఢగావునఁ జెలులఁజూచి, యీముని వరుని జడలుగట్టిన బిరుసు వెంట్రుకలును, జనుపనార పీచు వలె వ్రేలాడుచున్న గడ్డంబును, బూడిదగుమ్మడి పండువలె నుండిన యీతని తముచ్ఛాయయును, నామనంబున కెంతయో వింతగాఁగనుపింప నిట్లుచూచుచుంటినని నవ్వి! యీవనప్రదేశ

మంతయుఁ దిరిగివచ్చుటచేఁ గడుబడలి శరీరంబెల్లఁ జెమట వసి యుచున్నదని ప్రత్యుత్తరముఁ జెప్పెను.

అప్పుడు వాండ్లందఱు నరణ్యసంచారంబొనరించుచు, విద్యాగంధంబిప న్మాత్రము నెఱుంగని మందమతులు గనుక, నిజమే యనుకొని మనమిచ్చటఁ దడవు మసలవలదు. మన మనుకొనెడి మాటల నీతండువినిన,ముప్పు వాటిల్లును.మనలోఁ బెద్దలుకొందఱప్పుడప్పుడుజడలఁదాల్చుకొని బొవురుపిల్లులవలె నుండు మునిముచ్చులఁజూచి నవ్వకుడు. వారల దరికైనఁ జేరకుడు. ఆముండాకొడుకులు తిట్టిన మనము మనపిల్లలుఁ జచ్చి పోవుదుమని చెప్పెదరు. అదియుఁగాక మనమువచ్చికూడ చాలసేపైనది. కనుక నిచ్చటినుండి శీఘ్రముగా బయలుదేరి పోవుదము. రండని యొకరినొకరుఁ బిలుచుకొని, దొరసానినిఁ దీసికొని, తమతమ నెలవుల కరిగిరి.

అచ్చెంచురాణి తనయెదుట నటించిన నటనయంతయు, సూక్ష్మదృష్టిచే నరయుచు, నది తనచెలులతోఁ దనవృత్తాంతంబును మాటుపఱచి చెప్పిన, ప్రౌఢవాక్యంబుల నాలించుచు తనమాయానాటకంబునఁ గొంతభాగంబు జరుగుచున్నదని, స్వాంతంబున సంతసించుచు, నెప్పటి యట్లు తపంబొనర్చుకొను చుండెను.

అచ్చట బంగారి పట్టఁజాలని మోహంబంతకంతకు రెట్టించుకొని, యతీంద్రుని పునర్దర్శనంబాచరించి, వశపర్చు కొను నుపాయంబుఁగానక, బహుయుక్తిశాలియుఁ, దనయాఅవ ప్రాణంబును నైన చెలినొకదానినిఁబిల్చి, తన యసాధ్యోదంతంబంతయు దాని చెవినివేసి, తనశోకభారంబుఁ గొంతదానిపై

మోపెను. అదియును కొంతవడి నాలోచించి, యిటువంటి చెడుతలంపుఁ దలంచుట నీకొటిదానికిఁ దగనిదనియు, యిది యపాయ కరమనియు,గడుదుర్ఘట మనియు,జెప్పి యాకోర్కను మాన్పింపఁజూచెను. కాని యదిమానునంతటి సాధుదశలోలేక చెలిప్రాణములఁదీయు.నంతటి బలవత్తరమైనదిగాఁ గనుపట్టిన, నింక నేమియు ననఁజాలక, చెలికోరిక నెఱవేర్చి, ప్రాణంబులఁ గాపాడుటకై తనయావచ్ఛక్తి నాలోచనా భాగంబునఁజేర్చి యాలోచింప నిరపాయ కరంబైన యొకయుక్తి స్ఫురించెను.

అప్పుడు చెలింజూచి చెలీ! నీవిట్లేల మోహసముద్రమున మునింగి, దరిదోచక కొట్టుకొనియెదవు. నేను నీకుఁ బ్రాణతుల్యమైన చెలినైయుండి, నీమనోవాంఛితంబిప్పట్లు నెఱవేర్పకుందునా? లెమ్ము. ఇప్పుడు నేనొక చక్కనియుక్తిఁ జెప్పెదను. నీభర్తగారు వచ్చునరికి నీవు తలకొకగుడ్డను బిగించి కట్టుకొని, మూల్గుచు నొకమంచముపైఁబడి దొర్లుచుండుము. అతఁడువచ్చి యేమిది యిట్లేలమూల్గెదవు. నీకుఁగలిఁగిన బాధ యేదియో శీఘ్రముగాఁ దెల్పుము. నేను దానికిఁ దగిన చెట్టుక్రియనుఁ దీసికొనివచ్చి, తత్క్షణంబ మాన్పువాఁడ ననును. అంతట నీవు మీరుతాకరుతోఁగూడి జటప్రోలుకు బందిపోటు పనిమీద వెళ్లిన, కొలఁదిదినంబులకు, నేనొకనాఁడు మన చెంచు స్త్రీలనందఱినిఁ గూడి, యిక్కడికి సమీపమందున్న వనమందుఁ గొంచెము సేపు విహరించి వచ్చితిని. ఆరోజుననే కొంచెము తలనొప్పి యారంభమైనది. అది రానురాను దినక్రమేణ నభివృద్ధిఁజెంది, యిప్పటికిఁ బ్రాణ

ణములమీఁదనాసవదల వలసినంతదాయెను. ఇఁక నొకటి రెండు రోజులిటులనే యూరకొనినయెడల నాతిరువాయి గూడ తీరునని చెప్పెను. ఈమాటవిని యతండు త్వరగా నరణ్యమునకేగి, తలనొప్పినిఁబోవఁగొట్టు చెట్టుక్రిందులన్నియుఁ దెచ్చి, యుపయోగింప నెంతమాత్రముఁ బోయినది కాదని పెద్దయెలుంగున బిట్టుగానేడ్చెను. ఏమిచేయ నతండు దరి దోచని మతితో నటునిటు తిరుగుచు సమయంబున, నన్నుఁబిలిచి విచారించిన నేమైనఁ గుదురునట్టి యుపాయంబుఁ జెప్పనేమో యని కొంచెమందించును. నన్నుఁబిలిచిన వెనుక నేనప్పటికిఁదగిన యుపాయంబుఁబన్ని, యతని నొప్పించి, నిన్నయ్యతివరికిఁజేర్చెదను,

అనిపలుకఁ జెలియందలి పూర్వపుటద్భుత సామర్థ్యం బులుకొన్ని తలఁపునకుఁ దెచ్చుకొని, యిది తనకార్యము నవ లీలగా గట్టెక్కింపఁగలదను నమ్మకముఁగలదిగ్రుయి, యది చెప్పిన ప్రకారము తలకొక గుడ్డను బిగించుకొని, మూల్గుచు మంచ ముమీఁదఁ బడిదొర్లుచుండెను.

భైరవనాయకుండచ్చట తమచిన్ననాటి స్నేహితుఁడైన శాకరునుఁ గూడి, తమతమ బలంబులతో జటప్రోలు రాజుగారి యింటిలో నొకరాత్రి హఠాత్తుగాఁ బ్రవేశించి, కోశాగారము తలుపులఁ బగులఁగొట్టి, బొక్కసమందుండిన యసంఖ్యాకం బైన ధనంబులో, నెవరుమోయఁగలిగినంత వారు మూట లుగట్టి నెత్తినఁబెట్టుకొని, పరుగుపరుగున వచ్చుచుండ, మార్గ మధ్యమున నాచెంచువాండ్లుఁదఱికి నెడమనేత్రములదర నా రంభించెను. ఆదుర్నిమిత్తంబును భైరవనాయకుండు గాంచి,

తమకేదో యొకయాపద రాఁగలదను భయంబున, తమభిల్ల సైన్యమునంతయు నతిజాగరూకుఁడై కాపాడుచుఁ దీసికొనివచ్చి వారివారి నెలవులకుంజేర్చి, తనయింటికి వచ్చి, తనభార్యస్థితి నంతయుఁగన్నులారఁజూచి యాతురతతో నేమిది యిట్లు మూల్గుచు మంచమువీాదఁ బడిదొర్లుచున్నావని యడుగ,నాబంగారి తనచెలియుపదేశము ననుసరించె.

బంగారి యందలి యనురాగంబున నున్మాదునింబోలె నడవింబడి తిరిగితిరిగి, కొన్నిదివ్యవనమూలికల సంపాదించు కొని, వచ్చి, భార్యతలనొప్పి కుపయోగించి, శమించినదా? అని యడుగ. నది మునుపటికంటెఁ గూడ మిక్కిలియెక్కువగానున్నది. నేనుజీవింప ననితలను రెండుచేతులతో మోదుకొనుచు, నత్యంతముగా నేడువ సాగెను.

తాఁదెచ్చిన దివ్యవనమూలిక లెంతమాత్రముఁ బనిచేయనందుకు మిక్కిలి యాశ్చర్యమొంది, యింతకంటె వేరైన మందులచేత నెవ్వరైనయీాతలనొప్పినిఁ బోఁగొట్టఁగలవాఁడుండునా? యని యాలోచించి, యెవరుఁగనుపడమి తానును దుఃఖసాగరనిమగ్నాంతరంగుఁడై, దరిదోచక కొట్టుకొను నమయంబున, బంగారి మగనింజూచి, మీారును నేనునిటులొకరి కొకరెదురుగాఁ గూర్చుండి యేడ్చిన నేమిలాభము. కొంతకాలమునుంచి మనకుఁ బ్రాణసమానయైన చెలియై, బహుమేధావంతురాలై మనకనతిదూరమునఁ బటకుటీరమందు వసించుచున్న మంగాభాయి నిచ్చటికిఁ బిలిపించిన, నీబాధ తొలఁగఁగల మార్గంబునొకదానినిఁజూపునేమో యనిపలికెను.

భైరవనాయకుండు కడుబుద్ధి శాలియైనను, శోకాతురుండై

యున్నవాఁడు గావున, వివేచనాశూన్యుఁడై యొకసేవకునిఁ బిలిచి, మంగాభాయి నిచ్చటికిఁ దోడ్కొని రమ్మనెను. సేవకుఁడు త్వరగా వెళ్ళి, మంగాభాయికి యుదంతం బెఱింగించి, నాపెనిటకుఁ దోడ్కొని రాగా భైరవనాయకుండాపె దిక్కు మొగంబై, నీచెలినెట్లు బ్రతికించుకొనియెదో యని నెక్కొనుశోకంబున విహ్వలించుచుఁ బలుక యాపె కడురయంబున బంగారి శిరంబును తన రెండు చేతులతో నొత్తిపట్టి చూచి, అబ్బ యీనొప్పి సామాన్యముగాఁ గుదురునది కాదు. దీనికేదైన నొకమహత్తరమైనదివ్యౌషధంబు పడవలయును. నేనుకొంచెము గట్టిగా నొత్తిపట్టి చూచినంత మాత్రముననే, వేఁడిచే నాచేతులు కమలునేమో యనితోఁచెను. అయినను మనమింత మాత్రమున నిరాశఁ జేసుకొని యూరకొనరాదు. మనము పోయెడు దారిప్రక్క నొకమునీంద్రుండు కొంతకాలమునుండి తపస్సుఁ జేసుకొను చున్నాఁడని వినుచున్నారము. మునుల యొద్దఁ జచ్చిన వారిని బ్రతికించునట్టి మందులుకూడ నుండును. మనమెట్లులేని యమ్మునినాశ్రయించి ప్రసన్నునిఁ జేసికొంటిమేని, యతండీపె తలనొప్పిని శీఘ్రకాలములో శాంతింపఁ జేసి, మనల నానందాంబుధి నోలలాడించును. యమ్మహాత్మునికి వినమఱెవ్వరిచేనైన నీబాధ వారింపఁబడునని తోఁచదు. అని మంగాభాయిపలుక భైరవనాయకుండు మంచిదని, యిట్లు చేయుటకు నీవుఁదక్క నన్యులెవరు నేరరు. కావున నీచెలినిఁ దీసికొనిపోయి, తలనొప్పిఁ గుదురించుకొని, వచ్చెదు భారము నీశిరంబుపై మోపినాడ. నీవిప్పుడే యిచ్చటినుండి నీచెలిసమేతముగా ఋషీంద్రుని సమీపించుమని పలుక, యమ్మంగాభాయి

చెలి(ప్రాణంబులఁ గాపాడుటకన్న నుత్తమంబొండు గలదే? యని తగువాహనంబు నధిరోహించి మీరుమావెంట నెవ్వరిఁబంపకుడు. పదిమంది యొక్కపెట్టున నచ్చోటుఁజేరిన ముని తపోవిఘ్నంబగునని శంకించి కోపపడుము. మేమిరువురమే యచ్చటికివెళ్లి సమయముఁ గనిపెట్టి, దర్శనం బాచరించి, యుచితరీతి కార్యానుకూలంబుఁ గావించుకొని వచ్చెదమని వెళ్లిరి.





# వేంకటాద్రినాయఁడు

ఏకాదశోల్లాసము.



ఈవిధముగా భైరవనాయకునిచే సెలవుఁబడసి, దారిఁ బట్టి ఋష్యాశ్రమప్రాంతమునకువచ్చి, మనోహరవేషంబులు దాల్చి, యమ్మునికెదురుగానున్న వనప్రదేశమందు విహరించుచుండిరి. అమ్మునియును కపటనాటకసూత్రమునేధరించియున్నవాఁడుఁగావున వారిరాకఁజూచి, యారోజునఁ బెందలకడనే తపోనిష్ఠఁ జాలించి, లేచి యాశ్రమంబు ప్రాంత నటునిటుఁ దిరుగుచు వారలు దర్శించుటకు సమయమిచ్చెను. ఆమానినులాసమయంబుఁగాంచి. పుష్పఫలంబులు కానుకలు గాఁగొని, మునిసమీపమునకు వెళ్లి, కానుకలు సమర్పించి, ప్రణామంబులాచరించి, నిలువంబడిరి. మంగాభాయి కెందువల్లనోగాని మునివద్ద చనవు మెండుగానుండెను. ముని వారలంజూచి మీరెవ్వరు? మీరెచ్చట నివసించువారు? ఏపనిమీద నిచ్చటికి వచ్చినారు. చెప్పుడని యడుగ మంగాభాయి మునింజూచి మహాత్మా! మేమీపర్వతంబున నివసించునట్టి చెంచులము. ఈమె చెంచునాయకుఁడగు భైరవనాయకుని భార్య.

నేనికి చెలిని. మా చెలికొక పురుషభూతంబు సోకి కొన్నిరోజులనుండి బాధించుచున్నది. భవత్తపోమహిమంబుచే నాభూతంబేదియో గ్రహించి, కృపాంతరంగులై దానినివదలించి, యుష్మత్కటాక్షవీక్షణంబులఁ బఱపి, మా చెలి ప్రాణంబులఁ గాపాడుడు. యిదే నేఁజేయు విన్నపమనిన. అతండు కొంచెము సేపేదియో యాలోచించుకొను వానివలె నూర్ధ్వదృష్టితో శిరఃకంపంబుఁగావించుచు, నటియించి మంగాభాయింజూచి, తెలిసె మీ చెలికిసోకిన భూతము. అది పెద్ద మదనభూతము. నేను యోగిని. దానినెట్లు పాఱఁదోలనేర్తును. “ఎలుకలకొఱకై యిల్లుకుఁజిచ్చుఁబెట్టినట్లు” మీ చెలికొఱకై పుట్టినదాదిగా నేటివరకుఁ గాపాడుచువచ్చిన బ్రహ్మచర్యమౌనముద్రఁగోలుపోదునా? మీచనువులిచ్చుటఁజెల్లవు. పొండనిపలుక మంగాభాయి పరోపకారము బహుపుణ్యమనియు, నార్తులరక్షించుటుత్తమంబనియు, పరిపరి విధంబుల నుచితరీతి నొకటి రెండు రోజుల వరకుబోధింప, నెట్టకేలకుఁ దప్పక నొడంబడు వానికైవశి సనుమతించెను.

అంతవరకు సంశయాకులమానసయై పరితపించు బంగారి తనచెలి యద్భుత కార్యఘటనా సామర్థ్యమును వేయి విధంబులఁ గొనియాడుచుఁ, దానమందానందాంబుధి మునిఁగి తేలుచుండెను.

మునియంతట కుసుమశరశరపీడితుఁడై, చుఱుకుఁజూపుల నచ్చెంచురాణిం జూడనదనెఱింగి, మంగాభాయి యాహారార్థము పండ్లుకోసి తెచ్చెదనను మిషతో నచటికి సమీపమున నున్న పండ్లచెట్ల చాటునకేగెను. అక్కవట మునీంద్రుండంతట

నచ్చెంచురాణి కరంబు గ్రహింప, సిగ్గుచేనది కొంచెము తల వంచుకొనఁ, బెండ్లికూతురు పెండ్లికొడుకు మాదిరి నుండిరి. ఆవల లతాగృహంబుఁ జేరి, గడ్డిమెత్తలపై ననురాగరసంబులు పొంగిపొరలమణిత ఘూత్కారాదిరవంబులు గ్రమ్ముకొన, తనూలతలు చెమరింప, నానందపరవశత్వంబు నొందుచు, ననంగ సంగరక్రీడా మహోత్సవంబుఁ జరిపిరి.

ఆమహోత్సవానంతరమున నాటవిక ఫలంబుల నాహారార్థముగాఁ గొనివచ్చిన, మంగాభాయింగూడి, వలభక్షణంబొనర్చు సమయంబునఁ భైరవనాయకుని యొద్దనుండి దూతవచ్చి, యచ్చటి చెంచుల కుశలం బెఱింగించి. బంగారితో మీతలనొప్పి బాధ యెటులున్నదో కనుఁగొని రమ్మని మాదొరపంపగా వచ్చితినని చెప్ప, మంగాభాయి వానిఁజూచి తలనొప్పి కొంచెము నెమ్మదిగానే యున్నదనియు, నావైద్యుఁడింకా కొన్నిరోజులుండు మన్నాఁడనియు, మీదొరతోఁ జెప్పుమని చెప్పి వానిఁబంపివేసిరి. ప్రతిరోజుఁ జెలితెచ్చి యిచ్చెడి ఫలముల భక్షించుచు, నక్కపటయతితోఁగూడి, మదన సామ్రాజ్య వైభవస్ఫూర్తి ననుభవించుచుఁ, గొంతకాలము గడచినవెనుక నొకనాఁడా భుజంగరావునిఁజూచి, స్వామీ! నిన్నువిడచి నేనొక నిముసమైన మనఁజాల. ఇట్టులెంతకాలమని మగనిని బొంకించి యిచటనుందును. ఈకార్యమెప్పటికైనను కడుమోసకరము. మీరీవనంబును వదలి మాయింటి యొద్దనే యాశ్రమంబేర్పాటుఁ జేసుకొని, యందువసించి. నన్నన్నివిధంబులఁ గృతార్థురాలినింగా నొనర్పుఁడని, బంగారి వేడుకొనెను. ముని దానిమాటలువిని, నీమగఁడు కిరాతులగు

కెంచులకు నాయకుండు. మీరు నివసించునది దుర్గమప్రదేశము. మీరుపయోగించునవి దుర్గంధసమన్వితంబులగు మధుమాంసాదులు. నేనుసాధువును. నిర్మలజలంబులచే విలసిల్లు కాసారతీరమున వసించువాఁడ. పవనపర్ణాంబుభక్షుఁడ. నేనెట్లు వచ్చి మీయింటిసమీపమున నాశ్రమంబేర్పాటుఁ జేసుకొని వసింపనేర్తు. ఇది పరస్పరవిరోధమని పలుక నాబంగారి పరస్పరవిరోధి జాతిన జనితనగు నేనెట్లుమీదయకుఁ బాత్రురాలనైతినో యట్లే మాయింటి సమీపంబు మీకునివాసయోగ్యంబగు స్థలంబగుఁగాక యని చిఱునగవంకురించు మొగంబుతోననియె.

భుజంగరావు సమీపస్థుండనైన కార్యసాధనంబచిరకాలములో నగునని యెంచి, నీయందలి ప్రేమచే నీమాట కాదనలేక యొడంబడ వలసివచ్చినదని వాకుృచ్చెను.

అంత బంగారి మెనలేని సంతసముతో మంగాభాయితోఁ గలసి భుజించునప్పుడా యతిచంద్రుండు తనయింటికి వచ్చుటకొడంబడిన వార్తను నాపెకు వినుపించి కర్ణానందంబొనరించి యొక్కనాడయ్యతినిఁ జెలినిఁదోడ్కొని తననెలవు నకుంజని భైరవనాయకునకుఁ గన్నులపండువొనరించెను. భైరవనాయకుండు తనసతికిఁ దలబాధఁ బోగొట్టి ప్రాణదానంబొనరించిన మునికులతిలకుని భార్యానుమతంబున తమయింటి సమీపమునసే యాశ్రమంబేర్పాటుఁజేయించి యందునిచి కృతజ్ఞతా సూచకుఁడై పరిచర్యనొనరించుచు, నమ్మునిసత్తముండు వాగ్రూపముగానొసంగు వినోదకథాసుధారసంబు మద్యంబునకు బదులుగాఁగొంతవరకుఁ గ్రోలుచు నానందమను

మత్తు చే నోడలెఱుంగక సంచరించుచుండెను. చెంచువాండ్లం దఱుం గూడ తమనాయకునితోంబాటిమ్ముని సేవయే జేయుచు నవ్వుంబుట్టించెడి యాతనిమాటలను, బద్ధానురాగులై వినం జొచ్చిరి. ఇట్లు తనమాటలను దృఢవిశ్వాసములతో వినుచుండ, నంతట భుజంగరావు వర్తమానకాలపు రాజులచరిత్రలన్నియు, రోజుకొకటి చొప్పున భైరవనాయకునకుం దత్సైన్యమునకు వినుపింప సాగెను. ఈరీతిం జెప్పుచు రానురానొక దినంబున వేంకటాద్రినాయనిం గూర్చి ముచ్చటించుచు, నారాజమౌళి బహు ధర్మాత్ముండనియు, న్యాయాన్యాయ విచక్షణాదక్షుం డనియు, బహుధనవంతుండనియుం దన్నునమ్మినవారిని మంచి ప్రేమతో సాకుననియు, నబద్ధమాడు వాండు కాడనియు, వం చకవ్యాపారాదులతని యందు లేవనియు, నీమొదలైనయుత్త మ రాజలక్షణంబు లతనియందెన్నియో గలవనియు, నమ్మ హాత్మునకు మేముంగూడ వందనంబు లాచరించుచు నతని దివ్యనామాక్షరంబులు భగవన్నామంబునుంబోలె, హృదయ పద్మమున నిలిపి సదాధ్యానించు చుందుమనియు, సాక్షాద్భగ వదంశచే నతండీ లోకమున జనించెననియు, నతని యాశ్ర యించిన వారెల్లయు సుఖంతురనియు, నతని సౌజన్యప్రసన్న భావంబులు బహువిధంబుల శ్లాఘించి యుపన్యసించెను.

చెంచులుం జెంచునాయకుండా యుపన్యాసమంతయు విని, మరునాడుదయమున నొక్కచో సభందీర్చి, మనమునీం ద్రుండు వెంకటాద్రినాయండు మిక్కిలి మంచివాండని చెప్పు చున్నాండు మునుపు మనలనందఱినిం దనకోటయందు రక్షక భటులనుగా నుంచుకొని, పోషింతునని వర్తమానముం బంపుట

మోసగించుటకుఁ గాదు. మనమే తెలియక నొకపెట్టె యందు మానముఁ బెట్టుకొని, చింతపల్లికోటలోనికిఁ బోవుటకు సంశయించి మానుకొంటిమి. ఇప్పుడు మనమాకోటలోనికి వెళ్ళి రాజసన్మానంబుఁ బడసి, సుఖముగా జీవించుట కేదైన నుపాయంబు గలదేమో? యీరోజున నాగతానాగత వేదియగు మనముని నడిగి తెలిసికొందము. భాగ్యవశమున నెట్టులైన నాప్రభువరేణ్యునిఁ గృపకుఁ బాత్రులమైతిమేని, మనకష్టములన్నియు గట్టెక్కినట్లే యని యెల్లరు నాలోచించుకొని సాయంత్రమునఁ దమకెప్పటియట్లు కథఁజెప్ప వచ్చిన మునీంద్రునిఁ జూచి స్వామీ? యొకచిన్న మనవి. ప్రభువరేణ్యుండైన వెంకటాద్రి నాయుండు మమ్ముల నందఱినిఁ దనకోటయందుఁ గావలిగా నుంచుకొని, సుఖజీవనంబు లిచ్చెదనని మాతోఁజెప్పి తోడ్కొనిరమ్మని మాకడకుఁదనదూతనొకనిఁబంపించె. మమ్ముల నేదో మోసగించుటకొఱకని, మేమాతనిమాటలు నమ్మఁజాలక యాతనివెంటఁ గోటకరుగమైతిమి. నిజముగా మమ్మతఁడు రక్షించుటకుఁ బిల్చెనా? లేక చేఁజిక్కించుకొని శిక్షించుటకుఁ బిల్చెనా? తమ నడుగవలయునను కొనినాము. మాకీసందేహనివృత్తిఁ జేయుఁడని పలుక, నక్కపటయతియైన భుజంగరావు! వీండ్లిప్పుడు నామాయావటనలోఁ బడిరని సంతసించి, వారలఁజూచి యోరీచెంచులారా? నేనిప్పుడు దివ్యదృష్టిచేఁ జక్కఁగాఁ జూచితిని. ఆరాజేంద్రుండు నిజముగా మిమ్ముఁదనకోటకు రక్షకభటులనుగా నుంచుకొని, సుఖజీవనము లిచ్చి, పోషించ వలయునను సదుద్దేశ్యముతోనే మిమ్ముఁబిలిపించె. మీరే యామహారాజు యోగ్యబుద్ధినిఁ గనిపెట్టలేక

సుఖజీవనంబు లేటఁగల్పు కొంటిరి. ఇప్పటికైనను మీచెంచులందఱొక్కసారిగా నాచింతపల్లికోటకు వెళ్లి యాశాజోత ముని దర్శించి, మీయపార శౌర్య ధైర్యంబులు ప్రత్యక్షంబుసఁ గనుపరచి, మెప్పించిన నతఁడద్భుతమందికోటఁగాపాడు పనిమీద నుంచి, మీకుకొన్ని యూళ్ళగ్రహారములిచ్చి, పోషించును. ఇందుకెంత మాత్రము సందియంబు లేదని మునీంద్రుడు చెప్పిన నాచెంచులందఱు మహాత్మా! మేమా కోటలోనికి వెళ్లుటకు మాకు ధైర్యము చాలదు. మీరుకూడ మాకు సహాయముగా నాచింతపల్లికి వచ్చి, మహారాజదర్శనముఁ జేయించి, మమ్ముద్ధరించవలయు నని, బహువిధంబులఁ బ్రార్థించిన, నమ్మునియుఁ బరోపకారము కావున నట్లనే వచ్చెదనని చెప్పి, యాచెంచుమూకనంతయుఁ గూర్చుకొని, భైరవనాయకుండు చింతపల్లి మార్గమునుఁబట్టి, మహాసంతోషముతో నడచునట్లుగా నొనరించెను.





# వేంకటాద్రినాయఁడు

## ద్వాదశోల్లాసము.



భుజంగరావు చెంచులను మోసగించి, మనకోటకుఁ దీసికొని రాఁగలందులకై వెళ్లి, కొన్నిమాసములైనది. అతం డేకారణంబున నింతతడవు మసలి యుండవచ్చును. అతని మోసంబు గ్రహించి, చెంచులేమైన హానిఁజేసి యుండరుగదా? అట్లెన్నటికిఁగానేరదు. అతఁడు మిక్కిలి బుద్ధిశాలి కనుక వారలకుఁదనగుట్టుఁ దెలియనీక యెట్లైన వారిఁడను మోసగించి తెచ్చును. చెంచులకు మొనగాడైన భైరవనాయకుండను కడుయుక్తిశాలి యనియు, నతనినెట్లైనఁ దనమాయాజాలమునఁ జిక్కించుటకై, తగువేషంబును పన్నియున్నాఁడనియు, వినియుంటిమి గదా? నేడో రేపో చెంచులతోనహా యతఁడిచ్చుటకి రాఁగలఁడను నమ్మకము నామనంబున దృఢముగా నాటియున్నది. అని భుజంగరావు రాకుండుటను గుఱించి, యాలోచించుచు, మంత్రి సామంత విద్వజ్జన పరివృతంబగు, కొలువుకూటంబున రత్నములు స్థాపించిన బంగరుగద్దియపైఁ గూర్చుండి, యుదయగిరిపై వెలుంగు సహస్రకరునధిక్షేపించు చుండునమయంబునఁ జెంచుల గుంపునుఁ దీసికొని, మునీంద్రుం

డొక్కరుండు హఠాత్తుగాఁ బ్రవేశించెను. అప్పుడా కొల్వు కూటంబున నున్న వారెల్లరు నివ్వెఱపాటుతో నాశ్చర్యముగాఁ జూడఁదొడంగిరి. చెంచులందఱు వంట యింటిలోఁ జేరిన కుండేటి పిల్లలైరి. వారల పిశాచంబులఁబోలు రూపంబులు, వాండ్రు మెడలయందు హారములుగాఁ దాల్చినపూసల పేర్లును, వాండ్రు మోతబరువుచేటుగా ధరియించిన నెమలి యీకలు మొదలుగాఁగల వానినెల్ల సమగ్రముగాఁ గాంచి, విహాసములు చేయుచుండిరి. మునియంతట తొందర తొందరగా రాజు సమీపమునకు వచ్చి, మహాప్రభూ! యీ చెంచులందఱు మిమ్మాశ్రయించి, రక్షకభటోద్యోగమునఁ బ్రవేశించి, జీవించవలయునని తమసన్నిధికి వచ్చియున్నారు. వీరినెట్లైనఁ గటాక్షించి, వర్తనంబొనరించి, తమకోటకుఁ గాపుంచుకొనుఁడని పల్కిన, వేంకటాద్రినాయుండాముని కంఠధ్వనినిఁబట్టియు, ముఖవర్చస్సునుఁబట్టియు, మాటల సందర్భమునఁబట్టియు, నతండు భుజంగరావని యెఱింగి, సంతోషించినవాఁడై చిఱునగవుతో నీబోటి మునీంద్రుండు చెప్పిన మాటఁగాదుండునా! చెంచులారా! యిటురండు. ఈ మునీంద్రుండు చెప్పినచొప్పున మిమ్ము మాకోటకుఁ గాపుంచుకొనియెద. నేనీరోజున రాచకీయ కార్యభారంబు వహించియున్నాఁడ. తీరికలేదు. రేపటిరోజున మీబలధైర్యంబులును, విద్యాచాతుర్యంబును, పరీక్షఁజేసి, యెవరికిఁ దగిన యుద్యోగము వానికిచ్చెద, సేనాధిపా! యిటురమ్ము. నీవీ చెంచులఁ దోడ్కొనిపోయి మనధర్మసత్రాధికారితో వీండ్లందఱికిఁదగు శాకపాకములతో, భోజనంబులు పెట్టుమని నామాటలుగాఁ

జెప్పి, భోజనానంతరమున వీండ్లందఱికి శయనించుటకుఁ దగిన యిల్లొకటిఁ జూపి, యందునిచి రక్షించి రేపుదయమునందగు జాగ్రత్తతో నాకొలువుకూటంబునకుఁ దీసికొనిరమ్ము. అని సేనాధిపునకాజ్ఞ యిచ్చి, సత్రంబునకు నాతనివెంటఁ జెంచుల నందఱినిఁ బంపివేసెను. తరువాత రాజు మునిరూపుతోనుండిన భుజంగరావుంజూచి, నీవీరీతి యతిరూపంబేలఁ దాల్చితివని యడిగిన భుజంగరావు తనమాయానాటకంబంతయు నచ్చటఁ బ్రదర్శించి, రాజసన్మానమునకుఁ బాత్రుఁడాయెను. రాజంతట మంత్రిపుంగవులంజూచి, యన్నవస్త్రంబులిచ్చి పోషింతుమని చెప్పి, యీచెంచుల నిచ్చటికి రప్పించితిమి. ఆసగొల్పి మోసగించి తెచ్చిన వీండ్లను చంపుటకు నామనసొప్పుట లేదు. పోషింతుమని తీసికొని వచ్చి చంపుటన్యాయము. మహాపాపము. ఇట్టి దుష్కార్యంబొనరించి శాశ్వతముగాఁ ద్రిజగజ్జన నిందాభారము భరింపఁజాల. వీండ్లందఱికిఁ దగువసతులిచ్చి పోషించి, చోరత్వమును మాన్పి, దేశక్షేమంబొనరించువాఁడ. ఇట్లైన భగవంతుండు మెచ్చు, భగవంతుఁడు మెచ్చిన మోక్షంబు కరతలామలకంబని వచించిన, వారలు దుష్టుల నెట్లు మోసగించి తీసికొనివచ్చి చంపించినను, పాపంబురాదనియు. దొంగలకెన్ని వసతులిచ్చి పోషించినను, పాములకుఁ బాలుఁబోసిన విషంబేవృద్ధియగు, నట్లు వారల సహజగుణమే రెట్టించునని, యాదుర్మార్గుల నెట్లుఁజంపించినను మూఁడులోకంబులవారుఁ గీర్తింతురేకాని నిందింపరనియు, భగవంతుఁడుఁ గూడఁ గ్రూరులననేక కుచ్ఛితోపాయములచేఁ బరిమార్చెననియు, నీమొదలగు నితిహాసంబు లెన్నియో చెప్పి, నృపుని

మనోకళంకంబుఁ జేర్చి, సంశయంబుఁదీర్చి, చెంచులవధ కొప్పుకొనిన వానినిగాఁ జేసిరి.

అమ్మహారాజా బ్రాహ్మణమంత్రుల నుపాయంబడుగ నొక్కొక్కనిని విద్యాపరీక్షఁగావించి, సైన్యములోఁ జేర్చుకొన్నట్లు-చీటీయిచ్చుచుండు మనియు, నతనిని భుజంగరావు వెంటఁబెట్టుకొని పోయి దూరముగానున్న జైలులో బంధించి వచ్చుచుండవలయుననియు, ఇట్లందఱిని బంధించిన వెనుక తలలఁ దరిగించుమనియుఁ జెప్పిరి. మరునాడుదయమునఁ గొలువుఁ జేసినవెనుక పైప్రకారము కిరాతులవధ జరుపబడియె. ఏమిచెప్పవలయు దుష్టులకెప్పటికైన నిట్టియకాల మరణంబుతప్పనిదే ఎట్టి ప్రజ్ఞావంతుండైనను, యెట్టిబలవంతుండైనను, యెట్టిసంఘ బలిమిఁగలిఁగియున్నను, యెట్టి దుర్గమారణ్యముల సంచరించుచున్నను, క్రూరకర్మమను భూతము వారలపైఁ బడి మ్రింగివేయుట నిశ్చయము. భైరవనాయకుని తలమాత్రము చోరులందఱు భయమందునట్లుగాఁ దనకోట కొమ్మునఁగట్టించె. పిమ్మట నాదేశంబునఁగల ప్రజలెల్లరుఁ జోరభయంబుఁ దక్కి సంచరించుచు, భూపాలుని ధర్మపరిపాలనా సౌఖ్యమును వేనోరులఁబొగడుకొనఁజొచ్చిరి.అదేమోకాని భూపాలునకు మాత్రము చెంచుల నఱికించిన రోజు మొదలుకొని యాహారంబు రుచింపకపోవుటయుఁ,గంటికినిద్ర రాకుండుటయు, మనోస్వస్థతలేకుండుటయుఁ, దనయంతరాత్మ తనను పీడించుటయు, నీమొదలైన వికలత్వంబులు గల్గియుండెను. విద్వజ్జనంబులు మంత్రులు మొదలగువారు రాజిట్లు వికలుఁడై చరించుటకుఁ గారణంబరసి కనుగొనలేక స్థిమితంబుఁ

దక్కి, త్రొక్కటపడుచు భగవత్ప్రార్థనాపరుఁడై కాలంబు గడపుచుండ నొకనాటిరేయి ప్రభువునకుఁ గొంచెము నిదుర పట్టెను. ఆనిద్రలో నొక మహాపురుషుండు పాపసరులఁదాల్చి, మమ్మొనవాలు చేఁబూని, కాలగళంబున నొప్పగు రుద్రాక్ష మాలికఁ ధరియించి, విభూతి మైనిండ నలదుకొని, చంద్రావతంసంబు శిరంబుపై వెలుంగ వృషభ వాహనారూఢుఁడై, తనసమ్ముఖంబున సాక్షాత్కరించెను. రాజేంద్రుండిట్లు సాక్షాత్కరించిన మహాపురుష విగ్రహముంగాంచి, యింతింతనరాని సంతసంబున నేత్రసాఫల్యము సిద్ధించునట్లు చూచుచుండ, నద్దివ్యపురుషుండు, రాజుఁ జూచి. యన్నవస్త్రాదులిచ్చి పోషింతునని చెప్పి మోసగించి తీసికొనివచ్చి, చెంచులను నీపురియందు నరికించిన మహాపాపము నిన్నీ రూపమున బాధించును నీవీరోజునుంచి యీచింతపల్లి కోటయందు నివసింపక నూతనముగా నీవు ధాన్యకటకమను పేరుతో జగద్విఖ్యాతిఁగాంచిన దివ్యక్షేత్రమున నమరావతి యను పేరుతో నిర్మించుచున్న నగరమున నివసింపుము. ఆనగరంబున వసించి, యమరేశ్వరాలయమును కట్టించి నీరాజ్యంబున పూజ్యస్థలములందునేకోత్తర శత శివాలయంబులఁగట్టించి, యద్దేవళంబులన్నిఁటియందొక్క దివ్యముహూర్తంబున లింగప్రతిష్ఠఁ జేయించిన మొదల నీ మనో వికలత్వంబు తొలంగునని చెప్పి, యంతర్ధానంబు నొందెను. అంత మేల్కాంచి భూపాలుండు తనకుఁ గలయందు సాక్షాత్కరించిన మహాపురుషుండీశ్వరుండని గ్రహించి యతండు తనయందలి వాత్సల్యంబుచేఁ దనపాపనివారణోపాయంబీవిధంబునఁ గలలోవచ్చి, చెప్పినందున కెంతయునంత

సించుచుఁ దనమంత్రులంబిలిచి, కలతెఱంగెఱింగించిన వారలందఱుమందానందంబునొందిరి.

రాజంత మంత్రులఁజూచి, మనము మన నూతననగరంబునకేగి, యది యెంతవరకుఁ దయారైనదో చూచి రావలయు, నీవుఁగూడ ప్రయాణంబై రమ్మని. అని పల్కిన మంత్రి మహాభాగ్యంబని, సత్వరంబ పయనమైరా—రాజమంత్రులిరువురు నవసరమైన పనివాండ్రను కొందఱిని మట్టుకు వెంటఁదీసికొని, యశ్వారూఢులై నూతననగరంబునకుఁ బోవు మార్గమునుబట్టి పోవుచుండిరి. వారికామార్గమున కటునిటు పక్కలనుండిన చెట్లయందు మనోహరముగా వికసించిన పూవులును, ఆపూల చెట్లనుండి సుగంధ యుక్తముగా మేనులకుం దాకెడి చల్లగాలియును, ఆపచ్చిక బయళ్ల సొంపును, ఆపైరుల పచ్చఁదనంబును, యావింతవింత పక్షులశ్రవణానందకరమైన కూతలును, నిర్మలజలంబుచే విలసిల్లు కాసారంబులును, మానంబున కెంతయో హాయినిఁ గూర్చుచుండెను. ఇట్లు కొంతదూరంబు నడచుచు రానురాన నతిదూరమునఁ గొన్ని దివ్యభవనంబులు నింగి ముట్టినవై—తమపాలగచ్చు కాంతులు విలసిల్ల చంద్రునితో వియ్యమందఁ బోవుచున్నవో యనునటుల గనుపించుచుండెను. మఱికొంత దగ్గఱకురా—నా మేడలపైఁ జిత్రించిన పూఁదీఁగెలును, పువ్వులును, నవ్వుఁ బుట్టించెడి వింతవింత బొమ్మలును, ధగద్ధగాయమానమగు దర్వాజలును, నయన గోచరంబై యాహ్లాదంబుఁ గలిగింప సాగెను. మఱి రెండడుగులు నడచి, భూలోక వైకుంఠముగా బోలు నూతన నగరంబులోఁ బ్రవేశించు సరికి నొకపురుష

పుంగవుఁడెదురుగా నేతెంచి, నమస్కారంబుఁగావించి, యీ రాజ మంత్రుల నిర్వుర నానగరంబులోనికిఁ గొనిపోయి, కన్నులు మిఱుమిట్లు గొలుపు నొకదివ్యభవనంబున మెఱుంగు టున్నతాసనంబులపై నధిష్ఠింపఁ జేసెను.

ఇట్లుచితరీతి వీరిని సత్కరించిన యీపురుషుండే వేంకటాద్రినాయ మహీపాలుని ప్రధానోత్తముండు. ఆనగరమే యీరాజమౌళి నూతననగరము. అనంతరమారాజ మంత్రులిరువురు నీప్రధానియుఁ గుశలప్రశ్నలఁ గావించుకొని, కొంతదవ్వి ష్టాగోష్ఠిగా మాటలాడు కొని, యాసనంబులనుండి లేచి, యాగృహములోనికిఁ బ్రవేశించి, యిద్దాని సోయగంబు నీక్షించి, దానినిర్మించిన యపరమయుని ప్రజ్ఞావిశేషంబుఁ గొనియాడుచు నచ్చటనుండి వెడలి, రాజమార్గంబులఁ బట్టి తిరుగుచు, నచ్చటచ్చటి విశేషంబుల నారయుచు, నగరంబంతయుఁ బరిభ్రమించి, దానియమరాల్య విలాసంబున కచ్చెరువందుచుఁ బ్రధానుని బుద్ధిచాకచక్యంబును సంస్తవించుచుఁ బ్రధానునితోఁ దానిచ్చటనుండి వేదగిరిపైనుండిన మరాఠీల దండును సంహరించఁ బోయిన దినంబు మొదలుకొని యీ రోజువరకు జరిగిన కథాభాగంబంతయు వివరముగా వినుపించి, యతని కింతింతనరాని సంతసంబుఁగూర్చెను, తదుపరి శంకరుండు తనకు స్వప్నములో సాక్షాత్కరించి, తనపాప నివారణంబునకుఁ గాను నవీనగరంబున నివసించుమనిన సంగతియు నమరేశ్వరాలయము నున్నతిగావింపు మనిన సంగతియు, నూటిమీద నొక్క శివాలయంబుగట్టించి యేకముహూర్తంబున నాదేవళంబులన్నింటి యందు లింగప్రతిష్ఠఁ జేయుమనిన

సంగతియు, వినుపించి, మనమీపురంబున నివసించుట కిప్పుడే మైన నంతరాయములుండెనా? అనియడిగెను. ప్రధానుండంతట రాజుంజూచి స్వామీ? తమరిప్పుడిప్పురంబున సర్వసన్నాహ సమేతముగా వచ్చి నివసింపవచ్చును. కొంచెము కొంచెము పనులైన కుగిలియున్న యెడల నెమ్మదిగాఁ దయారు చేయించ వచ్చును. అనిపలికిన రాజాలెన్న యని, తనతోవచ్చిన సేవకాబృందమును మంత్రిని వెంటఁబెట్టుకొని, చింతపల్లికోటకు వచ్చి, తనసైన్యమును, గుఱ్ఱంబుల, నేనుగులను, బొక్కసమందుండిన సమస్తద్రవ్యంబును, అవియివి యననేల నొకపూరిపుల్లయైనను విడువకుండ నొక్కసారిగా శకటాదులపైఁ గట్టించుకొని, నూతన నగరంబైన యమరావతీపురంబునకుఁ జేర్చి, తానును సకుటుంబముగా వచ్చి, తనకై నిర్మింపంజేసిన వైజయంతమను పేరుఁగల దివ్యభవనంబునఁ బ్రవేశించెను.

నగరప్రవేశమొనర్చిన రోజున బీదలకెల్లను సంతృప్తిగా భోజనంబుఁ బెట్టించి, వస్త్రదానంబుఁ జేసి సంతసింపఁ జేసెను. బంధు మిత్ర విద్వజ్జనామాత్య సహితంబుగాఁ దానును, నిష్టమృష్టాన్న సంతృప్తి నొంది, వాద్య ఘోషములు దిగ్దంతులఁజెవుడు పఱుప, నపరిమితానందముగాఁ బండుగ గావించుకొనియె. తదుపరి నొక దివ్యముహూర్తంబున నమరేశ్వరస్వామికిం దగిన దివ్యాలయంబుఁ గట్టుటకు, నేర్పరులై ప్రసిద్ధిఁగాంచిన కొందఱు సుతారీలఁ బిలిపించి, పని ప్రారంభింపఁ జేసెను. పిమ్మట నేకోత్తర శతశివాలయంబులఁ గట్టుటకుఁ దగిన పుణ్య క్షేత్రంబులెవ్వియో మంత్రి విద్వజ్జనంబులంబిలిపించి, యాలోచించుటకుఁగానొక రోజున కొల్వుకూ

టంబు శోభాయమానంబుగా నలంకరింపఁజేసి, యందు వరుసలుదీర్చి, పడకకుర్చీలు వేయించి, ప్రముఖుల నందందఁ గూర్చుండ నియోగించి, తానొక పెద్దసింహాసనంబుపైఁ గొలువుదీరియుండెను.





# వేంకటాద్రినాయఁడు

## త్రయోదశోల్లాసము.



నిరంతరము స్వర్గలోక నాగలోక కైలాసాది లోకంబులఁ గాంచు నాకే యీనూతన పురంబింత యద్భుత దాయకంబుగా నుండ నింక నీమర్త్య లోకంబున నుండు మానవుల కెట్టి యానందంబుఁ గూర్చునో యెఱుంగరాదు. ఈపుర వీధుల విశాలరామణీయకము లాయలకాపురంబున నైన లేవు. ఈసౌధోన్నతంబు లాయమరావతీ పుర సౌధంబుల మించియున్నవి. ఈ శిల్పకార నైపుణ్యమున కామయపురంబైన దీటుగాదు. ఈపాలగచ్చు కాంతి కావెన్నెలయైన లొచ్చె. ఈపురముప్రక్కఁ గృష్ణానది యన్నివిధంబుల నామందాకినికంటె హెచ్చుగా నున్నది. ఈపురవిశాలంబు నీక్షించ నిందువసించు జనులనిమిషులు కాకపోవుటయు నొకలోపమే. ఈ పురంబున కమరావతియను పేరుకూడ సరిపోయినది. ఇది యలకాపురంబునకుఁ దలకట్టు సురపురంబునకు శిరోరత్నము. వేయేల నిది యన్నిపురంబులకు మిన్న. ఓహో యీపురసోయగంబును వీక్షింపుచుఁ బ్రస్తుత కార్యమును మఱచితినే? నేను దేవలోకము నుండి యిచ్చటికి వచ్చుటకుఁ గారణమేమైయుండును. ఆ జ్ఞాపకము వచ్చినది.

ఆమ్మహారాజు చెంచులనరికించి, వికలచిత్తుండై తత్పాపహారణార్థ మిన్నగరంబునవసించి, శివాలయంబులు కట్టించు ప్రయత్నములోనుండి, పాపమా కలభాషిణిమాట మఱచిపోయెను. అక్కలభాషిణి యచ్చట సూర్యనారాయణగావు నగరంబునంబడి పడరాని యిడుములఁగుడుచుచు నిశ్చల భక్తినిమ్మహారాజునే ధ్యానించుచున్నదిగదా! సుశీలమున్న నెట్టిదో యెఱుంగని భోగపురుషులంబున జన్మించి, దృఢబుద్ధినిఁ బతివ్రతా మణులకెల్ల మిన్నయై చెన్నారుచుండిన నయ్యన్నులమిన్న కీకర్మశేషంచే జన్మకోకదా? ఏజన్మదైన ననుభవించి తీరవలయును. కనుక సావధానమనంబుతో నద్దాని నిప్పట్ల వీక్షింప నవసరము లేదు. నేనిప్పుడే యీ భూపాలవర్యుని దర్శించి, యామ్మానినీమణి వృత్తాంతమును జ్ఞప్తికిఁ దెచ్చి, తోడ్కొనిరమ్మని చెప్పెద. ఇప్పుడతండు శివాలయంబులఁ గట్టించుటకుం దగిన పుణ్యస్థలములఁ విచారింపఁగొలువుదీర్చి యున్నాఁడు. కావున పోయి సమీపించి నావచ్చిన పనితోఁబాటు పుణ్యస్థలంబులఁ గూడ నెఱింగించెద. అని పూర్వమొకసారి వెంకటాద్రినాయుని కడకు వచ్చికలభాషిణిని రాజమహేంద్రి నగరంబునుండి తోడ్కొనివచ్చి చేపట్టుమని బోధించిపోయిన సిద్ధుండు మరల నమ్మహీపాలుని కార్యాలోచన మందిరమున కేతెంచెను.

అతని నిదివరకొక పర్యాయము తత్సభారంగమున నున్నవారెల్లఱుఁ జూచినవారలే కావున నృపాలసహితంబుగా నొక్కసారిలేచి, వందనంబులొనర్చిన, వారినెల్లఱ నుచితరీతి దీవించి, నృపాలునిపనుపున సింహాసనంబు నధిష్ఠించి, సర్వజనులు కుశలమా? యని యడిగిన నందఱుఁగుశలమే యని

భూపాలుఁడు స్వాములవారి రాక యెఱింగియుని వినయపూర్వకముగా నడిగిన నారాజునకు సిద్ధుండిట్లనియె. నేను దేవలోకమునుండి భవద్దర్శనార్థమై యేగుదెంచితి. నీవు యీశ్వరప్రబోధితుండవై శివాలయ నిర్మాణోద్యమంబున నుండి, పాతూరి నగరంబులో నిన్నే శరణంబుగా నమ్మి పెక్కుయిడుములకు లోనై స్రుక్కియున్న మానవతీతిలకంబు మాట మఱచియుంటివి. ఆ పెనుదుష్టుండైన నాసూర్యనారాయణరావు పెట్టుబాధలు నీకేమని తెలుపవలయు. ఆనాఁడు లంకానగరంబున సీత రావణునిచే నెన్ని బాధలను భవించినదో యిప్పుడీపె నారాజుచే నన్ని బాధలనుభవించుచున్నది. అట్టిసుశీల నీకెట్లు మఱపువచ్చెనో తెలియరాకున్నదిగదా? అనిపలికిన నారాజునకుఁ జప్పున తత్సంగతి జ్ఞాపకము వచ్చి. స్వామీ? నేను వికల చిత్తుండనై యున్న కారణంబున మఱచినాఁడ. నన్నుద్ధరింపదమరే తెంచి యిప్పుడు జ్ఞాపకముం జేయువరకుఁ గూడ నామనంబందుఁ జొచ్చినదే కాదు. ఇఁకజాగు సేయక యారాజాధముని సంహరించి, యమ్మానినీ మణినిం దోడి తెచ్చెదఁగాని తమరు మాకిప్పుడే కోత్తర శతశివాలయంబులు గట్టించుటకుఁ దగిన పుణ్యస్థలములేవియో యెఱింగించి, మనస్సంతుష్టిఁ గూర్పుఁడని ప్రార్థింపఁగా నాసిద్ధుండు కొంచెమాలోచించి, సంగమస్థలములు, నదీతీరములు, పురాతన చరిత్రప్రసిద్ధ పుణ్యక్షేత్రంబులు, పరమపవిత్రంబులు గనుక నేతత్ప్రదేశంబులందు శివాలయంబుల నిర్మింపఁ జేసి, లింగముల ప్రతిష్ఠింపఁజేసి నట్లైన కడు సమంజసముగానుండును. కనుక నటులొనరింపుమని పలికిన సభవారందఱు సిద్ధనిర్దేశిత పావన ప్రదేశంబుల దేవాలయంబులు నిర్మించుటఁ గడు లెస్సయనిపలికిరి.

అంతట వేంకటాద్రినాయకుండు నామనంబునఁగల సందియంబులు దీర్చి నన్ను ధన్యునింగా నొనరించితిరి. మీరు మహాత్ములు. మీకు నేనే ప్రత్యుపకారంబు సేయనేర్తును. నాయందుఁ బరిపూర్ణ కటాక్షముంచి తమరీదినంబున నాతిథ్యము మధ్యాహ్నంబునంగొని, నన్నానందింపఁ జేయవలయునని, యుల్లాసంబు దీపింపంబల్కిన సిద్ధుండు సమ్మతింజూపెను.

తదుపరి రాజేంద్రుండు సభ్యులకు సెలవొసంగి, సిద్ధసహితుండై హర్మ్యంబుఁ బ్రవేశించి, సిద్ధునికుచిత రీతినతిథిపూజఁ గావించి, సత్కరించి, మధురతర ఫలహార భోజనానంతరమునఁ బడకకుర్చీ నధిష్ఠింపఁజేయ నా సమయంబున నామహీపాలునిం జూచియిట్లనియె. నేనస్మద్దివ్యదృష్టిచేఁ జూచితి. నీదేశంబున నింకను సాధుజంతుహింససంపూర్ణంబుగా జరుగుచున్నది. ఒక్కొక జాతర నెపంబునఁ జేయుచున్న ప్రాణిహింసఁ దలంచుకొనిన మాబోంట్ల గుండెలు నీరగుచున్నవి. నీవెట్టుల సహించియుంటివో తెలియరాకున్నది. తమ రాష్ట్రంబున జరుగు జీవహింసామహాఘము ముప్పాతిక మూడుపాళ్ళు రాజునకే చెందును. నేనిదివరకే యొకమాట నీకుఁ జెప్పియుంటినిగదా? నీప్రాణి యెట్టిదో తదితరప్రాణులుఁ గూడ నట్టివియే యని తలంచుమని. నిన్నొకండు మెడఁగోయ నోర్చియుండఁ గలవా? కొంచెము జ్ఞానసంపత్తిగల్గి పాపపుణ్యవిచారణా వివేకదక్షుండవైన నీరాష్ట్రమందే యిట్టియసంఖ్యాక సాధుజంతుహింస జరుగుచుండ, నిఁక జ్ఞానశూన్యులై మధుమాంసభక్షణంబుల మత్తెక్కి, యొడలెఱుంగక పాపభీతిలేక పరదారధనాదుల, కాసించు రాజాధముల రాష్ట్రం

బుల నింకెట్లుండవలయు. "హరిహర్" ఎంతఘోరము. ముందు
మఱొక్కసారి నిన్నుదర్శింప నవసరము గల్గుఁగాన నహింసా
ధర్మమును గూర్చి విపులముగా నప్పుడు చర్చించెదను. ప్రస్తు
తము నీవు దుర్గతుల పాలఁబడక యుండఁదలఁతువేని వార్తా
పత్రికల మూలమున నే జాతరకుఁగాని, యే మొక్కుబడికిఁ
గాని, కోళ్లు మేకలు దున్నలు గొఱ్ఱెలు మొదలైన జంతువుల
జంపఁ గూడదని నీరాష్ట్రజనుల కెల్లఱకుఁ దెలియఁజేసి, రా
జాజ్ఞ నుల్లంఘించిన వారలు శిరచ్ఛేదనంబు గావింపంబడు
దురని కఠినముగా నాజ్ఞాపింపుము. లేనిపోని వెన్ని దేవా
లయంబులఁ గట్టించి ప్రతిష్ఠఁ జేయించినను ఫలితంబిసుమంత
యైనను మీకుల నేరదు,

నేను మఱియొక దేశంబున కిప్పుడవసరంబుగా నేగ
వలయునని పలికి, రాజు నమస్కరింప యథోచితరీతి దీవించి,
సిద్ధుండచ్చోటు వీడ్కొనియెను. వేంకటాద్రినాయఁడు మహీ
పాలుఁడద్దినంబున మఱుప్రొద్దు సభయందు మంత్రి సామంత
విద్వజ్జనాదుల యనుమతంబునఁ దత్సంగతుల వార్తాపత్రిక
లందుఁ బ్రచురింపఁ జేసి ప్రకటించుటకు సెలవొసంగెను.
ఆరోజు మొదలుకొని సాధుజంతుహింసం జేసిన వారినెల్ల బంధించి
కొనిపోవుటకై రాజభటులు ప్రతిగ్రామంబున నివాసంబు
లేర్పఱచుకొని యుండిరి. మాంసఖండంబులతోఁ దప్ప ముద్ద
మ్రింగలేని వాండ్లెల్ల కఠినమైన రాజాజ్ఞకు వెఱచి, యొకటి
రెండు రోజులుపవాసంబుండి, క్రమముగా శాకభేదంబుల
దినుచుండ నారంభించిరి. ప్రపంచములో మాంసాహారము
కడుదుర్వ్యసనమైనదనియుఁ గడు బలవంతమైన దనియు, వివేకంబు

చాలనివారు సాధారణముగా భ్రమపడినను, వివేకంబు గల వారు కూడ, మాంసము కన్న రుచికరమైనవియు,బలమైనవియు నైనన యాహారపదార్థము లనేకములుండఁ దృప్తిగా భుజింప లేక, మాంసాహారమునే స్వీకరించుట పరంపరాగతమైన దురాచారమని తోఁచెడిని. నిజముగా హింసాకాలమున వానిఘోష కన్నులారఁ జూచిన సదయహృదయుండొక్కరుండు కూడ, దానునిరసించుటయే కాక శక్తికొలఁది మూఢజనులకు బోధించి మాన్పింపఁ జూచుచుండుననియే మానమ్మకము. వృక్షంబులను ఖండించినంగాని శాకంబుల భక్షించినంగాని పాపంబు లేదా? అవిమాత్రము ప్రాణములుగల వస్తువులుకావా? అని సాధారణముగా లోకములో మూఢజనులందఱుఁ బ్రశ్నించుచుందురు. తరు ఫల దళాదులకుఁ బ్రాణంబున్న మాట సత్యమేకాని, యంతమాత్రమునఁ బాపంబు రానేరదు. ఏలయనఁ బాపంబనునది స్మృత్యవస్థలోనుండి గిలగిల తన్నుకొనుచు రోదనధ్వని మూలకముగాఁ దమబాధను తెలియఁజేయునట్టి జంతుహింస వలననే కాని, నిస్స్పృహాలోనుండి తమబాధను గుర్తుఁగఁజాల నట్టి, వృక్షాదుల ఖండన విషయములో రానేరదు. మైకములోనున్న ప్రాణులకు బాధలేదని మనమెటుల నిర్ధారణఁజేయ వచ్చునందురేమో గ్రహించుడు. వైద్యశాలలందు మహావ్యాధిగ్రస్తులకు మైకముఁగల్పించి కాలుసేతులు మొదలైన యవయవముల డాక్టర్లు ఖండించుచుండుట మన మనుదినంబును చూచు విషయమేకదా? అట్టి స్థితిలోరోగికి బాధగలిఁగి నటులు తెలియవచ్చినదా? రాలేదు. ఆరోగికే మైకముఁదగ్గించి పుండుమీద చెయితగిలించి నంతమాత్రమున

గిలగిల తన్నుకొనుచు విని సహించరాకుండ నేడువ నారంభిం
చును. ఇందువలన మనకుమత్తులో నున్న ప్రాణులకు బాధలే
దని స్పష్టముగాఁ దెలియవచ్చును. కనుక వృక్షాదులకు వృద్ధి
క్షయములేకాని, సుఖదుఃఖముల బాధలేదు. కావున పాపంబు
లేదు. అటులైన మత్తెక్కించిన మనుష్యు నటులనే యుంచిన
వృద్ధిఁజెందునా? యని యందురేమో అదినైజముగా భగవం
తునిచే నీయఁబడిన మత్తుగాదు. కనుక వృద్ధిఁజెంద నేరఁడు.
నైజములో నీశ్వరునిచే స్థావరములుగా సృష్టింపఁబడిన వృక్షా
దులందే మైకస్థితిలోఁ బెంపుఁజెందునట్టి ధర్మమున్నదిగాని-చల
నంబు గల్గిన జంతుజాలంబున కట్టి ధర్మములేదు. మేకలు
గొఱ్ఱెలు కోళ్లు మొదలైన జంతువులు మనుష్యులకు మాంసా
హారంబు కొఱకుఁగాక నింకనేయుప యోగమునకు సృష్టింపఁ
బడినవి. అని యచ్చటచ్చట కొందఱుగ్గడించు చుందురు.
కాని యిమ్మాట వివేకంబు చాలనివారి యభిప్రాయంబని
ప్రాజ్ఞులు త్రోసివేయఁజనును. కోళ్లు సమస్తమైన జంతువుల
తోఁ బాటు గ్రుడ్లుబెట్టి పిల్లలఁజేసికొని స్వేచ్ఛగా విహరించు
టకు వానికధికారము లేక పోలేదు. వాటి జోక్యము మన
మంటించుకొన నటులైన నన్నిటితోఁబాటవి యును సుఖము
గా జీవించుచుండును. మేకలు గొఱ్ఱెలు మొదలైన వాటి
నసంఖ్యముగా వృద్ధిఁగానిచ్చిన యెడల సమస్తజనులకు జీవనో
పాధియైన భూమిని బలపర్చుటకుఁ దగినంత యెరువు మనకు
లభించును. అదియునుఁగాక వాటిపాలుఁద్రాగుటకును, స్వా
భావిక మరణానంతరమున, వాటిచర్మము పాదరక్షలు వస్త్రా
రాలకు నుపయోగించును. ఈ మొదలైన యుపయోగములకుఁ

గాను భగవంతుఁడు వాటిని సృష్టించియున్నాఁడు. మనుష్యులకు మాంసాహారము స్వాభావికమైనదికాదు. స్వాభావికమైనదే యైనయెడల నదిచిక్కకుండిన మనుష్యులు మరణింపవలయు. ప్రత్యేకము మాంసమే యాహారముగాఁ సృష్టింపఁబడిన సింహ శార్దూలాది జంతువులకది చిక్కకుండిన మరణించుట సత్యము. కావున నే యేజంతువులకే యేయాహారములు నైజముగా సృజింపఁబడినవో వాటినే భుజించుట భగవంతునకు సమ్మతమైన కార్యము.

వేంకటాద్రినాయఁడు గారొజు సాయంత్రము కొలువుఁజాలించి, భోజనానంతరమంతఃపురంబులోని హంసతూలికాతల్పంబున శయనించి, సుగుణమణి యగు భార్యంగూడి, సరససల్లాపంబులఁ గాలంబుఁబుచ్చుచుండ, కలభాషిణి జ్ఞప్తికి రాకుండుటయు దంతంబును వట్టుమహిషి కెఱింగించి, సిద్ధుని పనుపున దానిని దోడ్కొని వచ్చి చేపట్టనున్నాడ ననిన నాపె సంతసించి, యావశ్యముగాఁగొనివచ్చి చేపట్టుట యుక్తమని వినయ పూర్వకముగాఁబలికి, సిద్ధసందర్శంబున ధన్యులరైతిరని పతిమహిమంబును నుతించి, పతికుల్లాసంబుఁ గల్పించెను. పతివ్రతలకు సర్వదా పతులనపుల సంతోషాబ్ధి ముంచి తేల్చుట యేకదా? కావలసినది. పతివ్రతామణియైన సతిదొరుకుట-పురుషునికి సర్వసౌభాగ్యంబులుఁగలుఁగుట. ప్రభుండంతట సతిమాటకు సంతసించిన వెనుక నిరువురు సుఖసుప్తినొందిరి. రాజు మరునాడు వేకువజామునలేచి, తాత్కాలిక కార్యకలాపంబులు నిర్వర్తించుకొని, బుద్ధిశాలియగు ప్రధాన మంత్రి నిరావించి, యుచితపీఠంబుల నధిష్ఠించి, కలభాషిణీ విషయమును ముచ్చటించుకొనుచుండిరి.



# వేంకటాద్రినాయఁడు

## చతుర్దశోల్లాసము.



రాజమంత్రులు మంతనంబునఁగొంత యాలోచనసల్పి, నాగన్న వీరపనీడు మల్లికార్జునుఁడు భాస్కరరావు అనునల్గుర యోధవీరుల రావించి, వారలకేవేవో కొన్నిరహస్యంబు లెఱింగించి, ప్రయాణము జేసి, యాయావేషముల కనుకూలించు పరికరంబు లొసంగి, సెలవొసంగిరి. వారచ్చటనుండి బయలువెడలి, గూఢవర్తనంబునఁ జాతూరి నగర సమీప భూమికి వెళ్లి, యుచితవేషంబుల ధరించి, వేగులుగన నాపట్టణంబునఁ దిరుగుచుండిరి.

ఇఁక నిచ్చటఁ గలభాషిణి యుండు మందిరంబునకు నీలవేణి కోకిలవాణి యను చెలులిర్వురు చనుదెంచి, శిశిరోపచారంబుల నమ్మానినికి స్మృతిఁగలిఁగించి, నృపాలునిపై ననురాగంబు గలుఁగఁగలందులకై శృంగారపురుషుల చిత్రపటంబులామందిరంబునఁ గట్టించి, కాముకుల చిత్రవిచిత్రకథలొయ్యారంబుగా నగ్గడించుచు, యుద్యానవన విహారంబులు చేయుం

చుచు, పండువెన్నెల బయలఁ బరుండఁబెట్టుచు, సుగంధ పుష్ప దామంబులు బలవంతముగా మెడయందుచుచు, మృదుమధుర స్వరంబులతో గానంబొనరించుచు, నత్తరు పన్నీరు వాసనలచే ఘుమఘుమాయించు పట్టుచీరెలు మొలకుఁ జుట్టుచు, నానావిధ భక్ష్య భోజ్యాదుల రుచులఁజూపించుచుఁ, దమ యావచ్ఛక్తుల ధారవోయుచు, నీమొదలైన ప్రయత్నంబు లొనర్చుచుండిరి. కాని యవియెల్ల నమ్మానినీరత్నంబునకుఁ బద్మపత్రస్థ జలబిందువులై ప్రకాశించుచుండెను.

ఇట్లు కొన్నిరోజుల వరకు బహుప్రయత్నంబు లొనర్చి చూచి, నిష్ఫలంబగుటకు విసిగి చెలులిర్వురు సూర్యనారాయణ రావును దర్శించి, మహారాజా? నమస్కారములు-నల్లబండకైన ననురాగంబుఁ గల్గింపఁగల్గుదుముకాని యీకలభాషిణీ మనంబును మాత్రము మీపై మరల్పఁజాలము. నిక్కముగా దాని మనంబు విధాత దేనితోఁజేసెనో గాని యెఱుంగరాదు. మే మంతిపురమున కేగుచున్నామని వారల నిష్క్రమించిరి.

సూర్యనారాయణరావున కదివరకుఁ దనువెల్లవ్యాపించి యుండిన మోహరసంబు క్రోధరసంబుగా మారి-దుర్నిరీక్ష్య తేజోధురంధరుండై-కారాగృహాధికారినిఁ బిలువనంపి, రాజ శాసనాతిక్రమణ ధురీణయై యామందిరంబునఁ బడియున్న కలభాషిణి యనుచండాలిని శృంఖలబంధనంబుల నలంకరించి, కారాగృహంబునఁ బడవైచి, కఠినముగా శిక్షింపుము. నే వలదని లేఖవ్రాయుటే దీనికిగడువు. అనిపెద్ద యెలుంగున నిప్పులుగ్రక్కుచు నొక్కివక్కాణించె. అంతట కారాగృహాధికారి చిత్తమని యుచ్చోటువాసి దేహకాంతులంధతమిస్రంబుఁ

దలపించుచుండ భయంకరంబుగాఁ గలభాషిణి రోగులు భగవంతునిఁబోలె వేంకటాద్రినాయుని మనంబున నిల్పి ధ్యానంబొనర్చుచుఁగాలంబు గడపుచుండిన మందిరంబుఁ బ్రవేశించెను. సహజభీరువగు నక్కలభాషిణి లయకాల యమునిఁ బోలు నప్పురుషు నీక్షించినంతన ప్రాణంబులకు వెలియై యుండవలసినదిగాని యట్లు జరుగలేదు. అట్లు జరుగకుండుటెందుచేతనో మనము సులభముగా నూహింపవచ్చును. ఆపురుషుండు యమధర్మరాజు. పాపాత్మురాలనగు నన్నుఁదన లోకంబునకుఁ గొనిపోవనేగుదెంచినాడు. బహుమేలు జేసినాడు. అనియెంచి తుచ్ఛప్రాణములమీద యాసవదలినదై నిర్భయముగా నిశ్చింతగా సంభ్రమ మానసాబ్జయై వికాసోత్సాహములతోఁ జూచుచుండెను.

ఆకారాగృహాధికారి యాయబలధైర్యంబు నకచ్చెరు వంది, సుమకోమల గాత్రయగు నాసుందరి కరపల్లవంబుల నినుపసంకెలలచే నవయఁజేయవచ్చి నందులకెంతయుఁజింతించి, తుదకు రాజాజ్ఞ నెఱవేర్చెను. అప్పటికైన నాయబల భీతిల్లినది కాదు. పాశములచే బంధించినాడని సంతోషించె. ఎట్టి సాధ్వీమణికెట్టి యాపదవాటిల్లెనో చూచితిరా? జగద్వంద్యువగు సూర్యునికిఁగాక మింటిచుక్కలకెల్ల మందేహరాక్షస బాధకలదా? అంతనతండా భామినీమణిని నడువుమనుచు మని యదల్చి బెదరించి నడిపించుచు రాజమార్గంబునఁ గారాగృహంబునకుఁ గొనిపోవుచుండెను. అట్టిదుస్థితిలో నాపెనుజూచి, యిట్టియినుపసంకెల లారాజాధముని కెన్నఁడుతగులునో యనువారును, ఈమాదిరి యముఁడా దుర్మార్గుని నెన్నఁడు

గొంపోవునో యనువారును, రాజాజ్ఞవినకతిరస్కరించినందుకుఁ దగిన శాస్తి ననుభవించుచున్నాఁడను వారును, దీనికిట్టి దౌర్భాగ్యదశ పట్టియుండగా రాజునేల వరించు ననువారును నై, యాపురవాస్తవ్యులు ఖేదమోదము లొందుచుండిరి.

అప్పుడాపె మనంబీశ్వరాధీనంబై యుండుటచే బాహ్యంబున కనుకూలించు దూషణభూషణముల మాత్రనిని చిత్తమున కెక్కనివికావు. కొంత దూరంబు నడిపించుకొనిపోయి యమభట సదృశులైన భటులచే రక్షింపఁబడుచు, రౌరవాది నరకంబులన్నియు నందుఁగలదియై, యమపురంబున కుద్దియై, విలసిల్లు-భయంకర కారాగృహంబులోఁ బ్రవేశపెట్టి తలుపులు మూసి తాళము వేసెను. అంతట నాపె యదిచెరసాలయని గ్రహించి, శృంగారమందిరంబున నివసించి, యనిష్టకథాకర్ణనంబొనరించుట కన్న యిందువసించి నిశ్చలబుద్ధితో నీజన్మకిదే శివరాత్రియని భగవన్నామ స్మరణంబు గావించుకొనుటుత్తమంబని యెంచి, భగవదంశా సంభూతుండైన వేంకటాద్రినాయఁ మహీపాలుని దివ్యతేజంబు మనంబుననిల్పి, ధ్యానించుచుఁ గాలంబు గడపుచుండెను. ఆచెఱసాల యందలి గబ్బిలంబుల పెంటకంపును, వ్యాళ వృశ్చికాది విషజంతువులును, గాఢాంధ తమిస్రంబును, నిశ్చలజ్ఞాన సంపన్నురాలైన యాకాంతారత్నంబున కేహ్యంబును వెఱపును కల్పించినవి కావు. జ్ఞానాగ్ని హోత్రంబును తుచ్ఛల మాయోపాయములనెడి చీకటి సమీపింప నేర్చునా? కారాగృహాధికారి యనుమతి వెంట పూటపూటకు భటులింత తైదయంబలి మాత్రము నాపె యొద్దనొక చిప్పనుంచి యాచిప్పలోఁ బోసి

పోవుచుండిరి. ఆమె యాచిప్ప నందుంచి యంబలిపోయుటయే యెఱుంగదయ్యె. కాని యాయంబలివలన నాచెఱసాల వసించుచున్న కీటక సమూహము మాత్రము సుఖముగా జీవించుచుండెను. ఆమె పవనాశనం బొక్కటి మాత్రము స్వీకరించి జీవాత్మను తృప్తి నొందించుచున్న దని తోఁచెడిని. అట్లుగా నున్న బొందిలోఁ బ్రాణంబు చిక్కబట్టి యుంచుట దుస్తరంబు గదా?





# వేంకటాద్రినాయఁడు

## పంచదశోల్లాసము.



ఆపాతూరిపట్టణంబున నీకలభాషిణిని చెఱనుంచుటకుఁ బూర్వము మూడు నాలుగు రోజులనుండి యిర్వురు ఘన వైద్యులును, ఇద్దఱపూర్వపు బిచ్చగాండ్లును. సంచరించు చుండిరి. వారలు పగలు గ్రామంబున నెల్లఱకుఁ గాన్పింతురు. కాని, రాత్రిమాత్రము వారెందు శయనించునది మనుష్య మాత్రునకుఁ దెలియరాదాయెను. ఆగ్రామమున కుత్తరపు వైపున మైలుదూరములో భేతాళ శ్మశానమనునదికలదు. ఆయూరిలో మరణించిన జనులనెల్లఁజేసి పగలుగొనిపోయి యాచ్చట దహించుచుందురు. కాని ప్రొద్దుక్రుంకిన వెనుక నయ్యూరి వెలుపలికి వెళ్లి, యొక్కఁడైన నుత్తరముఖులుగా నిలువఁబడ వెఱచును. కారణమేమందురా? రాత్రియందాశ్మశానమున భేతాళుండు భూతప్రేత పిశాచ గణయుక్తుండై, యేతెంచి తాండవంబాడుచుండునఁట. వారల ఘోరరూపంబులు దృగ్గోచరంబైనంత మనుష్యుండు మృతించుటగాని, మృతించునంతటి భయవ్యాధిచేఁ గృశించుటఁగాని తటస్థించునఁట. అందువలన

నాగ్రామవాస్తవ్యులందఱు రాత్రియందు త్తరమునైనఁ జూడరు. ఆశ్మశానమే పైనఁజెప్పఁబడిన వైద్యులకు బిచ్చగాండ్రకు శయనస్థలమై యుండెను. ఈబిచ్చగాండ్రు వైద్యులు మాత్ర మట్టి స్థలమందెట్లు శయనింప నేర్తురందురేమో? మనంబు భయపిశాచంబుచే గ్రసియింపఁ బడని వారికచ్చట భేతాళుండు లేడు. భూతంబులు లేవు. భయాక్రాంత మనస్కుండు త్రాడుఁజూచి పాముని యులికిపడునట్లు లాగ్రామవాస్తవ్యులందఱొక రోజున సూర్యాస్తమయంబై, కొంచెము చీకఁటి జగంబు నాక్రమించిన వేళ, నొకపీనుఁగను మోసికొనిపోయి యచ్చటచితిపైఁ జేర్చి, దానికి నిప్పంటించిన ప్రజ్వలించి మండుచుండెను. ఆమండుచుండు వేళ నీజనంబు కొంచెము దూరములో నిలువంబడి శ్మశానమువైపుఁజూచిరి. ఆవెలుతురులో వారికి శ్మశానమునకుఁ గడుదగ్గిరలో నిలువఁబడియున్న యాటవిక్రులైన దొంగల వికారస్వరూపములు హఠాత్తుగా వారల కంటఁ బడియెను. వారలంతటఁ గడుంగడు భయమంది పరువిడుచువచ్చి. మాకిట్టివేషము లచ్చటఁ గనుపడెనని గ్రామస్థులందఱికిఁ దెలియఁజేసిరి. అంతట గ్రామస్థులు కొందఱుగుంపుగూడి యిట్టిసమయంబున నట్టిచోట నావికార స్వరూపములేలఁగనుపడును, నిజముగా నవి భేతాళుఁడును, తదనుచరులైన భూతపిశాచాదులే కాని యన్యంబు గాదని నిశ్చయించుకొని, దానికి భేతాళశ్మశానమను పేరిడి, రాత్రివేళ నారోజు మొదలుకొని యటుమొగమైనఁ జూపరు. ఇది యాశ్మశాన వృత్తాంతము. ఆవైద్యులు బిచ్చగాండ్రు క్రొత్తవారవుటవల్లను, వారునల్వురు రాత్రియందుఁ గొన్నిరహస్యంబులు

ముచ్చటించుకొనవలసిన వాండ్లవుటవల్లను భేతాళశ్మశానంబు వారికెంతయు ననుకూలముగా నుండెను. వారు నల్వురు కలభాషిణిని చెఱసాలయందుంచిన నాటిరాత్రి యాశ్మశానంబుం జేరి యిట్లాలోచించుకొనిరి.

వైద్యులు— మేమిన్నిరోజులనుండి వైద్యము జేయు మిషతో నీనగరంబంతయు గాలించుచుంటిమి కాని కలభాషిణి యెందున్నదో మాకంటికగుపడలేదు. రాజమందిరములోనికిం బోవుటకు మాత్రము రాజదర్శనంబు కామి నింతవరకు వీలైనది కాదు.

బిచ్చ— మేమీరోజున నొకగ్రుడ్డివార్త నెఱింగితిమి. అదేమనిన, మేమచ్చట రాజమార్గ ప్రాంతగృహంబుల భిక్షాటనంబు జేయుచుండ నల్ల దున్నపోతువంటి వాఁడొక సుందరాంగిని సంకెలలచే బంధించి, గద్దించుచు రాజమార్గంబునం గొని పోవుచుండెను. మేమంతట నాయాగృహిణులతోఁ దల్లులారా! ఆపురుషుండెవరు. ఆపెనేటికట్లు బాధించుచుం గొని పోవుచున్నాడో కదా? యంటిమి. అప్పుడొకయాపె యదిబోగపు ముండఁట. రాజుగారిని వరింపక ధిక్కరించినదఁట అందువలన దానిం గారాగృహంబున నుంచుమని రాజుగారాజ్ఞ నిచ్చినారఁట. యీతొత్తుకేమి మాయరోగమో కాని రాజుగారి పేరే తలవనీయదఁట. దీనిగతి కేవరేమి చేయుదురనియె. మేమంతట దానివైపునిదానించి చూడ మనరాజుగారుచెప్పిన కొన్నిగుఱుతులాపెయందుఁ గాన్పించినవి. అదినిజముగా కలభాషిణియే.

బిచ్చ—మనరాజుగారి యాజ్ఞప్రకారము రాయభారంబు నెఱవేర్పవలయును గదా!

వైద్యు—నిజమే రేపుదయమున మీలోనొకండు రాయభారంబు పనిమీఁద వెళ్లి, మఱియొకండీ వేషముతోనే యీరాజమందిర ప్రాంతమున భిక్షాటనంబు జేయుచుండుఁడు. మేమును మఱికొన్ని విశేషంబుల నారయుచుందుము.

బిచ్చ—మంచిది. అటులనే యొనరింతుము.

అని యారాత్రి కాలముచ్చటగడిపి, మఱునాడు దయమునలేచి తమతమ పనులమీఁద వెళ్ళిరి. ఒకబిచ్చగాడు యోధరూపంబుఁ దాల్చి, రాయభార కార్యనిర్వాహణంబునకై రాజసభాస్థానంబునకరిగెను. అచ్చట రాజులేడుకాని మంత్రి యోధ భట వర్గంబు నిండియుండెను. మంత్రిపుంగవుఁడానూతన పురుషునింగాంచి నీవెవ్వరు? ఇచ్చట కేలవచ్చితివని గద్దించి యడిగిన నాతండు గంభీరస్వరంబుతో నేను వేంకటాద్రి నాయమహీపాల సింహుని దూతను. రాయభారార్థమై యీరాజదర్శనంబునకు వచ్చితిని. అనిపలికిన మంత్రి యావర్తమానమొక సేవకునిమూలముగా రాజుగారి కెఱిగించెను.

రాజామాటవిని వడివడి సభారంగమున కేతెంచి, యేడీ! వేంకటాద్రినాయనిదూతయనియె. అంతలో నితండు నేనేనని లేచి, వందనంబాచరించి, నిర్భయంబుగా నిట్లువన్యసింపందొడఁగెను.

రాజమహేంద్రనగర నివాసినియైన కలభాషిణియను

భోగకాంతను మాదూత వెంటఁబెట్టుకొని చింతపల్లికి వచ్చుచుండగా, నారణ్యమార్గ మధ్యంబునఁ జెంచులడ్డమై దానిని బట్టుకొని, నీయనుమతి వెంట నీపట్టణంబున నుంచిరని విని యున్నాడ. మాదూత వెంట మానగరంబునకు వచ్చుచున్న దానిని మ్రుచ్చిలింపించి నీయింట నుంచుకొనుట శ్రేయస్కరముగాదు. మాపూర్వులు మీపూర్వులు కొంతకాలము వరకన్యోన్యాభావమైత్రిఁ జెన్నారియున్నను, నేనును నీవును మాత్ర మిప్పటికి సహోదరులమాడ్కి నున్నారము. ఇదియునుంగాక, యన్యుని వరియించిన కాంతను బలవంతముగాఁ గొనిపోవుట వివేకలక్షణముగాదు. అట్లుకొనిపోయిన ధర్మహానియుఁ, గులహానియుఁ, బ్రాణహానియుఁ, దటస్థమగును. మృగరాజ భోగ్యవస్తువు మృగశాబకంబునకు భోగ్యయోగ్యం బగునా? శ్రమచేటును ఫలంబు లోటునుగాక-పరకాంతల బల్మిమైఁ జెఱబట్టి నరావణాదులు బంధు పుత్ర మిత్రా మాత్య సమేతంబుగా, మృత్యువదన గహ్వరంబునఁ బ్రవేశించరే? దానిని బల్మిని వశపర్చుకొనవలెనను దౌష్ట్యంబును మాని దూరదృష్టిఁగలవాఁడవై కలభాషిణి నీ మామల్లికార్జునిని వెంటవిడచి పుచ్చువది. అని మా ప్రభువైన వేంకటాద్రి నాయఁడు నీతోఁగట్టిగాఁ జెప్పుమనియెను.

సూర్య—ఏమేమీ! తాను మృగరాజును నేను మృగశాబకంబునా! కలభాషిణిని నాయొద్ద నుంచుకొనిన ధర్మహానియుఁ గులహానియుఁ బ్రాణహానియుఁ, దటస్థించునా? శ్రమ చేటుగాని ఫలంబు లోటా? కానిమ్ము చూచెద

సహజ పౌరుషాభిమాన వివేకంబులుగల వెలమలవంశంబున జనించి, యనాథనై యొక రాజాధమునకు జంకి, చేఱబట్టిన భోగకాంతను విడిచిపుచ్చుదునా ? మృగశాబకంబు మృగరాజు నెదిరించి జయంబుగొను కాలంబు సమీపించినదని మీ రాజుతోఁ జెప్పుము.

మల్లి—మృగశాబకంబు మృగరాజు నెదిర్చి జయంబుఁ గొను కాలం బెప్పటికిని రానేరదు. ధర్మము జయించునుగాని యధర్మంబెప్పటికైన జయించుట స్వప్నవృత్తాంతము. కండకావరమునఁ గొండతోఁ దగరు డీకొని పోరాడఁదలచినట్లు నీవు మారాజుతోఁ బోరాటంబు గల్పించుకొనుట. నీవుఁ బరమాప్తులైన చెంచులఁ దనకోటలోనికి రప్పించి, క్షణమాత్రములో నాదుర్మార్గుల జీవంబులఁ గొల్లుచ్చిన రాజకంఠీరవంబు నెదుర్కొని, మానప్రాణంబులు గోల్పోక నామాటవినియోగ్యుండవై వర్తింపుము.

సూర్య—ఓరీ ప్రేలరీ ! యుచ్ఛిష్టాన్నంబులఁ గఱవుదీర మెక్కి, కన్ను మిన్నుఁ గానక చిన్న పెద్ద తారతమ్యంబు లెఱుఁగక-శునకంబు మాదిరి మొఱుగుచున్న నిన్ను సూర్యనారాయణ భుజంగము కఱచివేయక విడుచునది కాదు. జాగ్రత.

మల్లి—శునకంబును భుజంగము మ్రింగునా? సెబాస్, నిను భుజంగంబుతోఁ బోల్చుకొనినందున కెంతయు సంతసించినాడ. నీవు నిజముగా భుజంగమవే-అట్లుగాకున్న తుచ్ఛవిష కీలక తుల్యులగు చెంచులతోఁగూడి, దౌష్ట్యాలోచనలను విషప్రయోగంబులఁ జేయుదువా? బహుచక్కఁగాఁ బోల్చుకున్నావు

అని రాజును ధిక్కరించి మాట్లాడుచుండిన రాయబారికంఠముదేహమును బాయునని యే యచ్చటివారందఱుఁ దలంచుచుండిరి.

అంతలో నారాజు విపులాగ్రహ పీడితుండై తళతళ యని కన్నులు మిఱుమిట్లు గొలుపు శాతఖడ్గంబు చేఁబూని, మదపుటేనుఁగుపైకి లంఘించు సింగబులీల, మల్లిఖార్జునిని పైకి దూకెను. మంత్రివర్యుండు తటాలున వచ్చి, రాజును గట్టిగాఁగౌగిలించుకొని స్వామీ! ఆగుమాగుము. దూతవల్ల దంబులు వల్కినను మహారాజులు సంహరింపఁ బూనుట యుక్తంబుగాదు. తగిన ప్రత్యుత్తరంబిచ్చి పంపవలయును. మితిమీరి క్రిందుమీదెఱుంగక మాట్లాడినాడు కావునఁ గొంచెమవమాన పర్చఁదగు. కావున మీరితని తలగొరిగించి, యవమాన పర్చిపంపుడు. వధోద్యోగంబుఁ బూనుట రాజధర్మంబు గాదనిపలువిధంబులఁ బ్రార్థించినఁ గొంచెము శాంతించి, మంత్రితో వపనంబొనరించి పంపిన యిట్టి హీనుల మనంబున కెట్టియవమానంబును గలుఁగదు. ఇట్టి క్రొంచెమునకు వెఱచువాఁడైన-వినిసహించరానికారులు ప్రేలునా వీనికి బుద్ధివచ్చువరకు మనకారాగృహంబు ననుంచుటుత్తమము. కారాగృహాధికారినిఁ బిలువనంపుమని కట్టల్కతో బిట్టులుంగున నార్వ బంటొకండు సత్వరంబుననేఁగి కారాగృహాధికారినిఁ దోడ్కొని వచ్చెను.

అతండు రాజునకు నమస్కరించి, మహారాజా! యేమి సెలవన. రాజాతనింజూచి, నీచెనటి రాజదూతను తోడ్కొని

పోయి, మంచిబుద్ధివచ్చినది. రాజధికారంబొనర్పననికయ్యె డువరకుఁ గారాగృహంబుననుంచి, పిదప నాయొద్దకుఁదీసికొని రమ్ము. పొమ్మని యాజ్ఞాపించిన నాకారాగృహాధికారి మల్లిఖార్జునిని సంకెలలచే బంధించి కొనిపోయి కారాగృహంబునఁ జేర్చెను.





# వేంకటాద్రినాయఁడు

## షోడశోల్లాసము.



మరునాటిరాత్రి భేతాళశ్మశానంబున నిర్వురు వైద్యులు నొకబిచ్చగాఁడు మాత్రము ప్రవేశించిరి. వైద్యులా బిచ్చగానిం గాంచి నీతోఁడి బిచ్చగాఁ డేమాయెను. నీవొక్కఁడవే వచ్చితివనుఁడు. నతండు నాతోఁడి బిచ్చగాని కీ రోజునఁ గారాగృహవాసంబు లభించె. నందువలన నాతం డీ ప్రదేశమునకు రావలను పడదయ్యెనని వచించెను. వైద్యులు బిచ్చగానితో నేమి కారణంబున నాతనికిఁ గారాగృహవాసంబు దటస్థమయ్యె. నెఱింగింపుమనిన నాతం డిట్లులనియె, ఆతండు రాయభారమునకుఁగాను సూర్యనారాయణరావు సభకు వెళ్లి, యాతనిని ధిక్కరించి మాట్లాడినాడు. అందువలన నా రాజీతనిఁ గారాగృహమం దుంచమని యాజ్ఞ నిచ్చెను. అతని యాజ్ఞప్ర

కారము కారాగృహాధికారితనిని కారాగృహమున బంధిం
చెను.

మనమిఁక జేయవలసిన కార్యక్రమం బెద్దియో యో
జింపవలయు ననిన, నాబిచ్చగానితో నీవిఁక రే పుదయమున
నిచ్చటనుండి బయలువెడలి చింతపల్లికి వెళ్ళి, మన రాజచం
ద్రిసితో సర్వసన్నాహ సమేతముగా ఫాల్గుణ బ ౨ ల
నాటికి బొల్లిగుట్టవద్దకు వేంచేసి విడిసియుండవలసినదని చెప్పి,
నీవు వెంటనే తిరిగి వచ్చి యీ వేషముతోనే మమ్ముల నిచ్చ
టఁగలియుము. అప్పటికి నీవు చేయఁదగిన పని యొకటున్నది.
దాని నెఱిఁగింతుమని పల్కి యారాత్రి నందుండి మరునా
డుదయమున నావైద్యు లిర్వురు నా పాతూరి నగరంబులోఁ
బ్రవేశించి తిరుగుచుండిరి.

రాజా రాత్రియంతయుఁ దన ప్రాణతుల్యులైన చెం
చులు ముందు రానున్న యుద్ధంబున సహాయ పడుట కీ లో
కంబున లేనందున కొంతయుఁ జింతించుచు, జాగరణంబుసల్పి
యుదయమున నేను గంటలకు మంత్రి సామంతాదులతోఁ
గార్యాలోచన మందిరంబు నలంకరించి యుండు సమయంబున
నీక్రొత్తవైద్యు లా రాజు కంటఁబడిరి. అప్పుడా రాజా మం
దులవాండ్ల నిటకుఁ బిల్వుఁడన నొక బంటు పిలిచినవెంటనే,
వారు నృపసన్నిధానమున కరుగుదెంచి నమస్కరించిరి. నమ

స్కరించిన వైద్యులఁ గూర్చుండ నియోగించి, మీ కే యే
రోగంబుల బాగుచేయఁ గల్గుదురు. మీయొద్ద నెట్టి మహిమ
గల మందు లున్నవి. మీ కెట్టి మంత్రతంత్రంబులు దెలియును.
ఎఱిఁగింపుఁడనిన రాజుతో వైద్యు లిట్లనిరి. మేము భూతవై
ద్యరాజవైద్యంబులు సంపూర్ణంబుగా నెఱుంగుదుము. మాయొద్ద
మిక్కిలి ప్రశస్తమైనయనర్ఘ్యౌషధంబులున్నవి. మంత్రతంత్రము
లు మాయింటఁ బుట్టినవి. మేము వంజాబీలము. మాకు ధనధాన్యా
దులు సమృద్ధిగాఁ గలవు మేము సంసార బంధంబు విడనాడి
బ్రహ్మచర్యాశ్రమంబు స్వీకరించి పరోపకారార్థమై యుచిత
ముగా మందులొసంగి చికిత్సలు సేయుచు దేశాటనంబుఁ
జేయుచుందుము. ఈనగరంబునఁ గూడ రెండుమూడు దుర్ఘట
వ్యాధులు సైతముఁ గుదిర్చియున్నాము. మీ రేల పిలిపించి
తిరో సెలవీయుఁడు, మాకొకచోట నుండుటకు దీరుబడియుం
డదు. ఇచ్చటి కాగ్నేయమూలగా నవతి దూరములో నున్న
పల్లె కేఁగవలయు ననుడు. రాజో ఘనవైద్యులారా! మీరీదినం
బున మాగృహంబున నివసించి మా కొఱకొక విషయములో
మీరు మీశక్తినంతయు ధారవోసి ప్రయాసపడవలసియున్నది.
అది రహస్య కార్యము. ఇందెఱిఁగించుటకు వలనుపడదు. కనుక
మీరు నాయందు పరిపూర్ణ కటాక్షముంచి, కాలయాపనము
నకుఁ గొంచె మోర్వవలయు నని ప్రార్థించుచున్నాఁడ. ననుగ

హింపుఁడన నావైద్యులు రాజోత్తమా! అట్లైన మేమిప్పు డాపల్లెకు వెళ్లి, యచ్చట పని నెగ్గించుకొని సత్వరంబున మీరుకొల్వుఁ జాలించువరకు హాజరయ్యెద మని యనుజ్ఞఁబడసి యచ్చటికి సమీపమందున్న పల్లె కరిగిరి.

రాజా రోజున నాలోచనా భాగమును త్వరలోము గించి, కొలువుఁ జాలించి వైద్యులకొఱకు నిరీక్షించుచుండెను. వైద్యు లంతలో నా పల్లియకరిగి వెంటనే తిరిగి, పాతూరి నగరంబునకు వచ్చి రాజగృహంబునకు వేంచేసిరి. రాజు వారలఁజూచి, యమితోత్సాహమున నెదురుగావచ్చి, తోడ్కొని పోయి సముచితాసనంబులపైఁ గూర్చుండబెట్టి వలవని స్త్రీని వశపర్చునట్టి మందులుగాని మంత్రములుగాని, కలవా? యని ప్రశ్నించెను. వైద్యులు కొంచె మాలోచించి వెంటనే గాదు కాని-కొన్నిరోజులలో వశపర్చునట్టి శక్తి మాయొద్దఁగలదనిరి. రాజు కొన్నిరోజులనఁగా నెన్నిరోజులనియె. వైద్యులు పది పదియేను రోజులని ప్రత్యుత్తరముఁ జెప్పిరి. రాజు నిజముగా మీకట్టి శక్తిగలదా? లేక బూటకఁబు నటియించుచున్నారా; శక్తినివిచారించిభారఁబుపైఁ బెట్టుకొనుఁడు. ఇది సామాన్యపు చోటు గాదుసుమా? యన వైద్యులు మేమాడిన మాట నెఱవేర్చుకొన మేని మాకంఠంబు లుత్తరించి మీ గ్రామదేవతలకు బలిపెట్టుఁడని నిస్సందేహముగా- నిర్విచారముగా

నిర్భయముగా వక్కాణించిరి.

నృపుఁడంతట నిజముగా నీవైద్యులట్టి శక్తిఁగలవారే కాకున్న నిట్టి ఘోరప్రతిజ్ఞ నొనరింపుదురా? చూడవలయు వీరల మంత్రౌషధంబుల బలిమినని యెంచి, నిరాశాహతమనో క్షేత్రంబున నాశాబీజం బొందు నాట, వారలతో నోభిషగ్వరు లారా! మా కారాగృహంబునఁ గల భాషిణి యను భోగ కాంత వసించియున్నది. దానికడకు మీరేఁగి మీగడవుదిన ములతో నాపె మనంబును కరగించి మోహారసంబందు మిశ్ర మింపఁజేసి, నాపైఁ బ్రేమజనించునట్లు లొనరింపుఁడు. తడవుఁ జేయక కార్యక్రమంబునకు దిగుఁడని హెచ్చరించిన నావైద్యు లారాజుతో నిట్లనిరి. మహాప్రభూ! మేము కారాగృహంబు లోనికెప్పటికప్పుడు పోవుటకుఁ గారాగృహ యజమాని సమ్మ తించునా! దానిని వేరేయొక మందిరంబునఁ జేర్పుడు. మేము పోవుటకు వచ్చుటకు ననుకూలంబుగా నుండుననిన. రాజు అట్లుగాదు. దానిని కారాగృహమునుంచి తీసి వెలుపలనుం చుటకు వీలుగాదు. నేను కారాగృహాధికారి కొక యాజ్ఞాప త్రంబు వ్రాసి మీచేతి కిచ్చెద. నాపత్రికఁ గొనిపోయి మీ కితని కనవసరమైనపుడెల్లఁ జూపించి, ద్వారంబుఁదీయించి లోనికరుగుచుండుఁడు. ఇదే వ్రాయుచున్నాఁడ. మద్విశ్వాస పాత్రుఁడైన కారాగృహాధికారికి-రాజు సూర్యనారాయణ

రావు వ్రాయున దేమనగా- నే నిద్దరి ఘనవైద్యుల నీ కడకం పుచున్నాను. వీరు కలభాషిణిని తమ మంత్రౌషధంబులచే వశ పర్చుదుమని ప్రగల్భములు కొట్టి నాచే ననుజ్ఞాతులై యచ్చటికి వచ్చుచున్నారు గాన వీరి నా ముహరుఁగల పత్రంబు నఁజూపించి కలభాషిణిని చూడవలయు నని నవుడల్ల దర్వాజఁదీసి లోనికిఁబంపి వారుతిరిగి బయటికివచ్చు పర్యంతము వాకిలి నతిజాగరూకుండవై కాచి కవాటంబుబంధించు చుండుము ఇట్లు రాజు సూర్య నారాయణరావు అని వ్రాసి యా చీటి వైద్యులకిచ్చెను.

వారు దానినిఁ గొనిపోయి కారాగృహాధికారికిఁ జూపించి లోపలికి వెళ్ళవలయునన నతండు తలుపులఁదెఱచి, వాకిలిముందు నిలువఁబడి యుండెను. వైద్యులు లోనికరిగి "నివురుగప్పిన నిప్పుమాదిరి,, ధూళి గ్రుంగినదియై ప్రకాశించు

వధూ మతల్లిం గాంచి, తల్లీ! తల్లీ! యని పిలిచిరి. కాని యాపె పలుకదయ్యె. ఇట్లు కొంతవరకుఁ బిలిచి చూచి యొకయుక్తిఁబన్ని వేంకటాద్రినాయ మహీపాలాయిటురమ్ము. మేము పిల్చిన నీ కలభాషిణి పల్కుటలేదని పెద్దయెలుంగున బిల్చిన నమ్మానవతీ రత్నం బదరిపడి కనులందెఱచి దిక్కులు పరికించు సమయంబున నొకచీటిముక్క నాపె కందించి, యంగుళీయకమును ముందుంచిరి. యాకలభాషిణి యా చీటిని

జదువుకొని, యంగుళీయకమును బుచ్చుకొని, దానిపై ము
హరుఁబరీక్షించి, కోరిక లీరికలెత్త నేత్రంబుల కద్దుకొని,
నిరాశాహృదయ క్షేత్రంబున నాశాంకురం బుదయింప బా
హ్యప్రపంచ వాంఛ గలిఁగి చెలంగుచుండెను. వైద్యుల త్తెఁ
డమసంచులనుండి యాహారపదార్థంబులు వెలువరించి, యా
పెచూచుచుండఁ దగుచోట భద్రపఱచి, యాగృహంబు వెల్వ
డిచనిరి. మఱునాడటులనే ప్రవేశించి చీటిభోజనపదార్థంబును
సమర్పించిరి. ఇటులనే పదిరోజులవరకు సమర్పించి, పదునొకం
డవ రోజున రాజుగారివద్దకు వెళ్ళి నృపాలసత్తమా? మామం
త్రౌషధ ప్రభావంబుచేఁ గల భాషిణి మనంబనెడి యయ
స్కాంతమునకు మోహలోహాకర్షణశక్తి నాపాదించి, నయన
మీనంబులు మీ లావణ్య సముద్రంబున మునింగి తేలుచు
మీ ముఖ చంద్రబింబ దర్శనంబున కాకాంక్షించునట్లు లోన
రించితిమి. దేవరవారు రేపటిరోజున మాతోఁబాటు కారా
గృహంబులోనికి దయచేసి, మీ కుల్కుమిటారిం బల్కరించు
కొని, తము రానంద పరవశులై మమ్మానందింపఁ జేయుదురు
గాక. అని పల్కిన నారాజున కప్పటి సంతోష మిటులుండు
నో వేద్యు లూహించవలయునే కాని వర్ణింప నలవిఁగాదు,
రాజా రాత్రియంతయు మోహసముద్ర నిర్మగ్నతఁగడపి.
పదిరెండవ రోజున వైద్యుల సమేతముగ గజారోహణ మొ

నర్చి, కారాగృహంబు కడ కరుఁగుదెంచు నరికి కారాగృహా ధ్యజమాని యెదురుగావచ్చి నమస్కరించిసెలవేమిస్వామీ ? యనఁ గారాగృహంబు దెరువుమన నాతండట్లులొనరించెను. వెంటనే రాజు వైద్యులు లోవలఁ బ్రవేశించువరకు నాకలభా షిణి ముసిముసినగవుతో లేచి నిలువంబడి, రాజునకు జోహా రొనరించెను. రాజువైద్యుల సామర్థ్యంబున కచ్చెరువందుచుఁ, గామావేశంబునఁ దత్తరించుచుఁ ,,బట్టమహిషీ పదాప్రాప్తి రస్తు,, అని దీవించెను. రాజు దీవెన కా కలభాషిణి యెంత యు సంతసించుచు సిగ్గునఁ దలవంచుకొను దానివలె రాజు మొగంబుఁజూడ నిష్టములేక నమ్రవదనయై నటించెను. అట్లు నటింప రాజు దేవీ! సిగ్గునొందకుము. నీ రాకా సుధాకర బింబసదృశ ముఖలావణ్య చంద్రికా స్వాదనంబునకుఁ ద్వరపడు చున్న నీ రాజ చకోరంబున కంతరాయముఁ గల్పింపకుమని ప్రార్థింపుచుండ, నమ్మానిని తిలకంబు వ్రీడామేఘంబు మీ కంతరాయంబుఁ గల్పించె నహింపుఁడనియెను. అంతలో వైద్యులు రాజచంద్రమా? సోమవారంబున మీరీ మదన సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తులుగండు. మే మప్పటి కీ వ్రీడా మేఘంబునుగూడఁ బాఱఁదోలుదుము. తమ రీ దినమున నింతట నిష్క్రమించుఁడన నా కారాగృహంబును వదలిపో నిష్టములేక చూచిచూచి యిఁక నీ మోహానాంగి కీ కారాగృహా

వాసము తగదు. దీనినిఁగొని మాశృంగార హర్మ్యంబున కరుగుదము రండని రాజు పలుక వైద్యులు మీ శృంగారమందిర ప్రవేశమునకీ రోజు మంచిదికాదు. ఒకటి రెండు రోజులింక నీపకీ కారాగృహ వాస ఫలంబు మిగిలియున్నది. సోమవారమునాటి దివ్యముహూర్తంబున నీ భామినీమణి మీ గృహంబలంకరింపఁగలదు. త్వరపడవలదు. మీరు దయచేయుఁడని యతని నచ్చటినుండి విశ్వప్రియాత్మంబున మందిరంబున కనిపిరి. రాజు గృహంబునకువెళ్లి తప్పెట్ల వాండ్రఁ బిలిపించి, రాజుగారు సోమవారంబునఁ గలభామినికి కన్నెరికము బెట్టఁబోవుచున్నారు గాన, పురంబెల్ల నత్యంత రామణీయకంబుగా నలంకరింపవలసినదని మన పురవాస్తవ్యుల కెల్లరకుఁ దెలియునటులఁ జాటింపుమని యాజ్ఞనొసంగి, వివాహ మండపంబు నలంకరింపఁ జేయుమని ప్రధానునితో వచించి, కేకినలుకొట్టుకొనుచుఁ గనులు మిరుమిట్లుఁ గొలుపునట్లుగా శృంగారించుకొని, యుపచారోపచారంబులొనర్చుచుండెను.





# వేంకటాద్రి నాయఁడు

## సప్తదశోల్లాసము.



చెంచులకు మొనగాఁడైన భైరవనాయకునకుఁ బ్రాణంబునుబోలు చెలికాఁడై, లంబాడి దొంగలకు రాజై, బలవంతుఁడై, యుక్తివంతుఁడైన, ఠాకరు భైరవ నాయకుని తదనుచరులైన చెంచులను వేంకటాద్రి నాయఁడన్న వస్త్రంబులిచ్చి పోషింతునని, తన కోటకుఁ బిలిపించి, నఱికించినందులకు మిక్కిలి చింతించి, తన లంబాడి సైన్యమును గూర్చుకొని, యాలోచించి, వారల పసుపున మీర్ ఖాసిమ్ పేటకుఁ బ్రభువైన యమీర్ ఖానను తురుష్కాగ్రణిం దర్శించి, సలాముచేసి, యాతని యనుమతి నొక చిఱుగద్దియ నధిష్ఠించి, యిట్లు ముచ్చటించెను.

ఠా॥—తురుష్కాధిపా! రాజమహేంద్ర నగరంబు నెఱుంగుదురుగదా! ఆ నగరంబున నొక భోగమింట జన్మిం

చికలభాషిణి యను పేరువహించి, పెంపొంది జగన్మోహనాకారంబుతో నొక్క కాంతాతిలకం బలరారుచుండు. దాని రూపలావణ్యంబుల కచ్చెరువంది వరించి, పాతూరి పట్టణాధీశుండైన సూర్యనారాయణరావుగారు దానిని బలవంతముగా దనపట్టణంబునకుఁ గొనిపోయి, తన్ను వరించుమని యెంతమందిచేతఁ జెప్పించి, యెన్ని బహుమతులిచ్చి, యెంత బ్రతిమాలుకొన్న నా వేశ్యకాంత యతని వరించినదికాదు. అందుకా రాజు కోపించి, దానిని జైలునందుంచి, శిక్షఁ జేయించు చున్నాఁడు.

ఆ॥— ఆ. కంచెనిక్క అంతభడవది. కొట్టులో పెట్టినా రాజును పట్టలా?

శా॥— లేదు ప్రభూ; లేదు. అది వెంకటాద్రినాయని వరించి యున్నది. చేపట్టిన వెంకటాద్రినాయనే చేపట్టవలె. లేకున్న నేనన్యుని నొల్లనని అటులనే కొట్టులోనైన నుండి బ్రహ్మచర్యవ్రతంబుసల్పుట కొడంబడినది. దానియందము నేమని వర్ణింతును. అదిచక్కనిచుక్క, దానినిజూచినవనంబున నినుపగోచీలుబెట్టుకొని ముక్కుమూసికొని కూర్చుండు మునిముచ్చులు కూడ గామావేశులైయొడలెఱుంగక వెంటనంటుదురు. అదిమీబోటి

హుజూర్లకుండిన సెబాసుగానుండును. దానినెట్లైన మీపేటకు రప్పించుకొని మీరుచేపట్టినరాజులకందఱికిఁ దలకట్టు మీరగుదురు. మీయాకారంబుఁజూచిన నదిమిమ్ముఁ దప్పకవరించును. మీకక్కాంతామణి లభ్యంబగునేని సర్వసంపదలు గలిగినటులే. నేను మీకుఁబ్రియభృత్యుఁడను గనుక నాదోషంబు లేకుండ మీకు విన్నవించితిని. తరువాత మీ చిత్తమెన్నివిధంబులఁ జూచిన నక్కాంత మీకేతగియున్నది.

అ—అది మనకీ కైసాచిక్కు. మనమారాజు కోట్కి కైసా పోవాల. ఆరాజుకు యిఁకారు చేసింది నన్ను నిగా చేస్కుంటుందా? అదిమనదీకాద్ భాయిమనదీకాద్.

తా—నేనొక యుక్తిఁజేసి దానినిఁగొనితెచ్చి మీకొప్పగించెదను. మీరుకోరిన పక్షమున మూడవనాటికి మీయింట దానినుంచనా? దానిని మిమ్ము వలచునటులఁ జేయు భారమునాది. మీరు స్వీకరింతుమని చెప్పిననేఁగోరి వవ్వాదు మీసైన్యము నొక్కరోజు నావెంటఁబంపినఁ జాలు తరువాత పనులన్నియు నేనే చక్కఁబెట్టుకొని యాకలభాషిణిందెచ్చి మీ నగరు తళతళలాడించెద. నాబుద్ధిబలకౌశలం బొక్కసారి పరీక్షింపుఁడు. నేననలే టక్కరిగాడను గదా?

అ—నాకోసము నీవు తక్లీఫ్పడి అచ్ఛికంచెన్కి తెస్తానుచెప్తే

మైవద్దు చెప్తా? బేగి తీసాకరా? నా సైన్యానికి నొక్క రోజు సెకీయిస్పిస్తా? నాకీ ఆ కంచెన్కి నిగాహెయ్యాక హోతే సీతలకాయకు కొట్టింది హామారాకోటాకి బలీ హెడ్తా, చలో జావ్. జల్దిపోయి దాన్కిపట్కరా దాన్కి చూడాల బుద్ధిపుడుతుంది. అది బంగారాన్కి సరిగావుంది. దానిని అల్లా అట్లా పుట్టించాడు అనొకం టా? సెహబాస్ అల్లాకి నాపై చాలా దయవుంది.

తా—సలామ్ హుజూర్—ఆటులనే తీసికొని వచ్చెదను.

అని చెప్పి తన సైన్యంబుకడ కేఁగి కలభాషిణిని పట్టి తెచ్చి యమీర్ ఖానున కిచ్చెదననిన సంగతియు, నతండందులకు సమ్మతించి తన సైన్యంబు నొకరోజు తమకు సహాయముగాఁ బంపెదననిన సంగతియుఁ గలభాషిణిని పట్టియివ్వనటులైనఁ దనతలనరికించి కోటకొమ్మునఁ గట్టించెదనని తురుష్కప్రభు వు దుర్వారంబుగాఁ బలుకుటయు, వారలకు వినిపించిన వార లు సంభ్రమ భయంబులతో సాలోచనా పరులై కొంతతడ వు నభఁదీర్చి, ప్రచ్ఛన్న వేషంబులఁ బన్నుకొని. చింతపల్లికో టలోని వేగులున్న, పాతూరిపట్టణంపు వేగులుఁదీయుచు పాతూరి పట్టణసమీపారణ్య భూములసంచరించు చుండిరి.

ఈ దుష్టులిట్టి తలంపును తలపెట్టుచుండుకనగా నీకల భాషిణినిఁ గొనిపోయి తురుష్కాగ్రణియైన యమీర్ఖానున

కుఁగూర్చెనఁ దమకితఁడు సహాయంబుగానుండి చిన్న చిన్న గడీలన్నియుఁ దోచుకొనుట కనుజ్ఞనిచ్చెననియు, నదియునుఁ గాక దీనికొఱకై పరితపించి వేంకటాద్రినాయుండు వికలచిత్తుం డయిన నారాజ్యంబును మహమ్మదీయుల సహాయమున లాగుకొని, తమరు పరిపాలించుకొన వచ్చుననియుఁ జెలు లయిన చెంచులనణకించిన పగఁదీర్చుకొన వచ్చుననియుఁ నెంచి వారలిట్టి దౌష్ట్యాలోచనలొనరించి తత్ప్రయత్నంబు గొనుండిరి.

దుష్టులకుఁ గ్రూర కార్యము లొనరించి జీవించవలయు ననెడి తలంపుఁదప్ప సన్మార్గగా మిత్వంబలవడునా? దుర్మార్గు లెట్టి బలవంతులయినను, ఎట్టిబలవంతుని సహాయంబుఁబడసి యున్నను, కష్టములపాలయి దారుణ మరణంబులొందుట ని శ్చయము. అచ్చట భేతాళశ్మశానంబున వైద్యులచేఁ బంపఁబ డిన బిచ్చగాడు చింతపల్లికోటకు వెళ్లి, వెంకటాద్రినాయుని తోఁ దద్వృత్తాంతంబెఱింగించి, యతండు వెంటనే మఱలిచను దెంచి, పాతూరి పురంబుననున్న ఘనవైద్యులతోఁ గలిసికొని, భేతాళశ్మశానంబున కేఁగి, యచ్చట వారిట్లు మాట్లాడుకొనఁ దొడంగిరి.

బిచ్చ—నేను చింతపల్లికివెళ్లి రాజుగారిని మీరుచెప్పిన గడువునాటికి బొల్లిగుట్ట కడకరుదెంచి, యచ్చట విడిసి

యుండుడని తెల్పి వచ్చినాడ. వారారోజునకుఁ దప్పక వచ్చి యచ్చటవిడిసి సర్వసన్నాహంబు లొనర్చుకొని వేచియుందురు.

వైద్యులు—బిచ్చగానికి మఱికొన్ని రహస్యము లెఱింగించి, నీవుపోయి మనరాజచంద్రుని బొల్లిగుట్ట యొద్దఁగలిసికొని మేము నీకెఱింగించిన కార్యక్రమంబులఁ జక్కగా నెఱింగించి, నీవుమరలివచ్చి కలసికొనుము. అని నియమించిన నతండచ్చటనుండి బయలువెడలి, బొల్లిగుట్ట సమీపమునకు వెళ్ళుచుండెను. వైద్యులా శ్మశానమును వదలి నగరంబుఁ బ్రవేశించిరి.

ప్రథమభాగము-సంపూర్ణము.



# వేంకటాద్రినాయఁడు.

## ద్వితీయభాగము.



గ్రంథకర్త;

పాటిబండ్ల వెంకటాద్రిమయ్య చౌదరిగారు



# వేంకటాద్రినాయఁడు

## ద్వితీయభాగము—ప్రథమోల్లాసము

చింతపల్లి కోటలో వేంకటాద్రినాయప్రభుండు భృత్య ముఖంబున నేవియోకొన్ని రహస్యంబులెఱింగి బొల్లిగట్ల సమీపమునకు సైన్యసమేతముగా నేఁగవలయునని తలంపుచే రణభేరిని మ్రోగింపఁజేసెను. ఆధ్వనివినిన తోడనే సైన్యనాయకుల పనుపున సైన్యవారాసు లుత్సాహరసపూరితంబులై పోఁగిపొరలి రాజాస్థానంబు నాక్రమించెను. సైన్యాధిపతులు కాసెలు బిగించి ధట్టిఁగట్టి మైమరువులఁదొడగుకొని, గదా ధనురాది యుద్ధ పరికరంబులఁ దాల్చి, హయగజాదుల నధిరోహించి, సైన్యంబు వెనువెంటరా నుద్యమించుచుండిరి. అప్పుడు రాజచంద్రుఁడంభారిఁగట్టి శృంగారించిన మత్తగజేంద్రంబు సైనికవాహినీశులు చూచుచుండఁ జేయువిసరెను. వారంతటఁ దమతమ సైన్యంబులఁ గదలించుకొని రాజచంద్రునితోఁగూడ నడువజొచ్చిరి. ఇట్లు బయలువెడలి యుత్తరదిశాభిముఖులై విశాలంపు టరణ్యమార్గమును బట్టి, యా పద్య

యంబగువరకు నడచి కాసారతీరమున విడిచి. యచ్చట సంగ్రహించి తెచ్చిన యాహార పదార్థంబుల భుజించి, యాగుంపు మామిడి గున్నలనీడల నించుక విశ్రమించి, మార్గాయాసమున పనయింపఁ జేసికొని యందుండి వెడలి, ముందు త్రోవను బట్టి, వన వైచిత్ర్యంబు లరయుచుఁ, బిక కీర శారికాది సుస్వర పక్షి సంఘంబుల కూజితంబుల కాహ్లాద మొందుచు, భయంకరంబుగా దశదిశల ద్రువఁ జెవులు బ్రద్ద లగునట్లు గర్జించుసింహ శార్దూలాది ఘాతుకమృగచయంబుల నుల్లాసంబుతోఁ దిలకించుచు, బెదరి చెదరి పరువిడుచుఁ దిరిగి తిరిగి మనోహరంబుగాఁ జాంచల్యదృష్టులు బరపుచు దుముకుచున్న హరిణంబుల నరవడించి బెదరించుచుఁ గేకుల నృత్యంబులకు వినోదించుచు, శుష్కజలంబులుగల కొండవాగుల నతిక్రమించుచుఁ, జిన్నిచిన్ని గుట్టలెక్కి దిగుచు, రావియాకుల మేయుటకై దారిఁదప్పించి లాగుకొని పోవుచున్న మదపుటేనిక గున్నల నంకుశంబుల నొప్పించి గీపెట్టించి మరల్చుచు, యావన్ప్రాదుర్భావంబున నొడలెఱుంగక సురతాపేక్ష నాడుగుఱ్ఱంబులఁ గూడముట్టుచున్న ఘోటకసంఘంబుల కళ్లెంబులు మెడలువిడుగునటుల లాగి మందగమనంబు నేర్పుచు, నిస్సంశయ సంపూర్ణ జయసూచకంబులైన శుభనిమిత్తంబుల కలరుచు, హాస్యకథాశ్రవణ సంజనిత విహాసంబుల పథశ్రమంబు దోపకుండ సూర్యాస్తమయ కాలమువరకు నడచి నడచి టెంకాయపాలవలె స్వచ్ఛంబుగా విరాజిల్లు జలంబులు గల నదిగట్టున విడిచి, శాకపాకములు

పచనంబొనరించుకొని సంతృప్తిగా భుజించి, పహారా భటులు పహారాయిచ్చుచుండ మిగతావారు గుండెలపైఁ జేతులుంచుకొని వెన్నెలసమయమందుఁగూడఁగారుచీకఁటులుగ్రమ్మియున్న యాతరుచ్ఛాయల బిచాణాలు పఱచుకొని నిదురించుచుండిరి. భోజనానంతరమునఁ బ్రభుండు విశాలప్రదేశంబున వెన్నెలలోఁ బెట్టెలోఁగొనివచ్చిన పరికరంబులచే నప్పటికప్పు డమర్పఁబడి నమంచముపైఁ బఱచఁబడియున్న హంసతూలికా తల్పంబున శయనించి, యారోజు ఫాల్గుణమాస శుక్లపక్ష త్రయోదశి యగుటచే నించుమించుషోడశ కళాపూర్ణుండయి వెలుఁగుచుఁ జంద్రికా సుధాసారంబున జగజ్జంతు జాలముల శ్రమలు వాపి సుఖసుప్తులఁ జేయుచున్న సుధాకర బింబమును గనినంతనే కలభాషిణీ ముఖచంద్ర బింబంబు మనోదర్పణంబునఁ బ్రతిఫలించెను.

అప్పుడు విరహిణీజన మారకుండైన పుష్పబాణుండు మేనమామను పూనికగాఁగొనిసూనశరంబులచే మానవనాథుని మేనెల్లజల్లెడ తూట్లొనరించి, మోహరస మకరందంబును తద్ద్వారా యాకుసుమాభ శరీరంబున కెక్కించెను.

ఆ త్తఱి రాజేంద్రుండు ధైర్యంబుఁ దక్కి, కామపిశాచంబునకుఁ జిక్కి, కళవళించి స్రుక్కి, యెట్టకేలకు విజ్ఞానౌషధంబు మెక్కి, ధృతిఁ జెక్కి, కామపిశాచంబు నణఁగఁద్రొక్కి, పరమేశ్వర ధ్యానంబుచే సొక్కి, బాహ్యప్రపంచంబుమఱచి సుఖసుప్తిఁ జెంది, మరునాఁడుదయమునఁ దాత్కాలిక కార్యంబులు నిర్వ

త్రించుకొని సన్నాహ సమేతముగా నచ్చోటువాసి వారిం బట్టి నడచుచుండెను. ఆసైన్యములోం గలసి యచ్చటనుండి యెందరి గెడు బాటసారివారో యొకండు ప్రయాణంబు జేయుచుండెను. ఘటికలం గొంతదూరము పోవునరికి సైన్యములోం గొంతమందికి దాహము లెక్కుడుగా నాయెను. సమీపమందెచ్చటను జలం బుంగనుపింపదయ్యె. వారలన్వేళ జలంబెందు దొరుకునాయని యోచించుకొనుచుండ నా బాటసారి యచ్చటికి సమీపమున నిచెట్లచాటుననున్న కాలిబాటప్రక్కం జలువపందిరి కలదు. అచ్చటికి వెళ్లిన స్వచ్ఛమైన నీరు దొరకును. నంతకువినా యీప్రదేశమందెచ్చటను నీరుదొరకదన సైన్యాధిపుల యాజ్ఞంగొని సైన్యముకొంత యాగంతుకపురుషుని వెంటనా చలువపందిరికడకరిగెను. చలువ పందిరిలో నిల్చియున్నవారు సైనికులకెల్లరకు స్వచ్ఛమైన లోహపాత్రలయందు నిర్మలశీతోదకంబులుంచియిచ్చిమర్యాద గావించి, మీరెవ్వరు? యెచ్చటికేమిపనిమీద వెళ్ళుచున్నారు. అని వినయపూర్వకముగా నడిగిన సైన్యము లుప్పొంగి యాతనిం బ్రీతిపాత్రునిగా నెంచి, నెక్కుండు తమప్రయాణ కథావిధాన మాతని పావవుచెవిలోంబడవేసెను. తదుపరి దాహంబుందీర్చుకొని వచ్చిన వారలుంగూడం దమ సంఘంబున, గలిసికొనిరి. కాని యాగంతుక పురుషుండు మాత్రము చలువపందిరి కడ నంచియే నామార్గమిటులని భిన్నమార్గంబును బట్టిపోయెను.

ఇట్లు వెంకటాద్రినాయ భూపాలుండు సైన్యసమేతుండై మూండునాలుగునడచిమూడవరోజు సాయంత్రమునకు బొల్లిగుట్ట

కడకుఁ జేరియచ్చటదగు నేర్పాటుతో విడిచి యెదురెదురుఁ జూ
చుచుండెను. అరణ్యమధ్యమునఁ జలువపందిరిఁ బెట్టి యున్న పు
ణ్యజనములు పరోపకారార్థము చటఁ బందిరిఁ బెట్టి నీళ్లిచ్చుటలేదు.
వెంకటాద్రి నాయఁడు సైన్యసమేతముగా బయలుదేఱి యీ
మార్గమున వచ్చుచున్నాఁడని ప్రచ్ఛన్నవేషంబులఁ జరించు
తమలంబాడీలు చెప్పగావిని, తాకరు వారేమిపనిమీఁద నెచ్చ
టికరుగుచుండిరో తెలిసికొన నుపాయంబుఁ జెప్పి పంప, కొంద
ఱులంబాడీలు ప్రచ్ఛన్న వేషంబులతో నట్లొనర్చుచుండిరి. ఆ బా
టసారికూడ నీగారడీలోనివాఁడే వేంకటాద్రినాయని సైనికులు
మాత్రము వీండ్లగారడీలోఁ జిక్కితమగుట్టును వెలువరించి వీండ్ల
దుర్వ్యవసాయంబునకుఁ గొంతసావకాశంబు గలిగించిరి. బుద్ధిబ
లంబున నెట్టిఘన కార్యమునైన సాధనలోనికిఁ దేవచ్చును.
అచ్చట మరునాడుదయంబున వేంకటాద్రినాయని యొద్దకుఁ
బ్రచ్ఛన్న వేషంబుతో నొక్కండేఁగుదెంచి, ప్రభువునకు నమస్క
రించి, నిజవృత్తాంతం బెఱింగింపిన వారిరువురిట్లు మాట్లాడుకొనిరి.

రాజు—ఏమి వడివడిగా మరల నేతెంచితివి. పాతూరి పట్టణ
విశేషంబు లేమి?

భా—స్వామీ? మననాగన్న వీరపనీడు లిర్వురు వైద్యవేషం
బుల నాపట్టణంబునఁ జరించుచు నొక్కనాడు సూర్య
నారాయణరావు కంటఁబడి యతనిపైఁ గలభాషిణికి
మమతఁగల్గింతుమని ఘోరప్రతిజ్ఞఁ జేసి, యాతనియాసం
మతి వెంటఁగారాగృహాధికారి చేఁదలుపులుదీయించి

యందుప్రవేశించి కలభాషిణినిఁ జూచిరి.

రా—కలభాషిణి యెటులున్నది. ఇంతవరకుఁ గారాగృహంబులోనేయున్నదా?

భా—ఇంతవరకుఁ గారాగృహంబుననే యున్నది. శుష్కగాత్రంబున యోగినింబోలెఁదమ దివ్యనామాక్షరములు సదామనంబున నిల్పి ధ్యానించుచున్నది. అంతట వైద్యులు కలభాషిణినిఁగాంచి తమవృత్తాంతంబును భవిష్యత్కథా విధానమును లేఖల మూలకముగా నాపెకుబోధపడు నట్టులొనరించి, యాపె వాక్కుచేతమాత్రము సిన్నుపరించెదను. ఇంతవరకు నేనోర్చిన యాపరాధంబుల మన్నించుఁడని పల్కించిరి. సూర్యనారాయణ రావామాట వినినతోడనే బ్రహ్మానందమున మునింగి యెప్పుడనియె. అందుకు మనవైద్యులు ఫాల్గుణబహుళసోమవారము లగ్నము బహుమంచిగానున్నది. ఆదివ్య ముహూర్తంబున మీరీకాంతను చేపట్టుఁడనిరి.

రా—సూర్యనారాయణ రావేమనియె. తదుపరి నేమి గావించెను.

భా—రాజందుకు సమ్మతించి యచ్చటినుండి కొల్వుకూటంబున కేఁగి పురంబంతయు శోభాయమానంబుగా నలంకరింప సమస్త జనులకాజ్ఞనిచ్చి, గర్వపూరితుండై సింగారంబొనర్చుకొని, యూఛార్ పచార్లొనరించుచుండెను. పురంబంతయు దేదీప్యమానంబుగా నలంకరింపఁ

బడి ప్రజలెల్లను నాదివ్య ముహూర్తంబునకు వేచి యుండిరి.

రా—ఆదినమెన్నడువిదియా? యట్లయినరే పునరే. ఇంతవరకు మొన్నటి రోజుననే వినియున్నాడను. ఇప్పుడు నీవు మరల నాయొద్దకు రావలసిన కారణంబేమి కలిగె.

భా—స్వామీ? మనవైద్యులింకా కొన్నిరహస్యంబులు విని పించి రమ్మనిన వచ్చినాడనని, యేకాంతమున మహా రాజునకుఁగొన్ని సంగతు లెఱింగించి, యతండు వెడలి పోయెను.

వేంకటాద్రి నాయుండా దినము బొల్లిగట్ట యొద్దనే గడపి, మరునాడు దయామైన సైన్యాధిపులకేవియో కొన్ని రహస్యంబు లెఱిఁగించి, యచ్చట నుండి సైన్యమును లేవఁదీసి ప్రాగ్దిశాభి, ముఖముగా నెచటికో నడపించు చుండెను. సైన కులకు మాత్ర మచ్చటినుండి యెందుకని బయలు దేరఁ దీసిన సంగతి యుఁదెలియ దాయెను.





# వేంకటాద్రినాయఁడు

## ద్వితీయోల్లాసము

చాటింపులవిని పురజనులెల్లరుఁ బట్టణంబు నిటుల నలంకరింప మొదలు బెట్టిరి. ప్రతిదివ్యభవనంబునకుఁ బటికపుపొడివంటి సున్నంబును గొట్టించిరి. ఇండ్లలోపల భూమి శుభ్రముగానలికి ముత్యములవలెఁ బ్రకాశించుచుక్కలముగ్గులు బెట్టించిరి. దర్వాజలకుఁ బ్రశస్తమైన పసుఁపుబూసి క్రిందిప్రక్కల దర్వాజకమ్ములకును మంజికమునకు నెఱుపు పసుపు తెలుపు చుక్కలు చక్కగాఁ బెట్టిరి. ఇండ్లముందు తాటియాకులతో నెదుళ్లతోఁ జల్లగా నుండునటుల పందిళ్లు వెట్టి పందిళ్ల స్తంభములకు వెదుళ్లకుబలు రకపువన్నియలరంగు కాగితంబులంటించి, యారంగుకాగితములతోనే చేయఁబడిన చిలుకలు మొదలైనచిత్రవిచిత్రంపుబొమ్మలు పందిళ్లకెల్లెడఁజూచినను మనోజ్ఞంబుగా నింపివేసిరి. బజార్లవైపు గోడలయందున్న చదరంపు విశాలపురాళ్లపైఁ జెక్కఁబడియున్న ప్రతిమలను మనోహరంబుగాఁ గ్రొత్తరంగులచే సింగారించిరి. పందిళ్లకు ముందు నటునిటు ప్రక్కలరంభాస్తంభముల నాటిరి. ఆపాతూరి పట్టణంబునఁగల స్త్రీపురుషాదులు నంపెంగనూనె

నంటి తలల సీకాయరసంబునఁదోమి, వేడినీళ్లతో స్నానంబా
చరించి, పరిశుద్ధగాత్రులై సుగంధతైలములఁగురుల కలముకొని
చక్కఁగా దువ్వి రకరకంబుల జెడలు ముడులు వేసికొని, యిత్త
డికాయల భద్రపరచియున్న నాగరికపు బంగరువస్తువులు
శిరోజ కంఠ కరాది యవయవంబుల ననువెఱింగి ధరించుకొని,
యిస్త్రీ గంజీ వగైరాలతోఁ బరిశుభ్రపరచి లోహంపుఁబెట్టెల
ముడిచి పెట్టఁబడి యున్న విలువగల వలువలఁజిమ్మటలకు
విశ్రాంతిఁగలుగునటుల బయలు వెడలించి, చెంగులు మీఁగాళ్ల
పైఁజిందులాడు నట్లు పసందు పరచి, ముఖంబుల యందుసా
బంగుహారంగులు గుల్కఁదీరైన బొట్లుసవరించి మోహనా
కారంబుల నొప్పుచుండిరి. గ్రామంబంతయు నిట్లు శృంగారించి,
పురజనులెల్లరట్టి యనర్ఘ్యవేషంబులతో నొప్పారు చుండ
రాజమందిరంబు లెట్లు శృంగారింపఁబడునో రాణెట్టిమనోహర
వేషంబున విలసిల్లుచుండునో యప్పట్ల జూఁచితీరవలయుఁగల
భాషిణిని వైద్యులయనుమతిని ముద్దియ లిద్దఱందలంబులోఁ
గూర్చుండఁబెట్టి బోయలచే మోయించుకొని వచ్చి, రమ్య
హర్మ్యంబునఁజేర్చి సహజ లావణ్యంబున రంభాసమాన యగు
నకాంతామణి నెట్లు శృంగారించవలయునో యట్లుశృంగా
రింప సానఁబట్టిన మాణిక్యంబు మాదిరి దేదీప్యమానంబుగా
వెలుంగుచుండెను. ఆమె యీయందచందంబులకు విధిలేక
దేహంబును మాత్ర మొప్పగించి మనంబు వేంకటాద్రి నాయ
మహీపాలుని యందే నిల్పి యుండెను.

అప్పటికి లగ్నపు వేళసమీపించి వచ్చినది. ఆసమయం
బున రాజునకు మాత్రము మరణచిహ్నంబులను సూచించు
దుర్నిమిత్తములు కొన్ని పొడగట్టెను, కాని తనకు మృత్యువై
యేతెంచిన కలభాషిణితన్నువరించినదనెడిపరమోత్సాహంబున
లోకంబును మఱచియున్న వాఁడగుటచే నవివానిని బాధించి
నవి కావు. అత్తఱి రాజు వైద్యులు చెప్పినరీతిసమహావైభవం
బుగాఁ బెద్దపెండ్లి జేసికొనుటకై వివాహమండపమున కేతెం
చెను. పిమ్మటపెండ్లి పెద్దల యానతిని కలభాషిణిని దోడ్కొని
వచ్చుటకై మేళతాళంబులతో బోయీలందలంబును మోసికొని
వచ్చి, యాపెమందిరము ముందు దింపి తొందరించుచుండిరి.
ఆవైభవమునఁ జూచి యోర్వలేకయేమో నన్నట్లు లగ్నహోమా
గ్నుండు వివాహమండపమునకు ముందుగాఁ జాలదూరంబు
వరకుఁ బెట్టఁబడియున్న తాటియాకుల పందిళ్లలో నొకపందిరి
నంటుకొని, మెలమెల్లగా నాహరింప నారంభించెను. అప్పు
డొకమనుష్యుండు "హోమెహోమె" పందిరి తగులఁబడి పోయెనని
బిగ్గరగా కేకలువైవ సమీపస్థు లెల్లజలపాత్రలను సంతరించి
కొనకయే తత్తరంబునఁబరువిడి గొల్లుమన నారంభించిరి.
కొంతమంది వారిలో నుపాయశాలురు మాత్రము సగమువర
కుఁగాలిన పందిరి వెదుళ్లను లాగి, యామంటలపై దబిదిబి
మోది యార్పవలెనని యత్నించిరి. కాని హోరుగాలి వలన
మంటలతోఁ గూడిన కొరవులుకొన్ని యెగిరి, వర్వ్యంబునం
దలి పందిళ్లపైఁబడి, జాజ్వల్యమానంబుగా మండుచుండుట

వలసనప్పని వారలకు సాధ్యమైనది కాదు. ఏతత్ప్రయత్నంబు నంతటితో విరమించి ప్రాణంబులఁ దక్కించుకొని బైటఁబడిరి. కానియాదు దినంబున బహుమంది జనుల కరచరణాదులు కాలి, బాధపడుచుండిరి. తక్కినవారు గాలికెదురునైపు బజార్లనబడి తమ తమ గృహంబులు జేరి, వాకిళ్ల ముందున్న పందిళ్లను లాగివేయవలెనని, నిచ్చెనల సహాయమున గోడలకెగఁబ్రాకి, కట్లుదెంచి యొకటిరెండాకులు దూసివేయుసరికి, శరీరములకు వేడిదాకి యందునిలువ నోపక గుభాలున భూమిపైకి దుమికి, కాళ్ల సత్తువలకొలందిఁ బాఱి మేడమిద్దెలకుఁ జేరిరి. దుముకుటవలనఁ గీళ్లుతొలంగిన వారల్లాడుచుఁ గుయ్యిడుచుండుటను కన్నులారఁ జూచికూడ వారల సముద్ధరించని వారై గ్రామ వాస్తవ్యులు పలుదారులఁ బలాయనంబుఁ జెప్పుచుండిరి. భర్తల నెడఁబాసి దుఃఖించు పడఁతులును, పడఁతుల నెడఁబాసి శోకించు భర్తలును, పుత్త్రపుత్త్రికలు తల్లిదండ్రుల కగుపడమి నాహాకారించు సతీపతులును, గలిఁగి పాతూరి పురంబు పూర్వము హనుమంతునిచే నిప్పంటించఁబడిన లంకాపురంబు మాదిరి నల్లకల్లోలముగా నుండెను. అప్పట్టణంబు మేడలు మిద్దెలు మొదలైన గట్టియిండ్లు గట్టుచేఁగన్నెరికమునకుఁ గాను బాజార్లన్నిటి ముందుఁబెట్టబడి యున్న పందిళ్లలో ముప్పాతిక మూడువీసాల మట్టుకుభక్షించి, కృశానుండు తృప్తినొందవలసినవాఁడాయెను. ఆగఁదరగోళములో సందలంబచ్చుటవిడిసిబోయాలెచ్చటికో పరువిడిరి. కలభాషిణిని శృంగారించిన చెలులుగూడఁ

నామందిరంబును వదలి,సతీసుత ప్రేమానుబంధమునఁదవిలి నిజ మందిరంబును జేరినవారైరి.

కలభాషిణి యాలంకను దహింపఁ జేయుచున్న హనుమంతుఁ డెవరో యెఱింగి యున్నది కాన రవంతయుఁ జలింపనిల్లి యా మందిరంబుననే యుండెను. అప్పుడా లంకను దహించిన హనుమంత ద్వితయమా వైద్య ద్వితయ మాసందడిలో నా కలభాషిణిని మెల్లగా నచ్చటికి దాటించుకొని పోయిరి. అప్పటికి వేంకటాద్రినాయ మహీపాలుండా పట్టణ సమీపమునకు వచ్చి విడిసెను. కలభాషిణినెవ్వరో యిద్దఱు నూతన పురుషులు గల్లీబజారునఁగొని పోవుచున్నారని సేవకుండొకఁ డాత్రముతో వచ్చి, తనప్రయత్న విఫలంబునకు వగచుచున్న రాజున కెఱింగించెను. ఆవైద్యులు మారువేషముల ధరించి, కలభాషిణిని దప్పించుకొని పోయి, వేంకటాద్రి నాయ మహీపాలున కప్పగించి తిరిగి వైద్యవేషంబులతో నచ్చట చింతాకుల స్వాంతుల రీతిఁ గనుపట్టుచు, జరించుచుండిరి. రాజునకు వీరియందించుకంతయు ననుమానము తగిలినది కాదు. రాజంత రణభేరిపై నొక్కదెబ్బ వేయించి, హాజరున్న న్వల్ప సైన్యముతో నాతండెఱింగిన గల్లీ బాజారునఁ బురము నిర్గమించెను. నిర్గమించువరకు మద కరిహయ భటవర్గంబుతో నొక్కరాజేంద్రుండతని కంటఁబడియె. నారాజ పర్జన్యునిచెంత విద్యుల్లత వలెఁగలభాషిణి మెఱయుచుండెను. అప్పుడా సూర్యనారాయణరావున కెట్టియాగ్రహంబు గల్గునో యెట్టి

యాకారంబుతో నుండునో యూహించెడు భారము జదువరు లకే వదలినాడ. పౌరుషాభిమాన పూరితుండైన యాపాతూరి పట్టణాధీశుండు స్వల్పసైన్యంబుతోఁ గవచాదులేవియు ధరింపక వెడలిన వాఁడైనను, వెనుకంజ వేయనిష్టములేనివాఁడై, శార్దూలంబును డీకొను చిత్రపులి చందంబున వేంకటాద్రి నాయమహీపాలుని తోనెదిర్చి రోషకషాయనేత్రుఁడై స్ఫూర్తులు జెలంగ నుత్సాహ పూరితుండై, పోరొనర్చుచుండెను. ఇతని స్వల్ప సైన్యంబుతో నారాజోత్తముని సైన్యాధిపులు తలపడి యొక్కొక్కని నొక్కొక్క ఖడ్గ ప్రహారముచేఁ దల్ర దెగ్గనేసి, యంతకాల యమున కతిథులగాఁ బంపుచుండ_ నానగరంబు నుండి యసంఖ్యాక జనంబు గజ హయాది వాహనంబుల నధిరోహించి, తీవ్ర దృష్టులతో నొక్క పెట్టున లంఘించి, ప్రతిపక్షయోధ వీరులఁదాకిరి.

అంతట నయ్యిరువైపుల సైన్యమునకును సైన్యాధిపులకును పోరు ఘోరముగా నారంభ మాయెను. ఆయుద్ధము చూపఱులకు భీతిఁగొల్పుచు కనులు మిఱుమిట్లుఁగొలుపు ఖడ్గముల యొరపిళ్లచేఁ బుట్టిన మెఱుపుల వలనఁగనులు మూతలు పడుచుండెను. మెడలు కాళ్లు చేతులు నడుములు మొదలైనవి తెగి భూమిపైఁబడి యున్న కళేబరంబుల స్రవించిన రక్తము వల్లప్రదేశమున నిండి యచ్చట విరిగి తెగిపడియున్న కరవాల కళేబర ఖండంబులఁ దేల్చి, వాయుహతి నటునిటుఁగదలించి, యాత నేర్పుచున్నదో యనునటుల నగుపడుచుండెను.

ఈరీతి హాహాకారాహాకారి నాగోజు పాయంత్రము వరకుఁ బోరు చుండ హఠాత్తుగా సూర్యనారాయణరావు విగత జీవుఁడై ధరణీతలంబున వ్రాలెను. రాజు పడిపోవుటఁజూచి చావగా మిగిలిన సైన్యంబు ల్సాహముఁ దక్కి వెన్నిచ్చి పారి పోవఁదొడంగెను. వెంకటాద్రి నాయ మహీపాలుని సైన్యంబ త్తటి విజృంభించి యెదిర్చి యుండిన యోధవీరుల పైఁబడి పట్టుకొని బంధించి, రాజచంద్రుని యెదుటఁబెట్టిరి. ఆ భూపా లుండంతట బంధింపఁ బడియున్న యోధ వీరులఁబ్రసన్న దృష్టి నాలోకించి, బంధంబుల వదలింప ననుజ్ఞఁనిచ్చి, స్వవర యో ధులం గూడి పాతూరి నగరంబునఁ బ్రవేశించి, రాజాస్థానం బునఁ గొలువుఁదీర్చి, సూర్యనారాయణ రావు కుమారుండైన గోపాలరావును తోడ్కొనిరమ్మని, వారి మంత్రుల కాజ్ఞనొ సంగెను. మంత్రులు వెంటనే యేఁగితంత్రి మరణంబునకు వగ చుచున్న గోపాల రావును తోడ్కొని వచ్చిరి.

వేంకటాద్రి నాయుండా గోపాలరావును దగ్గరఁగూర్చుం డఁబెట్టుకొని, మీనాయన యవివేకుండై క్రిందు మీదెఱుంగక సచరించుట వలన నింత జరిగినది. నీవించు కంతయు భయం బంద వలదు. శోకంబు జగించుము. నిరాజ్యంబునకు నిన్ను పట్టాభిషిక్తునిఁ గా నొనర్చెద. ఎల్లపుడు నిన్నుఁగంటికి ఱెప్పలా గునఁగాపాడు చుండెదనని సముచి తోక్తుల నతని శోకభారం బును కొంతవరకుఁదగ్గించి, దారిలోనికిఁ దీసికొనివచ్చెను.

అనంతరము పతి గతించినందులకుఁ జింతించుచు మీా

దుమిక్కిలి యవమానంబు కూడఁదటస్థమగునేమో యని తలంచి, శోకవార్ధిని మునింగియున్న రాజపత్నుల నోదార్పఁడని తగిన చెలులఁ గొందఱి నంతఃపురంబునకుఁ బంపించి, దుఃఖంబును శాంతింపఁ జేయు విజ్ఞాన వాక్యంబులు కొన్నివారలచేఁ జెప్పించి, యించుక ధైర్యంబవలంబింపఁ జేసెను. పిమ్మట నితండు రెండు మూఁడు రోజులు నగరంబంతయుఁబరిభ్రమించి, పౌరులకుత్సాహకరవాక్యంబులఁ జెప్పి, యాలమటవాపి గోపాలరావునకుఁ బట్టాభిషేకంబొనరించి, చెరసాలనుంచఁబడిన మల్లికార్జునుని విడిపించుకొని, కలభాషిణితో సహా సపరివార సన్నాహంబును దోడ్కొని, తత్పురంబు వీడ్కొని, తమనగర మార్గంబును బట్టి నడచుచుండెను. పాతూరి పురవాస్తవ్యులును గోపాల రావును, రాజ పత్నులును, వేంకటాద్రి నాయని సాహసౌదార్య ధైర్య గుణాదులు ప్రస్తుతింపుచుండిరి. ఆ రోజు భోజన సమయంబు వరకు నడచి నీటివసతిఁగల చోట విడిసి, భోజనాది కార్యకలాపంబులు నిర్వర్తించుకొని, ప్రయాణంబగు సమయంబున నొక్కండెవఁడో, రాజు సన్నిధి కేతెంచి నమస్కరించి, ప్రభూ? తమపట్నంబును దోచుకొనుటకై ఠాకరు తనబలంబులఁగూర్చుకొని, తమ రూరలేని సంగతివిని సత్వరంబున నేఁగుచున్నాఁడు. ఈదినంబు దయామున నా నదియొద్ద నాకెదురైనారు. మీరుసత్వరంబ వెళ్లిమీనగరంబును కాపాడుకొనుఁడని పల్కఁగా రాజు నీవెవండవు. వారు నాపట్నంబును దోచుకొనుట కేఁగుచున్నట్లు నీకెట్లు

తెలియవచ్చును. వినిపింపుమన నాతండిట్లనియె. స్వామీ నేను మీ గ్రామంబైన గుత్తావారి పాలెములో నివసించు రైతును. కార్యార్థమీ రాజమహేంద్ర నగరమునకుఁ బోవలయునని బయలుదేరి మార్గమునఁ బడి యానది సమీపమునకు వచ్చువరకు జాతర తీర్థమునకుఁ గొంచెము దూరమందుండిన మనుష్యుని కెట్టి ధ్వని వినఁబడునో యట్టి ధ్వని నాకు వినఁబడెను. అంతట నేనిట్లూహించితిని. ఈయరణ్యమధ్యమున నిట్టి ధ్వని వినబడుటకుఁగారణ మేమి. ఆమాట్లాడు వారెవరో బందిపోటు దొంగలై యుండవచ్చును. వారికంటఁ బడిన నపాయంబు వాటిల్లునని భయంపడి చిక్కగా సూర్యరశ్మియైనఁ జొచ్చుటకు వలనుగాక యల్లుకొని యున్న యేటియొడ్డు గుంపుపొద నొక్కంట దాఁగితిని. తర్వాత నాగుంపెల్ల నేటిగట్టెక్కి వారిలో వారిట్లు మాట్లాడుకొన నారంభించిరి.

మనలంబాడి దొంగలకు నాయకుఁడైన ఝూతాకగు తెలివి నెంతయని చెప్పవలె. మన చెలికాండ్రైన చెంచుల నాతండు నరికించెనని భీతిఁగొనని వాఁడై యారాజు పురంబున లేని యాదనుఁగనిపెట్టి నగరంబును దోచుకొని వచ్చుటకు ససైన్యముగా నేఁగుచున్నాడు. ఈరోజున మనము నిర్భయంబుగాఁ బురంబును కొల్లగొట్టి, కోశాగారంబు బ్రద్దలుగొట్టి, మోయఁగలిఁగినంత ధనంబును మూటలు గట్టుకొని, రావచ్చునని యుత్సాహపూరితులై ససంభ్రమ మానసులై కూతవెట్టు దూరము వరకు దారి క్రిక్కిరియ నడచు చుండిరి.

వాండ్లందఱు దాటి వెళ్లిన తరువాత నేనా పొదనుండి లేచి, ప్రాణములఁ దక్కించుకొని, రాజుగారు నగరంబున లేని సమయంబుఁ గనిపెట్టి, యీపాపాత్ములు నగరంబును దోచుకొన వెళ్లుచున్నారు. పురవాస్తవ్యుల నెట్టి యిక్కట్టుల పాలొనరింతురో యని చింతించుచు వచ్చుచుండ భాగ్యవశంబున దేవరవారి దర్శనంబబ్బెనని యాతండు సయుక్తికంబుగాఁ దెల్పవిని మహీపాలుండు తక్కుంగల సైన్యంబుతోఁ గలభాషిణిని తోడ్కొని భద్రముగా రండని సైన్యాధిప యుక్తముగా నగర సంరక్షణార్థము ముందు వెడలి పోయెను. శేషించిన సైన్యంబు కలభాషిణిని తోడ్కొని నడచుచుండ సాయంత్రి సమయంబునకు ముందులెక్కకు మిక్కుటమైన తురుష్కులతోఁ గూడిన, లంబాడి దండు వారల చుట్టుముట్టుకొనెను. వారలప్పుడు వలలోఁ జిక్కిన చేపల మాదిరి సైన్యమధ్యంబునఁ జిక్కియు, ధైర్యంబులు వదలని వారై, మా ప్రభుండైన వేంకటాద్రి నాయండు వచ్చుచున్నాఁడు. మీరలెవరో ప్రాణంబులఁ గాపాడుకొనఁదలఁచితి రేని యామృత్యువు బారిఁబడకతొలఁగి పొండు. కన్నుమిన్నుఁగానక సంచరింపకుఁడని బెదరించిరి, కాని వారు కృత్రిమోపాయంబుఁ బన్ని యొకనిచేత దొంగవర్తమాన మంపించి, రాజును ముందునడిపించిన వంచకులాటచే నించుకంతయుఁ జలింపక, మీరాజురాణీ-మీరాజును బుట్టించిన యజ మహారాజు రాణీ-మిమ్ముల రెక్కలు విఱచి యీచెట్లు కంటఁగట్టి, కలభాషిణినిఁగొని పోవుట నిక్కువము. ఇంక నెచ్చటికేఁగెదరని పిచ్చుపెరిగి తుచ్ఛవాక్యంబు లుచ్ఛరించుచు విచ్చలవిడిఁ పైఁబడి యొక్కవైపు నుంచి, యొక్కొ

క్కని చెక్కలు విఱచి కట్ట నారంభించిరి. వారలును పాలివోని శౌర్యంబుతోఁ గలభాషిణిని కాపాడుకొనుచుఁ గొంతదవ్వు పోరాడిచూచిరి. కానియొక్కొక్కనికిపదుగురుపదుగురుగలిసిన నెంతవరకసు పోరాడుదురు. పాపమా కలభాషిణి కింకను కష్టపురోజులు తప్పినవి కావు. రత్నమును సానఁబట్టినఁగాని తద్రుచులు జగద్విదితంబులు గానట్లులు చందనపు చెక్కనఱుగఁ దీసినఁగాని సువాసనలు దిక్కుల వ్యాపింప నటులు విధి పతివ్రతా శిరోమణుల నలయించి, దుఃఖవారాసుల ముంచి, సుస్వభావ రత్నంబుల బయలు పఱచి, వాటి విలువనెల్లఱకు విశదీకరించు చుండును. తుద కమరావతీ నగరేశ్వరుని బలంబు రాక్షసతుల్యులైన లంబాడి తురుష్క సైన్యంబులచే విఱిచి వృక్షంబుల కంటఁగట్టఁబడి, శచీసమాన యగు కలభాషిణి నాక్రూరులచేతఁ బెట్టిరి. అప్పట్లు కలభాషిణి మనం బెట్లుండె నని చెప్పవలయు. లోకమాత యగు సీతాదేవి రావణునిచేఁ జిక్కి నప్పుడెట్లుండెనో యట్లుండెను. ఆపెఁగడ నొకకష్టసముద్రంబు నీదిన దగుటచే మునుపటివలె వివశాత్మ గాక కొంచెము ధైర్యంబవలంబించి, తనసత్ప్రవర్తన యే తనకు రక్షయని నమ్మి వాండ్లచే కొనిరాఁబడిన పాపపు శిబిక నధిరోహించి నదాయెను. అంతట నల్వురు దృఢకాయులా శిబికను మోసికొని పోవుచుండ నద్దాని వెనువెంట లంబాడి తురుష్క సైన్యంబులు నడచు చుండెను. ఇట్లు నడచి మరునాడు రెండుజాములకు మీర్ఖాసిమ్‌పేటఁ జొచ్చిరి.

---



# వేంకటాద్రినాయఁడు

## తృతీయోల్లాసము.

చేతులు వెనుకకు విఱిచి యేపినారచేఁ జెట్లకంటఁగట్టఁబడిన మహారాజ సైన్యము దుర్గతి నేమన నగు. ఆయా వృక్షంబుల నావరించి యున్న పిపీలికాదులు దేహంబును తొలిచి, రక్తపానంబు జేయుచుండినను కదలమెదల వీలులేక పరమేశ్వరా! పూర్వజన్మంబున మేమెంతటి పాపంబు లొనర్చియుంటి మని ఘోరముగా నిట్లు హింసింపఁ జేయుచుంటివి, హరిహరీ! ఈబాధ కెట్లోర్వనగు. మహారాజునకు బంట్లమై, యనివార్య పరాక్రమ వంతులమై, బుద్ధిశాలురమైన, మేమిట్లు తుచ్ఛ పిపీలికాదుల కుఁజిక్కి బాధనొందెద మని కలనైనఁ దలంపమైతిమే జగద్రక్షకా! నీమాయ యనంతము గదా? మమ్మీ బంధనంబుల నుండి తొలగింప సమర్థుండ విప్పట్లు నీవొక్కరుండవు కాక యన్యులు గలరే దీన జనావనా! ఆపదుద్ధారకా! కృపాకరా! రక్షించు రక్షించు మని మొఱలు వెట్టుచుండ భగవంతుండే రూపంబున నద్దీనుల గోడువినవచ్చి నాఁడేమో యన నొకపురుషుండు వారలకు సాక్షాత్కరించె. అంతట వారా

తురంబున మహాత్మా! రమ్మా మమ్ము బంధవిముక్తులఁ గావించి పున్నెంబుఁగట్టు కొమ్మాయని ప్రార్థించిన నాతండొకరిద్దఱికట్లు విప్పి, ఘోరబాధ మాన్ప వారలు తత్క్షణంబునఁ దక్కుంగల వారింగూడ బంధవిముక్తులఁ గావించిరి. అత్తఱి వారలా మహానుభావుని రాకచే తన్నరక కూపంబునుండి విడివడి సందులకెంతయు సంతోష సాగరంబున మునింగి తేలుచు, నప్పురుషాగ్రగణ్యుంగాంచి యిట్లనిరి. అయ్యా! తమరెవ్వరు. ఎందుండి యెచ్చటికేఁగుచు మాక్లేశమువాపి సముద్ధరించితిరి. మమ్ము క్రూరులగు లంబాడీలుఁ దురుష్కులుఁ గూడి, యిక్కానసంబున నిట్టి వెతల పాలొనరించి యేఁగిరి. మా మహారాజు కార్యార్థమై ముందరుగుటచే మాప్రారబ్ధమిట్లు కట్టికుడిపినది. మీయనుగ్రహంబున నిప్పటివరకు సజీవులమై యుంటిమి. తమరేకాంతంబున యీదుర్గమారణ్యమునకెట్లు రాఁగల్గితిరి. విశదముగాఁదమ వృత్తాంతంబు నెఱింగించి మమ్మానందింపఁ జేయుఁడని పల్కినవాతండు నేను విప్రుండ. ఒక రహస్యంపు బనిమీఁద నిముందటి పల్లెకరుగు చున్నాఁడ. మాగ్రామ మిచ్చటికిఁ జాలదూరము. నేనిల్లు విడిచినాల్గయిదు రోజులైనది. ఈరోజు సూర్యాస్తమయ సమయంబున నీయడవి బాటనొక వ్యాఘ్రంబు నన్నువెంబడించి, తరుముకొన రానారంభించెను. నేనప్పుడు ప్రాణముల మీఁద యాసవదలినవాఁడనై సతీ సుతుల స్మరించుకొనుచుఁ గొంతదూరంబు వరకు శక్తినంతను కాళ్లయందుంచి పరువెత్తి యొక వటవృక్షంబుపై నెక్కితిని. యాచెట్టు క్రిందికి వచ్చి పులికొంతసేపు నిలువఁబడి, మీయార్త నాదంబుల వినిభయఁ

వడి యీచోప్పటుఁదొలంగి పోయెను. నేనును మీగోడాలకించిన వాఁడను గనుక నాబోటి దౌర్భాగ్యు లెవరో యిందు కుయ్యిడుచున్నారు. వారిని సమీపింతమని యెంచి, యీవృక్షంబును దిగి పరువిడుచు వచ్చితిని. మీధ్వని నుంచి నాప్రాణంబును, నారాకనుంచి మీప్రాణంబులును దక్కె. మీరెవరు? వేంకటాద్రి నాయని గారి సైనికులా? మీరాజేమి కారణంబున మిమ్ము వదలి ముందేగిన వాఁడాయెను. వినుపింపుఁడన నాసైనికులు తాము నగరంబు బయలుదేఱి, సూర్యనారాయణ రావును జయించి, కలభాషిణిని గొనివచ్చుచున్న సంగతిని రాజు ముందరుగుటకుఁగల కారణంబును లంబాడీలచే సంప్రాప్తమైన పరాభవంబును వినిపించిరి. అంతనా విప్రుండు లంబాడీలదుష్కృత్యమునకుఁబశ్చాత్తాపపడి మీరలనటఁ జెందిన వారైనను నిర్దయుఁడనై కార్యావసరంబునమఱికొంతపరిశ్రమ నియుచున్నాఁడ. నేనీచీకఁటిలో నొంటరి నరుగఁ జాలను. ఈయడవి దాటువరకు నాకు మీరు సహాయముగా వచ్చి పంపఁ గోరుచున్నాఁడ. నన్నుగ్రహించుఁడన నాసైనికులందఱు నెండు కట్టెలకు నిప్పంటించి, దివిటీల మాదిరిఁబట్టుకొని యావిప్రుని వెంట నాయరణ్యంబు దాటువరకు నడచిరి. అప్పటికి పదు నాలుగు గడియల ప్రొద్దు బోయెను. ఆరోజు కృష్ణపక్ష సప్తమియగుట వలన నప్పటికిఁ జంద్రోదయ మాయెను. ఆవిప్రుని మనంబు నావరించియున్న భయతమిస్రంబంతటఁ దొలంగి పోవ నతండు నాగమ్యస్థానము చేరువలోనికి వచ్చినది. ఆరణ్యంబును నిర్గమించితిమి. ఇఁక మీరరుగుడు. మీమేలు నేనాజన్మాంతము మఱువనన నాసైనికు లీకొంచెము దూరము

కూడ పంపించి యేవెళ్లుదుమని. యతని వెంటనే వెళ్లుచుండిరి. ఆమార్గంబునకుఁ గుడిపైపున మిక్కిలి యెత్తయినమంచెపైనెక్కి జొన్న చేనికి పంటల కావలిఁగాయుచున్న బోయ వాఁడొకఁడీ కొంఅవిదయ్యాముల మాదిరి వచ్చుచున్న సైన్యముఁగని, దివి టీలతో వచ్చుచున్న బందిపోటు దొంగలని భ్రాంతిఁజెంది. మంచెనుండి భూమిమీఁదికి యురుకు కాలిదారి నతివేగము నఁబ రువెత్తుచుండ కంటికొక కొయ్యదాకి గ్రుడ్డూడి క్రిందఁబడెను. వాఁడాకంటి నొకచేత బిగఁబట్టి బాధకోర్చి చచ్చి చెడికన్న లొట్ట బోను గమ్యస్థానంబుఁ జేరినాడు ఆనుసామెతను సార్థక పరచెను. వెఱ్ఱిపట్టిన వానిమాదిరి పరువెత్తి వచ్చిన యాబోయ వానిని బజారులోన సభఁదీర్చి యున్న సంఘంబులో నొకఁడద్ద కేమి రా యిటులనాత్రంబున వచ్చు చున్నావు. నక్కపోతులు పైఁబడ వచ్చినవా? యేమి ఇది గ్రామంబులే యిచ్చటికె రావులే భయంబుడుగు మన నాతండు "బందిబంది" యనెను. "బందిబంది" యేమిటిరా ? అడవిపంది తరుము కొని వచ్చె నదా యేమి ? యని గేలిఁజేసిరి. అప్పుడువాఁడుఅడవిపందిగాదు. ఇంకేమున్నదిబాబో యింతంతపొడుగుదీటీలు, అంతంతపొడుగు లాటీకఱ్ఱలు, బంది బంది బందిపోటు దొంగలు మన యూరికి వస్తున్నారయ్యో యని గుండె గ్రుద్దుకొనఁగా—నా సంఘం బంతయుఁగలవర పాటుతో లేచి, చెట్టులు పుట్టలెక్కి చూచి, యిండ్లనున్న సామానుల బావులలోఁ బడవేయు వారును, నగదు మూటల గోతులలో వేసి పూడ్చు వారును, బంగరు వస్తువుల కాయల చంకఁబెట్టికొని పొలము మీఁదఁబడి చలా యించు వారును, ఆలు బిడ్డలకౌఁగిలించుకొని యల్లాడు

వారును, తలుపుల గడుల బిగించుకొని భోషాణములలో వణ
గియుండు వారును, నై చీకాకు పడుచుండ వారల భాగ్యవశం
బున నా బందిపోటు దొంగలు గ్రామనమీపమునకు వచ్చి,
వెనుకకుఁ దిరిగి పోయిరి.

కన్నుపోఁగొట్టుకొని గ్రామంబంతయు నట్టుడికినట్టుడికించి
క్షోభఁబెట్టిన వాఁడాబోయవాఁడే గదా? నిజము నారయక
తొందరించి పనలోనరుప్పు నల్పమతులు తాముచెడి యితరు
లను గూడఁ జెఱచు చుందురు. ఇఁకసీబోయ వానికథ నిం
తటి తో విరమింతము. మోసకారి మాటలునమ్మి సైన్యాధిప
యుక్తముగా ముందేగిన వేంకటాద్రి నాయండు పురంబు
చేరి విచారింప నీబందిపోటుల యడావుడు లేవియుఁ గానరాక
పోవఁగా నెవ్వఁడో తన్ను మోసగించి నాఁడని గ్రహించి,
సైన్యాధిపతులఁ గొందఱ నా నగరంబుననే యుంచి, కొంత
మందితోఁ గూడి తిరిగి తమసైన్యమును గలిసి కొందమని
శీఘ్రయానంబున వచ్చుచుండెను. కొంతదూరంబువచ్చువరకుఁ
బతుల నెడఁబాసిన పతివ్రతామణుల చందంబున వన్నెఁదక్కి
విన్నదనంబు సూచించు మొగంబులతోఁ దమసైన్యము కన్నం
లఁబడి యెను.

అంత రాజు కలభాషిణి ముఖమనెడు చంద్రబింబంబు
లేని రాత్రిమాడ్కిఁ గనుపించుచున్న సైన్యంబును జూచి,నిరు
త్సాహ మతితో నిట్లు ప్రశ్నింప వారిట్లు దీనంబున నుత్తరము
జెప్పిరి.

రా-- కలభాషిణిరాకుండుటకుగతంబేమి! మీశరీరంబెల్లనీరీతి
నుడికిపొంగి యుండుటకు గతంబేమి?

సైని—స్వామీ! తమరు ముందుకు మిగిలిన రెండుఘడియ
లకుఁ దురుష్క సైన్యముతోఁ గూడిన లంబాడి సై
న్యంబు మమ్ము ముట్టడించి, చెట్లకు విఱిచి కట్టి, కల
భాషిణిం గొనిపోయిరి. ఆచెట్లనున్న చీమలు కఱచుటచే
మాశరీరము లిట్లు పొంగినవి.

రా—ఏమి? లంబాడీ మూకచే నిట్టి యవమానమును బొంది,
కలభాషిణిని విడిచితిరా? యాతురుష్క సైన్యమెవ్వ
నిదో గ్రహించితిరా!

సై—వారలసంఖ్యాకులై యొక్కొక్కనికిఁ బదుగురు పదు
గురు గలిసి బంధింప నేమియుఁ జేయలేక యనాథల
మైతిమి. ఆతురుష్క సైన్యంబెవ్వనిదో యెఱుంగఁ
గోరితిమి గాని బుద్ధిబలంబు లేని పశువుల మగుటచే
నప్పని సాధ్యమైనది కాదు.

రా—గడచిన దానికిఁ జింతించుట ధీరోదాత్త పురుష లక్ష
ణంబు గాదు. ఏగుదము రండని సైన్యంబును వెంట
బెట్టుకొని, యమరావతీ నగరంబున కేగెను.





# వేంకటాద్రినాయఁడు



## చతుర్థోల్లాసము.

కలభాషిణిని తననగరంబునకుఁ గొని వచ్చినాడను వార్తను చెవులపండువుగావిని, యమీర్ఖానుండు విలువగల దుస్తుల ధరించి, మాత్యములు స్థాపించిన షుల్లాయి నక్షత్రముల తోఁగూడిన యాకసంబు మాడ్కి శిరంబున వెలుంగఁ బాద రక్షలతో నీటుగ నొయ్యారంబు గులుక నడచుచు, నాపె పాదస్పర్శచే ంధూత మలినంబుగలదై పండువెన్నెల రీతిఁబా లగచ్చుచేఁ దెజరిల్లు రమ్యహర్మ్యంబు ప్రవేశించి, కలభాషిణీ సౌందర్య సముద్రంబునఁ దన నయన మీనంబులు ముంచి, యోలలాడించి, సౌఖ్య పరవశత్వంబున మేను మఱచి చిత్ర ప్రతిమ వలెఁ జూచుచుండెను.

అప్పుడు కలభాషిణి వాని దురాలోకనంబును గాంచి, మనో సంకల్పమును గ్రహించి, వీని నెటుల బొంకించి మానం బును కాపాడుకొందునా? యని యెంచి నిశ్చల బుద్ధియై యాలోచించుచుండెను. అప్పుడ య్యమీర్ఖానుండు మనంబున నిట్లని వితర్కింపఁ దొడంగె. వహ్వా! దీనికై యల్లాకెసా పుట్టిం

చాకురా? దీని యెుంటి చమక్ సేందీ వాళ్లుఅంగార్కి సరీగా తళ తళ లాడు చున్నై. దీని సూరత్ కి చాంద్ భీ బరాబర్ గాదు. ఇదినాకి యిన్ కారు చేస్తే మైకైసా బతకాల. దీస్కి చూస్తే మేరేపర్ మొహబ్బతువుంది తోస్తుంది. మైహుజారు వున్నాను చెప్పి దీన్కి సమఝాయించి, మేరా జేబ్ మే తీస్కో వాల. దీన్కి యిస్వఖ్తు కైసా వల్కరించు కోవాల. మేరేకు మాలుమ్ నై కైసా? అని యోచించి, కంచెన్కి పైసా యిస్తా ము చెప్తే ఖుషీ అవుతుంది. అందుకని మేరా దేసంమే షగ ము యిస్తాస్ చెప్తా. అని కలభాషిణిం జూచి, ఆయ్కంచె నీ్కి నివ్ చాలా నసీబువాలా వున్నావు. మేరేకు నిగాచేస్కో. సిక్కే హామారా దేషంమే షగందేషం యిచ్కోంటా! అన నక్కల భాషిణి యాతురుషాగ్రణితో రాజచంద్రమా! మీరునగము దేశమిచ్చెద రంటి రెందుకు. మిమ్ము చేపట్టిన మీదేశంబంత యు నాదికాదా? మీరు మావారు కారా? మీరే నేను. నేనే మీరు. కాని రెండు మాసముల వరకు మీరు నన్ను ముట్టం గూడ దెందు కంటురా? తొమ్మిదవ సంవత్సరమందు మాతల్లి నాకొక నోముఁబట్టించి యున్నది. దాని నింతవరకుఁ దీర్చుకొన లేదు. ఆనోము నకును దీనికిని సంబంధ మేమందురా? ఆనోము తీరక ముందు పురుషుని గనుక ముట్టినట్లయిన నీతల పగిలి చచ్చిపోదువని చెప్పె. చిన్నతనమగుటచే వివేకంబుజాలక యట్టి దుర్ఘటమైన నోమును పట్టితి. ఆనోమును యేబదితొ మ్మిది రోజులవరకు నోమి యరువది యవ రోజున వేయి బం గారపు సుమ్మడి కాయలు పుణ్యాత్ములకు ధారా పూర్వకం బుగా నొసంగ వలె. నీనోమును తీర్చుటకు మాతల్లికి శక్తి లే

కంఠకటచే వేంకటాద్రి నాయఁ మహీపాలుఁడు నోముఁదీర్పించి చేపట్టుఁడు నని కబురంప నాతని కడకేరుగు చుండనమమ సూర్యనారాయణరావు చెంచులచేఁబట్టి తెప్పించి, కష్టంబుల పాల్పఱచి, తుదకుఁ దన దోషంబునఁ దానశించెను. మీకు శక్తి గలదేని నానోమును తీర్పించి నన్ను చేపట్టుఁడు. మీకిన్ని రోజులు గడువుఁబెట్టి శ్రమ గల్పించితి నని యెంచకుఁడు. అనివినయముతో నమస్కార పూర్వకము గా విన్నవించిన నయ్యమీరుఖానుండు వికసిత ముఖ పద్ముండై కైసా? నాకీ బుటలోఁ బెట్టెటాన్కి చూస్తున్నావ్. చెంచు ల్నికీ యంటోక్కుండా కైసా తీసుకపోయ్యార్ నవ్ కైసా పొయ్యావ్ యుంటూ మాటలు చేస్కో వద్దు. నీకీ మంచిది కాద్. అన నక్కలభాషిణి తురుష్కాధిపా! నే నబద్ధము జెప్పుట లేదు. నేనఁ స్మృతిఁదప్పివడియుండ వారు నన్ను ముట్టినను మోసంబు వాటిల్లినది కాదు. నాబుద్ధి పూర్వకముగా నే ముట్టఁగూడదు. అట్లు గాదందురా మీకరంబు గ్రహించి ప్రాణంబుల విడనాడెద. నమ్మతించితి రా? అని భయపెట్ట నాతండు సంశయాకుల మానసుండై దీనిమాటలు నిజము వాలా తోస్తుంది. దీని నోమ్‌కి తీర్చి నిగా చేస్కొంటె అచ్ఛా వుంది. అనఁ కొనియాపెం జూచి, నివ్ నోము యీరోజు నుంచి మొదల్పెట్టు. నీకీ కావలసిన వస్తువుల్ మైపంపిస్తాన్. అని యమ్మానిని సెలవుఁగైకొని, తన నివాస మందిరంబున కేఁగెను, తరువాత లంకాణీ సైన్యమునకు నాయకుండైన ఠాకరును తన వద్దకుఁ బిలిపించుకొని యాతని వజ్జాతి శయముఁగొని యాడి, మధుమాంసాదులచే నతనికి నతని సైన్యంబునకు విందుఁగావించి,

కట్నంబు లొసంగి తన నగరంబున నుంచుకొని పోషించు చుండెను. కలభాషిణి కొన్ని పరికరంబులఁ దెప్పించుకొని, నోము నోచుకొను దానివలె నటించుచుండెను. అచ్చట వేంకటాద్రి నాయండు పురంబున కేగి, కార్యాలోచన మందిరంబున సింహాసనంబు నధిష్ఠించి, మంత్రుల రావించి, తత్కథ వినుపింప రాజ మంత్రుల కిట్లు సంభాషణ జరిగెను.

రా—లంబాడి సైన్యమునకు బాసటగాఁ దన సైన్యము నంపి, కలభాషిణిని గొని పోయిన తురుష్కుండెవఁడో మీరు గ్రహింపఁగల్గితిరా?

మం—లంబాడీలకు నాయకుండైన తాకరునకు మీర్ఖాసిమ్ పేటను పరిపాలించు తురుష్కుండు స్నేహితుఁడని వింటిమి. ఆతండిట్టి కార్యంబు లొనర్చుట కించుకంతయు సందియంబు లేదు. తురుష్కులలోఁ గూడ నట్టి పాపాత్ముండిది వరకుఁ బుట్టి యుండలేదు, అతని చైదమని యే తోఁచెడిని.

రా—అట్లైన జాడలు గని పెట్టి కార్యము సాధనము లోనికిఁ దీసికొని వచ్చుటకు మన మెవరినిఁ బంపించుదము. సరిగా నాలోచించి నిర్ధారణఁ జేయుఁడు.

మం—మనమింతకుఁ బూర్వము పాతూరి పట్టణంబునకుఁ బంపిన యోధుల నలుగురినే బంపించిన వారలవలీలగా గట్టెక్కించుకొని వచ్చెదరు.

అన రాజా నలుగురి యోధులం బిలిచి, భవిష్యత్కార్యక్రమంబును మంత్రులచే నుపదేశింపఁ జేసి, నానా వేషపు దుస్తుల వారి కొసఁగి, మీర్ఖాసిమ్ పేటకేగుఁడని

సెలవిచ్చెను. అంతట వార లొకటి రెండు రోజులు నడచి, సామీప్యమునకు వెళ్లి, వర్తక వేషంబులు దాల్చి, పురంబు లోనికిఁ బ్రవేశించి, మేము బస జేయుటకుఁ దగిన కోమటిం డ్లెక్కడ నని యడుగ నొక్కండీ యూరిలో నొక కోమటిమాత్రము డబ్బెక్కువ దీసికొని నప్పటికి, భోజనము మంచిగాఁ బెట్టి మర్యాదఁ జేయును. అతని పేరు రంగయ్య. కోమటి రంగయ్య యిల్లెక్కడ నని యడుగుచు వెళ్లి, యచ్చటబస చేయుఁడని పల్కిన వారలట్లు జేసిరి. వీరా రంగయ్య యింటికి వెళ్లు వరకొక బంట్రోతు మాత్ర ముప్పు పప్పుసరిగా నివ్వ లేదని, రంగయ్యను ముచ్చుఁ దీసికొని కొట్టుచుండనింటి పెంకు లెగిరి పోవునట్లు బొంగురు గొంతుతోఁ గొట్టెదవా! కొట్టెదవా! యని గద్దించుచు, ముచ్చు దెబ్బ లన్యులకు వినఁబడ కుండఁజేయు చుండెను.

ఈ వ్యాపారస్థులఁ జూచి రంగయ్య మానంబును గాపాడుకొనుటకై చూచినా రండి, ఈ బంట్రోతు లన్యాయముగా నింటిలో లేని వసువు లిమ్మని కొట్ట వచ్చు చున్నారు. కొట్టిన ట్లయితే నీపాటి కీండ్ల పాటును గనుపర్చెదును. కాని యెన్ని వస్తువులని వెలలేకుండ పీండ్లపిండా కూడు మీఁద బెట్టి ధారఁబోయుదు నండీ! మా తాత తండ్రు లిచ్చటఁ బుట్టి పెరిగి నారని యీదౌర్భాగ్యపు టూరిలోఁ బసి యేడ్వడమే గాని యేమున్నదండీ! మీబోటిమహారాజు లెవరైనరావలె. నొక పైసా నివ్వవలె. ఈ యూరిలో నీళ్లు దప్ప మరేమియు లేవు నరే కదా! యెక్కడనో సంపాదించు కొన్నవి కూడ వీండ్లకే సమర్పించి, యెన్నాళ్లు జీవించు చుందుమండీ. అని గొణుగు

కొనుచు మఱలఁ గొట్టునేమో యను భయంబున వాండ్లకిచ్చిన వస్తువుల నెల్లనిచ్చి పంపించి, తనుదే గ్రామము నాయనా! భోజనమునకు వచ్చినారా! యని మర్యాదఁ జేసి వారి యుదేశమును గని పెట్టి, ఒసే మనవారు నల్గురు మనయింటికి భోజనమునకు వచ్చినారు. కాళ్లకు నీళ్ళు దెచ్చి యివ్వవే యని భార్యను కేకవేయుగా నాపె చెంబులతో నీళ్ళు దెచ్చి వారికిచ్చెను. వారు కాళ్ళు గడుగుకొని వచ్చేవరకుఁ దాటియాకుల చాప పఱచి యుండ దానిపైఁ గూర్చుండి, రంగయ్యా! నీవు న్యాయము గాని డబ్బెంతయుఁ దీసికొనినను శాక పాకములు సరిగాఁ జేయించి పెట్టు మేము భోంచెయ్య లేము. అనరంగయ్య తీసికొనే డబ్బు తీసికొని కడుపులు కాల్చేవాఁడను గానండి. నేనొక డబ్బెక్కువ తీసికొంటునే గాని షడ్రసోపేతముగా భోజనంబు పెట్టుదును. మీరు భోంచేసి చూచి "సెబాస్" అంటే నేనవి సెలపెయ్యిల గోసుకొని తినే తురకవాండ్ల లోఁబడి యుంటున్నామనిమీరనుకొంటున్నారేమో గాని పాపమంటే బహు జడుస్తామండి. మాయింటికి వచ్చిన వారు మా పిల్లలతో సమానము గారటండి. అని మాటలతో మర్యాదఁ జేసి వంట తయారైన వెనుకఁ దృప్తిగా నారగింపఁ జేసి, సంతోష పఱచి యింత రాత్రివేళ మీరేయింటి కేఁగుదురు. ఈ జంపకానాలు పుచ్చుకొని, యీ బల్లల మీఁద వేసుకొని పడుకోండి. యని జంపకానాలు చూపించిన నావ్యాపారస్థులు వాటిని బల్లలపైఁ బఱచుకొని పరుండిరి.

వారికి దగ్గరగా నులక మంచము పైఁబైపంచఁ బఱచుకొని రంగయ్య పరుండెను. పాపమా రంగయ్య తాలతం

ద్రులు భోగ భాగ్యంబులతోఁ దుల దూగిన వారైనను, యి తని కట్టి మహార్దశ లేదు. వ్యాపారంబున గొప్ప గొప్ప దండు గలు వచ్చుట వలన నితఁడు పెద్దవాఁడయ్యె వరకు నిల్ల య్యా వారి ముంగిలాయెను. ఇతనికిఁ బదు నాలవయేటఁ బెండ్లి యైనది. ఇరువది యవ యేట భార్య కాపురమునకు వచ్చినది. దరిద్రునకు బిల్లలెక్కువ యనుటకుఁ దార్కాణముగా నీరంగ య్యకు మీఁదటఁ బది సంవత్సరములలో నేడెనిమిది మంది పిల్లకాయలు గూడఁ గల్గిరి. దరిద్రముతో నింత సంసార భార మును మోయుట కష్టము గదా? అప్పుడు పెద్ద బేరములు చేసి సతీ సుతులఁ బోషించుటకు శక్తి లేనివాఁడై, చిల్లర దుకాణ ము పెట్టుకొని దాని లాభముతో జీవనము జరుగక పోగా దాని కిఁ దోడు పూఁట కూళ్లనుఁ గూడఁ బెట్టి, పైసా సంపాదించు కొని, కాల మొక్క రీతి గడుపుకొను చుండెను. ఇతండు భా గ్యవంతునిగర్భ వాగ మందునఁ బుట్టి, బీదవాఁడై సుఖా సుఖంబుల నెఱింగి యున్నవాఁడు కావున పూఁట కూళ్లలో విస్తారపు డబ్బు మిగుల్చుకొని కడుపులు గాల్చక వారలను తృప్తి పఱచి, స్వల్ప లాభముతోఁ దానునుజీవనము చేయుచుండెను.

ఇఁక నితని చరిత్రనిటుండ నిచ్చి కథా భాగము నెత్తి కొందము. వ్యాపారస్థులు తమకు దగ్గిరిగాఁ బరుండియున్న రంగయ్య నడిగి యీపై విధముగా నున్న యాతని స్థితినిఁ దెలి సికొని, మీ రాజెట్టి ప్రవర్తనము గలవాఁడు. మీబోటి బీద లకేమైన సహాయంబు చేయునా? ధర్మ పరిపాలనా సక్తుఁడే నా? యని ప్రశ్నించిన వానిపేరు నిట్టి చల్లని వేళఁ దలపకుఁడని జవాబు చెప్పెను. అంతట వారు రాజు ప్రవర్తన యందితని

కయిష్ట ముండు కోటిఁగి, యాతని చరిత్రంబును కొంత మాకు వినిపించెదరా? యనిరి. అప్పుడు రంగయ్య యిట్లు చెప్ప నారంభించెను. మారాజు ప్రత్యక్ష రాక్షసు లైన తురుష్కుల కగ్రగణ్యుండు. దుష్టజనులకుఁ దుష్టిగా భోజనంబు బెట్టి సష్టవకుండఁగాపాడు వాఁడు. ధార్మికుల కర్మ మర్మంబుల నిర్మూలించు వాఁడు. పంచబాణుని పంచమ శరసదృశలైన కన్యల బలిమిని దెప్పించి చేపట్టు వాఁడు. కల్లకుఁబుట్టినిల్లు. వాని దౌష్ట్యంబుల నెన్నింటినని చెప్పుదు. వాని వర్తమాన కాలపుఁజరిత్ర వినుపించెద. వినుండు. లంబాడి దొంగలకు బాసటగాఁదమ సైన్యమును బంపింది, యేడెనిమిది రోజుల క్రిందట నొక్క కాంతా రత్నంబును బల్మిని దెప్పించి, తన మందిరంబున నొక్కచోట నుంచి యున్నాఁడు. తనకా కాంతను తెచ్చి యిచ్చి నందులకుఁగాను కృతజ్ఞతగా నాలంబాడి గుంపు నీనగరంబునఁ బెట్టుకొని, విందులు సేయించు చున్నాఁడు. రాజట్టి వాఁడైన మాబోటుల కేపాటి సౌఖ్యంబుండునో చెప్పనవసరము లేదు గదా? దుర్మార్గులకే యెప్పటనైన దైవము బాసటగా నుండునని తోచుచున్నదన నావ్యారస్థులాకన్నియ మీరాజోత్తమును చేపట్టిన దాయనిరి.

అంతట రంగయ్య చేపట్టకేమి చేయునండి. పాపము ముప్పతిప్పలు పెట్టుచుండ నెంతదనుక నని యోర్వఁగల దండి. ఈపె మాత్ర మొక నోమున్నదని రెండునెలలు గడుపుఁబెట్టి నోచుకొను చున్నదఁట. నోమున కంత్యంబైన యిరువదియవ దినంబున వేయి బంగారపు గుమ్మడి కాయలు పుణ్యాత్ములకు దానంబు జేసి, మరుసటి దినంబున నీరాజును

నిగా చేసుకొనునఁట ఈ ముండాకొడుకు తాత తండ్రులనాటి నుంచి నిల్వజేసిన ధనరాసి నాదినంబుతో నాశనంబుఁ జేయ దలచుకొన్నాడు వీడు చచ్చిపోయినను బాగుండునండి. సుఖముగా జీవింతము అని దీనత్వముతో బల్కఁగా నావ్యాపారస్థులిట్టి దుర్మార్గుండు మఱిన్ని రోజులు బ్రతుకఁడు లేపయ్యా? భగవంతుడు చూచుచునే యుండునని పలికి, నిద్రాదేవతచే నావరింపబడిరి. రంగయ్య కూడ వెంటనే నిద్రించెను. వ్యాపారస్థులు వేకువనే లేచి కాల్య కృత్యంబుల నిర్వర్తించికొని, వూటకూళి డబ్బు లెక్కువగానిచ్చి రంగయ్యను సంతోషపఱచి, మేమోరు గంటికి వెళ్లవలయునని తన్నగరంబు వీడ్కొనిరి.





# వేంకటాద్రి నాయఁడు.

## పంచమోల్లాసము.

ఆమీాగ్ఖానుండు కలభాషిణి కోరిన వస్తువులనెల్ల నామెనకుఁ బంపించుచు బంగారపు గుమ్మడికాయలు తయారు చేయుటకుఁ గంసాలీలను బిలిపించి, బొక్కసమందుంచిన ధనంబంతను హైదరాబాదునకు బంపించి బంగారము తెప్పించి వేయి గుమ్మడి కాయలు తయారుచేయుమని వాండ్ల పరంబు జేసి, పెద్ద గుమ్మడి కాయ నొక దానిని నమోనా యిచ్చెను, వారలు పని ప్రారంభించి చేయు చుండిరి. రాజాజ్ఞను నగరం బెల్ల శోభాయమానంబుగా నలంకరింపు చుండిరి. రాజు తా నాహ్వారితుండై రోజు కొకసారి చంద్ర దర్శనంబునకు బదులుగాఁ గలభాషిణి ముఖ చంద్ర దర్శనం బొనరింపుచుచు, నానంద వార్ధిని దేలుచుండ నొకనాడు ఫకీర్ సాహెబొక్కండు హఠాత్తుగా రాజ మందిరంబు ప్రవేశించి, రాజునకుఁ గన్నుల పండువొనరించెను.

అప్పుడు రాజు కుర్చీ దిగి సలాము చేసి, తురకముతోఁ దము రెచ్చట నుండి వచ్చుచున్నారని నీలిండాదిలాబాదు నుంచి, తమ దర్శనార్థమే వచ్చి తిననియెను.

అప్పుడు రాజుతిమబోటి ఘనులు మాంబోల్ల గృహం బులకు నిష్కారణంబుగా దయచేయుట మాపూర్వ పుణ్య సుకృత పరిపాకంబని యెంచుకొనవలె. మిమ్ము దర్శించిన



నామనంబునకు భగవద్దర్శనంబున లభించు సంతోషము గల్గుచున్నది. మీరు రెండు రోజులు మాయింటనుండి, మాచేయు మర్యాదల నానందంబుతో స్వీకరించి మమ్ము ధన్యులఁ జేయవలయుననిన నప్పకీరు నేనొక చోట నుండుటకు వలను పడదు. మన తురుష్క రాష్ట్రంబు నంతను పరిభ్రమించుచు ఖురాన్ బోధించి, ప్రజల ధర్మ మార్గాను గాముల గాలించి, భగవంతుని దయకుఁ బాత్రులఁ గావలయు. నేనొక విషయంబు నీ కెఱింగించుటవసరంబుగాన నిచ్చటి కేతెంచితి వినుము. అస్మద్దివ్య దృష్టిచే జూచి, నీవు గొని వచ్చిన కలభాషిణి విషయములో భూత భవిష్య ద్వర్తమాన సంగతుల నెఱింగించెద.

నీవొక మాసము రోజులక్రింద టలంబాడీసైన్యమునకు నీసైన్యము బాసటగా నంపి, వేంకటాద్రినాయఁడు గొనిపోవుచున్న కలభాషిణిని, దెప్పించి, నీమందిరంబున నుంచుకొన్నావు. అది రెండు నెలలు నోము నోచుకొన వలయునని చెప్పి, నిన్ను చేపట్టలేదు. దాని నోమునకుఁ గావలసిన వస్తువుల నన్నిఁటిని సప్లయి చేయుచు వేయిబంగారపు గుమ్మడి కాయలను కూడఁ జేయించి పుణ్యాత్ములకు, దాన మిప్పించి నీనోము దీర్చెదనని వాగ్దత్తమిచ్చి యున్నావు. నీవు నోమును తీర్పించు మాట నిజమే. అది నిన్ను పరిగ్రహించు మాట నిజమే. కాని ఊలంబాడీలను మాత్రము నీనగరంబున నుంచుకొన వద్దు లంబాడీలకు నాయకుండైన ఠాకరు బహుకృతఘ్నుండు. వాఁడు వేంకటాద్రినాయని మీఁద నుండిన కక్షచే దానిని తీసికొని

వచ్చి, నీకు సమర్పించి నాదేశాని, నీమీఁది ప్రేమ వలనగాదు;
ఒకనిదర్శనము జూచుకొనుటకు నీవిన్ని రోజులనుండి తుష్టిగా
భోజనంబు పెట్టి సాకుచున్నందుకుఁ గృతజ్ఞతా సూచకముగా
నీవు కోరియున్న కలభాషిణినే తానును కోరి, ప్రయత్నము
లొనరించుచున్నాడు. తాన మేలుకొని జాగ్రత్తగా వర్తిం
చుచు. నేనేగుచున్నాడనని పోఁబోవు వానివలె నటించిన
నతురుష్కాధిపుండు పాదములఁ బట్టుకొని, నాకీ సందేహాని
వృత్తి యగువరకు మీరిచ్చటనే యుండవలయునని ప్రార్థిం
చిన నతండెట్టకేలకు నొడంబడియె. అప్పుడు రాజు అల్లా
సాహెబ్, ఠాకరును నేను చిన్నప్పటి నుండి యెఱుఁగుదును
అతండు నాబహిఃప్రాణము. మిక్కిలి బుద్ధిఁగలవాఁడు. వినయ
వివేకాదులు గల్గి చిన్న పెద్ద తారతమ్యము లెఱిఁగినవాఁడు.
అతండిట్టి యవివేక కార్యంబొనర్చుచుండు నని నేనమ్మఁజాల.
మీరే పొరపడి యుండ వచ్చును.

అంతట ఫకీరు సాహెబు రాజ చంద్రమా! నీకీయను
మానంబు దీర్చవలయునా? మంగళ వారంజెప్పెదను. ఎల్లుండా
యెల్లుండి రాత్రి రెండుఝాముల పొద్దు వోయిన తరువాత
నీవొక్కండవే నావెంటరమ్ము. కలభాషిణి మందిరము ముందు
ఠాకరునుని జూపించెదను. నీవు మాత్రమీ రెండు రోజులీ
రహస్యంబు నీగర్భ గోళమందే దాచి యుంచుమని చెప్పగా
రాజాశ్చర్య మానసుండై ఫకీరు సాహెబు నాదేశంబు నను
సరించి, యాతని నుచితరీతి నుపచరించుచు నా రెండు రోజులు
గడపి మంగళవారము నాటి రాత్రి పదిరెండు ఘంటలకు రాజ
ఫకీరు లిర్వురు కలభాషిణి మందిరము కడ కరిగిరి. వీరరుగు

వీరరుగు నప్పటి కొక్క పురుషుండు నొక్క యువతీమణియు నామందిరము గుమ్మము ప్రక్క రాయితో గట్టి గచ్చుఁ జేయఁబడియున్న వేదికపైఁ గూర్చుండి, మొగములో మొగముపెట్టి గుస గుస ముచ్చటించు కొనుచుండిరి. ఫకీరు రాజు వీరలను గుర్తించవలయునని మెల్ల మెల్లగా నడచి, వీరల సమీపించు వరకు బురుషుండు లేచి మహాభయంబుతో పారిపోయెను. స్త్రీ కలభాషిణి మందిరంబుఁ జొచ్చెను. ఆ రోజు చైత్ర బహుళ సప్తమి యగుటచే జంద్రుండించు మించు సగము కళలతో నప్పటి కుదయాద్రిని నిర్గమించి గగన భాగంబు నలంకరించు చుండెను ఆ వెన్నెలలో నా స్త్రీ పురుష రూపంబుల రాజ ఫకీరులు సరిగా గుర్తుపట్టిరి.

అత్తరి ఫకీరు రాజుతో గ్రహించితివా? నీ ఠాకరు యొక్క దుశ్చేష్ట నన నాటకము స్వామీ? ఆ స్త్రీ కలభాషిణి కాదే దాని చెలికత్తె యని తోచినదే కలభాషిణి కొరకు వచ్చిన వాఁడైన చెలితో నేమిపని. చెలికొరకే వచ్చెనేమో నని నాకుఁదోచు చున్నది; అన ఫకీరు సాహెబా చెలిని బిలిచి యడుగుడు మీ సందేహ నివృత్తి యగునని యె. అంతట రాజా చెలిని, బిలిచి యిప్పుడీతోటి యిద్దమాటలు చేసుకొన్నా మన్ని యెవరు! యింత రాత్రి నీదగ్గిరికి యెందుకు వచ్చాడు బేగిచెప్పు. అన నాపె తలవంచి, మాట్లాడ పోగా రాజు నీకే భయం లేద్ నిజంచెప్పు. నీజాన్కి చెప్పకపోతే నీకే చంపేస్తా అని భయపెట్టిన నాపె ఠాకరు వచ్చి మాట్లాడినాడని గద్గద స్వరముతో విన్నవించెను. రాజంతట యేమీ మాటలు చేస్కొన్నాడు. అన నాపె యిట్లుజెప్పెను.

ఇక్కడ కయిదారు రోజులనుంచి వచ్చిపోతూ మీ నౌకరసానికి అని మాట్లాడ కుంటును. అది చూచి రాజు "షర్మాశేద్ షర్మాశేద్" చెప్పచెప్పిన యెట్లైన నాష్టం క్షేమగల్గించుము. నీకు కావలసిన పేర్లు కంటెలు వంటినిండ దిగ వేస్తాను, అంటూ ప్రతిమాలుకొన్నాడు. దానికి నేనునీకేమైన సాకదలు వచ్చినదా యేమి? యిట్టి బుద్ధులు బుట్టినవి అని తిట్టి వెళ్ళగొట్టుచుంటిని. యీ రాత్రి యింతకు ముందు పండుకొని యుండగా మావాడు వాడా? యీ కష్టపువంట నెట్లు భరించేది? యీ యవాంతా దిగిగిని ఒక్క పిండికూడ నింతమీద నేసిందివాడు. యీ క్రూరు తెగలుపుతీ తోన. యెక్కడనే వచ్చి ప్రాణాలు పోగొట్టుకుంటున్నాను. దేవుడో! అని యెంత కేక వినవచ్చినది. నేనంతట నింత యున్నను కూడ పట్టుకొని బయటికి వచ్చితిని. వైటికి వచ్చువరకు ప్రాణాలు పోతున్నవని మొరపెట్టు వాండరికివచ్చి, నా చేయి బట్టుక గుంజుకొని వచ్చి, యీ యరుగు మీందకు గూర్చుండం బెట్టి నా ప్రాణాలు నాలుంచి నావు కాదుగదా? అని గడ్డము పట్టుకొని ప్రతిమాల నారంభించినాడు. అప్పుడు మీరు వచ్చినారు. అని యచ్చట బడియున్న యన్నమునకు కూరను తన చేతిని రాజు గారికిం జూపించెను. అమీరుఖానుండంతట గోధారణిత నుండెను, యింటికి వెళ్ళి యీరాత్రిం గడిపి, మరునాడు తెల్లవారంగానె బుద్ధ సింహాసనంబు నధిష్ఠించి, ఠాకరును దోషోపి రయ్యని పిలపించిన, నౌకరు దూతయేగి. రాజుగారు పిలుచుచున్నారని చెప్పి, ఠాకరును దోషోపిని వచ్చెను. ఠాకను రాజునకు సలామ్ జేసి, నిస్సందేహముగా నెప్పటివలెనే చను

కొల్వు కూటంబున కేఁగి, యేక ముహూర్తంబున నందఱికి ప్రేతరాజ దర్శనంబుఁ జేయించెను. పిండ్లపాప మెట్టు కొండలు ముట్టఁబెఱిగి పైఁబడి నశింపఁజేసినదో చూచితిరా? ఠాకరు కలభాషిణిని దీసికొని వచ్చి యామందిరంబున దించిన రోజు మొదలుకొని యామార్గంబు నైన త్రొక్కి యెఱుంగఁడు. వేంకటాద్రి నాయుండు పంపించిన యోధ చతుష్టయములో నొక్కండు కలభాషిణి చెలికత్తియ రూపంబును, మఱొక్కండు ఠాకరు రూపంబును, మూఁడవ వాఁడు ఫకీరు వేషంబును దాల్చి, యీ పైని వచించిన రీతి నటించి, రాజున కాగ్రహంబు గల్గించి, లంబాడీలను ఠాకరును జంపించిరి. ఫకీరుసాహెబు బయ్యామీరు ఖానుని కడ సెలవు దీసికొని వెళ్ళిపోయెను. నాల్గవ యోధుండు మాత్ర మేమి చేయుచుండెనో తెలియదు.



# వేంకటాద్రి నాయఁడు.

## షష్ఠోల్లాసము.

అమీర్ ఖాసిమ్‌పేట మధ్యనొక కలాలీ దుకాణము పూర్వము నుంచి కలదు. ఆ దుకాణమును ప్రతిసంవత్సరము నా గ్రామ కాపురస్థులైన కలాలీలే గుత్తకుఁ దీసికొని, లాభములను భవించుచుండిరి. ఈ సంవత్సరము నెలరోజుల క్రిందట నా కలాలీల గడువు పూర్తి కాగా నారాజు పాటలో విదేశీయుండెవఁడో వీరికిఁ బైపాటీ వచ్చి పాటఁ బెంచి తన పేరు మీఁద కొట్టి వేయించుకొని, దుకాణము నా రోజుననే తన భుక్తము లోనికిఁ దీసికొనెను. ఈతండు లాభము సంపాదించుకొని జీవించ వలయునని వచ్చినట్లు దోఁచదు, ఒకటి యుద్దేశ్యముతో వచ్చిన వాఁడైన మామూలు కన్న నెక్కువ పాటఁ బెంచి ఖరీదు జేసి, స్వల్ప వెలకు విక్రయించు చుండునా? కలాలీలమ్మకాలములో పావలాది పుచ్చుకొని కూడ తృప్తి నొందని మహోదరు లొక్క అణా డబ్బులతోఁ దృప్తిఁ జెందిమైమఱచి బ్రహ్మానందమున నోలలాడు చుండిరి. బొత్తిగా డబ్బుదొరకక దుకాణమున కెదురుగాఁ గూర్చుండి, గుటకలు మ్రింగువాండ్లందఱికి నుచితముగానే కల్లు సప్లయి చేయఁబడు చుండెను. ఇట్లు జరుగు చుండుట వలన నితని కీర్తి యూరంతయు వ్యాపించెను. కలాలీ క్రొత్త గుత్తేదారు

పేరును దలఁచుకొన్నంతనే నోరూరని వారును, చేతులెత్తి నమస్కరించని వారును, మీర్ ఖాసిమ్‌పేటలో లేరు. క్రిందటి రోజులలో గుత్తేదార్లను బాధఁబెట్టి, బలవంతముగా నింత కల్లు బోయించుకొని, తృప్తిఁ జెందక యేఁగుచుండెడి రాజ సైనికులితని కాలములోఁ బ్రపంచమునే మఱచి, సురాపాన మదంబున రాజనగరరక్షణోద్యోగ కాలమున బ్రమత్తత వహించి కల్లు గుడిసెలమాత్రి మహర్నిశంబులు కడు జాగ్రతతోఁగాపాడుచుండిరి. రాజు కామావేశతచే నొడలెఱుఁగక సంచరించుచుండ సైనికులు సురాపాన లోలురై ప్రమత్తత వహించుటాశ్చర్యంబు గాదు. ప్రతి రోజు సాయంత్రము ప్రాత నా కల్లు దుకాణము ముందు జరుగుచుండెడి మహాత్మ్యంబుల నేమి జెప్పను. దానంబునఁ గర్ణుని ధిక్కరించుచుఁ, గుప్పి గంతుల హనుమంతుని దెప్పి పొడుచుచు, నానందంబున మౌనుల హీన మనిపించుచు, సుచిత్యంబున శ్రీమన్నారాయణుని వరాహావతారంబు నతిక్రమించుచు, హాస్తిపురంబు మాకిష్కంధా నగరంబు పోలిక, బదరికాశ్రమంబు కైవడి, మహార్ణవంబు లీల, నా ప్రదేశంబు వెలుంగుచుండు. యెక్కడనుంచియో వచ్చి, యిక్కడ కల్లు దుకాణమును కంట్రాక్టుఁ దీసికొని, ధనవంతులకు స్వల్పవెలకును బీదలకుచితంబుగాఁ గల్లు పోయించి, నష్ట కష్టంబుల భరించు యీనూతన గుత్తేదారెవడై యుండవచ్చును. ప్రతి మానవుండు లాభంబునకాసించి గాని ధనంబును వెచ్చించరు గదా! ఇతండు వీరలకందరికి సౌమ్య భావంబు కనుపర్చి నమ్మించి, మోసగించవలయుననికృత్రిమంబాని యన్నపూర్ణాదేవి వ్రతంబువలెనిచ్చుట

సుధాపానం బొనర్చుచుఁ బ్రయాసపడువాఁడు వేంకటాద్రి నాయని కాలుగవయోధుండై యుండవచ్చునని యెంచుట కవకాశముగలదు,

ఇది యిటులుండ నా కలభాషిణి నోచుకొను వటుల పటించుచుండ నేబది రోజులు గడచెను. ఆ రోజు మొదలు కొని యెవరికివారే మమ ప్రాణ్యాన్నల మగకొని, గ్రామాంతరవాసులనుండి బీదలు నానగొట్టి భాగ్యవంతులు కాఁదగ్గ కరి నాకర్షించిమెల్ల మెల్లగా మీర్ఖాసిమ్ పేటకుఁ జేరి పూట కూళ్ళుఁదింటూ చిన్ని చిన్ని గదులద్దెకుఁ బుచ్చుకొని, యందు నివసించి, చామీకర కూష్మాండ దాన యోగ్యంబైన భాగ్య దినంబునకై నిరీక్షణఁ జేయుచుండిరి. గడువు రెండు మూఁడు రోజులుండగనే తొందరపడి గుమ్మడికాయలు తయారు జేసి కొని వచ్చి, కంసాలీలు రాజుగారి కొప్పగించి బహుమతులు గైకొనిరి. అమీరుఖానుండవి దాసీలచే గలభాషిణిమందిరంబు కనిపి యుప్పొంగారు చుండెను. ఆ రోజులలో నిండ్లు యద్దె యును, పూటకూళ్ళ వెల లధిక మాయెను. గోంగూర చింత కాయ మొదలైన పచ్చళ్ళ కుండలు ఖాళీలగు చుండెను. ఉప్పునీరే పానయోగ్య జలంబై విక్రయింప బడుచుండెను. వీధుల నుండిన వేదికలు గాక వీధులన్నియు శయనాగారంబు లాయెను. చీమలు మొదలైన స్వల్ప జంతు హింసలు మెండుగా నుండెను. వర్ణాశ్రమాచార భేదము లంతగాఁ బాటింపనివై విరాగదశలోనుండెను, ఆపె గుమ్మడికాయలు పంచి పెట్టు దినంబు నాటికి మీర్ ఖాసింపేట నిలుచుండుటకైన

సందులేక జన బాహుళ్యము గల్గి యుండెను. అమీర్ఖానుం
డును తళ తళ లాడు దుస్తులధరించి, నాయంబు నధిరోహించి
వచ్చి కలభాషిణి వసించియున్న మందిరము ముందు కొలువు
దీర్చి, పట్టరాని తమకంబున నట్టె చూచుచుండెను. ఫకీరు
వేషంబుజ్జగించి, మల్లికార్జునుండ మరావతీ పురంబున కేగి
వేంకటాద్రి నాయక మహీపాలుని దర్శించి తాము ఘటించిన
మాయా నటన క్రమం బమ్మహారాజున కెఱిగించి, సంతోష
పెట్టి, మరికొన్ని రహస్యంబులు పదేశించి, కలభాషిణి
వ్రతాంత్య దినంబు నాటిరాత్రికి ఫలానా ప్రదేశంబునకు వచ్చి
విడిచి యుండుండని యా దినంబు నెఱింగించి, మరల వచ్చి
యుచిత వేషంబున నా మీర్ఖాసిమ్పేట యందే చరించు
చుండెను. వెంకటాద్రినాయకుండు యోధ భటనికాయ యుక్తం
బుగాఁ జనుదెంచి, మల్లికార్జునుం డెఱింగించిన నాటిరాత్రికి
నతండెఱింగించిన ప్రదేశమునకు వచ్చి విడిసి యుండెను.

కలభాషిణి తనకడనున్న క్రతిమ సఖిమూఖమున వేంక
టాద్రినాయకుండు తన్నువిడిపించుకొని పోవుటకు వచ్చునని
సంగతి విని యే యున్నది. కావున ఖేదంబు వహింపక కలకిల
లాడు మొగంబుతో నాకొక్కొక్కనిఁ బిలిచి, వారల యోగ్యా
యోగ్యతల వారల వాఞ్ఛాలముల మూలకముగా గ్రహించు
చుఁ గొందఱికి దానేయిచ్చుచు, గొందఱికిదసచెలి చేతిమీఁ
దుగానున్న మరికొందఱి కరువ్వరి సత్పురుషుల చేతిమీఁదుగా
నున్న ఆవేయి బంగారపు గుమ్మడికాయలఁ బంచి పెట్టి, బీద
సాదల కంతఱికిఁదృప్తిగా భోజనంబు బెట్టించి, సాగ నంపే
వరకు రాత్రి ఝాము ప్రొద్దుపోయెను. అప్పటి వఱకయ్యె

మురారు ఖానఁడచ్చటనే గంపెడాసతో గ్రుడ్లెల్ల బెట్టుకొని కూర్చుండి కలభాషిణిని దర్శించి యా మందిరంబు విడిచి, పోవశాళ్ళు రామి నావేదికపై కూలఁబడియె.

అంతట నాపె చెలి యాతని కరంబు గ్రహించి, సమీపించి, వచ్చినదిలే యీ కొంచెము సేపు నిదానించుము. అని బలవంతమున నవలికి లాగ విధిలేక యేగి, నివాసగృహంబు ప్రవేశించి, మదన బాణానల దందహ్యమాన మానసుండై జాగరణంబు సల్పుచుండ నారాత్రి యాతని కొక్కొక నిముస మొక్కొక రోజుగా గడచు చుండెను.



కొంతదూరము పరువెత్తి యచట నిలువఁబడి దిక్కులారయు చుండఁగ ముందుగా మఱికొంత దూరములో మనుష్యులవిడిసిన నాయెను ఆసడిఁవిని వచ్చి నంతనే మఱికొంచెము వేగముగా నా దిశకు పరువిడఁ జొచ్చిరి. ఇక సైన్యమును సైన్యాధిపుల దోడ్కొని రాఁబోయిన భటుండు వారలను సమీపించి పిల్చి సత్వరగా మేల్కొనరు మేల్కొల్పుటకిది మంచి యుపాయమని యెంచి రాజుతనముతన్నిన మూదిరివారినందఱినెముకలు చూర్ణ మగునటుల వసుసబెట్టి తన్నుచుండెను. అందులో కోపదారి వాఁడొకఁడు త్రుళ్ళిపడి లేచి యేమిరా నీకింత పొగరుదిగెనా యని యాతం డేదియో చెప్పబోవుచుండ వినుపించుకొనకనే శక్తికొలంది పొట్టపై బిట్టుఁగా దన్నెను ఆ దెబ్బయువు పట్టు నదాకుట వలన వెఱ్ఱికేక బెట్టి వెంటనే యాతండు భూమిపై బడి తన్నుకొని ప్రాణము విడిచెను. అతని కేక విని చాలవరకు సైనికులు సైన్యాధిపతులు మేలుకొనిరి గాని వారల పాపపరిపాకం బిట్టుగా పరిణమించెను. ఆచనిపోయిన వాఁడొక సైన్యాధిపతికి బావమఱిది యగుటవలన నాతని చంపినవాని సైన్యాగ్రహంబు వహించి వెంటనే మీఁదికుఱికి తనఖడ్గమునకు ప్రథమ బలిగా నతని కంఠంబు సమర్పించెను. ఈ చంపఁబడిన వాఁడొక సైన్యాధిపతికిఁ దమ్ముండగుట వలన కోపించి కత్తిబూని యా సైన్యాధిపునిపై తలపడ నతని బంధువులైన సైన్యాధిపులు సైనికుల నతనికిని యితని బంధువులైన సైనికులు సైన్యాధిపులితనికిని బాసటైరి ఆ రాజునకు సైనికులుగాని సైన్యాధిపతులుగాని బంధువులైన తురకలే గావునని రు తెగలయందు జేరక వెలిగానున్నవాఁ డొక్కండును లేడు ఆరోజున నీసంఘంబంతయు సుధాపాన సంతుష నిమత్తుజెంది

పడియుండి యిట్టిదుష్కృత్యముల మూలకముగా కళవళపాటుతో మేలుకాంచిన దగుటచే వివేకశూన్యత హాహా హాహాయని బోరాడి ఘటికా చతుష్టయంబున నిశ్శేషంబుగా నిర్మూలింపఁబడెను ఇచ్చట సైనికసైన్యాధిపులగతి యిట్టులైనది. అచట రాజేమాయెనో విచారింతము.

రాజా రక్షకభటులఁగూడి యాదెసకు పరువెత్తికొని పోయి కలభాషిణితో నాపె చెలితోఁ గూడియున్న బ్రాహ్మణులపై లంఘించబోవ చుట్టుకావు పెట్టియున్న యాసంఖ్యాక జనంబొక్కసారి కవిసి రాజును పట్టుకొని బంధింప రక్షకభటులు వెనుక వారు వెనుకనే పలాయనంబుఁ జూపిరి. పిమ్మట నయ్యమీరుఖానను దెచ్చి వేంకటాద్రి నాయమహీపాలు నిముందుంచిరి. అప్పుడు వేంకటాద్రి నాయుఁడతని జూచి దుష్టులైన లంబాడీలతోఁ జెల్మిజేసి సుశీలయైన కలభాషిణిని దెప్పించి వశునిగా చేసుకొన దలంచినందుకు ఫలించినది యానుభవించుమని కత్తితో గడ్డంబును మీసంబును గొరికి కట్టువిప్పించి పొమ్మని యాజ్ఞాపించెను.

అప్పుడయ్యమీర్ఖా నుండు సిగ్గున తలవంచుకొని చింతా భరితాక్రాంతుండై యేఁగుచు కాళ్ళుతీగె మెల్లుకొని మామిడిచెల్లు నాటుటకై మూడుగజముల లోతు గజము వెడల్పు బెట్టి త్రవ్విన గుంటలో తలక్రిందుగా బడి లోపలనున్న బరువు బండ తాకుట వలన తలిపగిలి కలభాషిణి సంభోగ సౌఖ్యంబునకు మారు రంభా సంభోగ సౌఖ్యంబును బొందెను. మీర్ఖాసిమ్‌పేట పర్గిజలయ్యమీర్ ఖాన్ కుమారుని రాజుగా జేసుకొని యారోజు మొదలుకొని సుఖముగా జీవించుచుం

డిరి కలభాషిణి యానగరంబును వీడిన రాత్రియే కల్లుదుకా
ణము నాకలాలీకే తీసుకొని యెప్పటి మాదిరి విక్రయించుచు
చు నడుమను చిత్రముగా వచ్చినదని నేర్చుకొన్న బీదవాండ్రి
నోట గడ్డగొట్టెను





# వేంకటాద్రినాయఁడు.

## అష్టమోల్లాసము

ఇఁక వేంకటాద్రినాయ భూపాలుండా కలభాషిణిని దోడ్కొని సంతోష పురస్సరంబుగా నుదయంబున బయలు దేరి సైన్య సమేతుండై యమరావతీ నగరమార్గంబుఁ బట్టి ఝాము ప్రొద్దెక్కు వరకు నడచి ఖరకరుని కరతీక్ష్ణంబుఁ నకలభాషిణి దేహవల్లికవాడి పోవునని శంకచే దట్టమగు నీడలతోఁ గూడిన గున్నమామిళ్ళు గల్గి చల్లదనమును జల్లించుచుహాయిని గూర్చుచున్న మంచినీటి కొలఁకుల తీరంబున విడియించి శాకపాకాదులు పరిచ సంబొనొర్చుకొని తృప్తి మీఱ భుజించుఁడని యాజ్ఞాపించి తనకై తయారు చేయఁబడిన మధురతర పదార్థంబుల కలభాషిణి జంటఁగూర్చుండి యారగించి కలభాషిణితో సరససల్లాపంబు లాడుచు ప్రొద్దుబుచ్చుకొనుచుండెను. ఆసమయంబున నాటవిక జంతుజాలంబు దప్పిగొని జలభ్రాంతి నెండమావులకై పరువిడుచు సైసికుల కుల్లాసంబు గల్గించు చుండెను. అదివసంత ఋతువగుటచే కానన తరురాజంబు లెల్ల లేజివురుతోడను. పూమొగ్గల తోడను విలసిల్ల వనలక్ష్మికి పూర్వశోభనా పాదించు చుండెను. శుకశారికాది పక్షినికరంబులు చల్లనైన చెట్లపై జేరికలరవంబు లొనరించు చుండెను ఇట్లుండ సూర్యుండు కొంతసేపటికి సత్వగుణపూరి ప్రధానుండై విష్ణురూపంబున వెలుగొందు

చుండ నా భూపాలుండు సైన్యంబు నచ్చటనుంచి తరలించి బాటపట్టి నడువ నాజ్ఞాపించి తాను కలభాషిణి యుక్తుండై గజారోహణం బొనర్చి సైన్యమధ్యంబున నేగుచు ప్రొద్దుగుంకు వరకు నడచి వసతిగల యొక్క ప్రదేశమున విడియించి యుండ నా రాత్రి కొన్ని దుర్నిమిత్తంబులు వారికి పొడచూపసాగెను. వారలా దుర్నిమిత్తంబుల కలుకుచు దిశలు పరికించి విచారింపనొకమూల కొద్దిపాటి నల్లనుబ్బు తెప్ప గాన్పించినదే కాని మరేమి యుపద్రవము సంభవించునది వారికి దోచినదికాదు. అంతట భయంబుతో జాగ్రతగా నారాత్రి యచ్చట గడపి మరునాడుదయమున వెడలి మఱియొక మజిలీకి బోవువరకా మబ్బు తెప్పంతకంతకు బలసై సూర్యరశ్మి భూమిపై సోకకుండు నంతటి దట్టముగా నాకసంబెల్ల నాక్రమించి ప్రయాణంబున కనుకూలంబుగానే యున్నది కాని వర్షమువచ్చునేమో యనుభయము మాత్రము గల్గించుచుండెను. అదియాకాలంబగుటచే మబ్బంత డంబముగా గాన్పించినను వర్షము మిక్కిలి కురియదని ధైర్యంబు వహించి మహీపాలుండు సైన్యమును సూర్యాస్తమయ కాలమున కింకొక మజలీకి జేర్చెను. ఆమజలీ మహారణ్య ప్రదేశము అచ్చటికి చేరినకొంచెము సేపటికి సముద్రములలో నున్న నీరెల నొక్కసారి మేఘరూపమునుదాల్చిన దో యనునటుల నంతరిక్షంబెల్ల ఘనఘనాఘన సముదాయంబుతో నిండి యుద్ఘోషింపుచుండ నెడతెగని తీగె మెరుపులువచ్చిన యానేంద్రియములం బరివేశించి దృష్టుల నిరోధించి పరస్పర సందర్శనంబుల రూపుమాపిన సైనికులు సైన్యాధిపతులు మహాభీతచేతస్కులై ప్రాణంబులయెడ నిరాసఁజేసుకొని దిగాలు

బిడ్డల స్మరించుచుండిరి. రాజు కలభాషిణిని కౌఁగలించుకొని యాత్రముతోఁ గట్టఁబడిన చిన్నడేరాలో ముడుచుకొని భగవన్నామస్మరణంబుఁ జేయుచు గాఢాలింగన సౌఖ్యంబననుభవించుచుండెను.

అంతలో వారి కందఱికి బివ్వుమని ధ్వని వినఁబడ నారంభింప గుండెలుపగిలి యల్లాడుచుండ నదియే యింద్రియము మూలకముగా గాలియు నిగ్రహించుట కవకాశము గల్గెను. ఆ మహావాతము దిక్కులమూలు మ్రోగించుచు ఫల వృక్షంబుల కొమ్మలవిఱుచుచు మహావృక్షంబుల కూకటి వేళ్ళతో సహా పెల్లగించి భూమి కెరిగించుచు సముద్రమథన కాలంబున బుట్టిన హాలాహలంబు చందంబున లోకంబున వ్యాపించి సమస్త ప్రాణికోటికిని నిర్వాచ్య భయంబాపాదించుచుండె. అత్తఱి నోరుచుట్టుపై రోకటి పోటన్నట్లు మెఱుపులతో నుఱుములతో గూడిన భయంకర మేఘ సంఘంబుమండి పెద్దపెద్ద శిలలు భూమిపై దుముక నారంభించెను. అప్పట్టున నిండ్లను వదలి పరభూముల యందరణ్య మధ్యంబున చిక్కువడిన ఈ రాజ రాజ సైనికులు మొదలైన వారికి దిక్కు సర్వ వ్యాపియై కృపామయుండునైన భగవంతుండొక్కండు దక్క మఱెవ్వరుంగలరా. జనులయొక్క దుష్కర్మ ఫలంబొక్కొక్క సారి రీతి కట్టి బడుపుచుండును. ఆదుర్దినంబున వీరల యవస్థనేమని చెప్పవలయు శిలాపాతంబువలని బాధకు తాళలేక కనులమూసుకొని పరువిడి చెట్లకుదాకి మూర్ఛజెందువారును ముండ్లపొదలలోఁబడి వాడియుండ్లు దేహంబున జొరబాఱి విలుఁగకుయ్యోయనువారునుపరువిడుచుండ కాళ్ళకురాళ్లుతగిలితీగెలు మొలు

కొని మొగము నేలఁద్రొక్కునట్లుగాబడి మొఱ్ఱో యనువారును ఒండొరులు బిట్టుగాదాకి అబ్బో చచ్చితిమనువారును, చెట్ల మొదళ్ళమఱుఁగున గూర్చుండి కొమ్మలువిఱిగి భూమిపైబడి నపుడెల్ల బిట్టులుకువారును. చెట్లతొఱ్ఱలు తడివి కసిపెట్టి యుండు తలదూర్చి యందున్న చీమలు తేళ్ళు మొగములను కన్నులను బట్టి కుట్టుచుండ నోర్చుకొని పండ్లుబిగబట్టి మూల్గువారునై నిశ్చలభక్తితో భగవన్నామ స్మరణంబును చేయుచుండిరి.

ఇఁక డేరాలోనున్న రాజుగారు కలభాషిణి యేమైరో విచారింతము. డేరా పెద్దపెద్ద ఱాళ్ళతాకుడుచే పగిలి కొన్ని రాళ్ళు వీరికి తగులుట కారంభింప డాలుసహాయంబుగాగొని రాళ్ళదెబ్బలు దగులకుండ తప్పించుకొని యొకమహావృక్షము మఱుగునకుఁజేరి యెట్టి దుర్ముహూర్తంబున బయలు దేరితిమొ యెట్టికర్మంబు వాటిల్లెను. అని విచారపరీత మనస్కులై దరి దోచని గతినుండగా చెట్టుకేపక్కనోగాని సమీపంబున శార్దూల గర్జనంబు చెవులచిందర గొనజేసెను, అట్టితఱి నెట్టిధీరునికైనను వివేకము చాలియుండునా.

వేంకటాద్రినాయమహీపాలవర్యుండంతట విభ్రాంతి జెంది కలభాషిణిని వదల కరవాలంబునకై డేరావైపు లంఘింప కలభాషిణి తత్తరించుచు లేచి గాఢాంధకారములో మఱి యొకవైపునకు పరువెత్తి షుమారు నూరు సంవత్సరముల క్రిందటనే పుణ్యాత్మునిచేతనో త్రవ్వింపబడి దట్టముగా తీగెల చేత నల్లుకొని. గోముఖ వ్యాఘ్రంబు చందంబుననున్న పాడు బావిలో జారి దెబ్బ మిక్కిలి తగులకుండినను భీతిచే స్పృహ

దప్పి పడి యుండెను. వేంకటాద్రి నాయండెంత సేపా కటికి చీకటిలో వెదకులాడినను జేరయే కనపించక పోగా నిక కర వాలంబెచ్చట జిక్కెను. అంతలో నా వ్యాఘ్రుంబెటు పోయె నోగాని దాని గర్జనంబు మఱియొకసారి విన బడక పోగా రాజునకప్పుడు కలభాషిణి జ్ఞప్తికివచ్చి యాపె జంట జేర వలయునని యెంచెను గాని యాపెటెక్కడనున్నదో కనుగొన వీలుగామి నతనికోరిక నెఱవేరినది కాదు.

ఇట్లుండ కొంచెము సేపటికి జగద్రక్షకుని దయా విశేషంబువలననో వీరల సుకృత యోగంబుచేతనో పాషాణ వృష్టి కొంచెము శాంతించి మబ్బు పల్చనై విడిసిపోవ నారంభింప వారల కనుఱెప్పలు కొంచెము తెరిపిళ్ళుబడి దృష్టినాశము లించుకంత పనిజేయ సాహసించెను. చచ్చినవాండ్లుగాక నందందు మఱుగులజొచ్చి ప్రాణావశిష్టులై యున్నవారు చలిచే గజగజ వడకుచు నొకళ్ళొకళ్ళు కౌగలించుకొని తమ కష్టంబుల జెప్పుకొని వాపోవ జొచ్చిరి. మఱికొంత సేపటికి సంపూర్ణంబుగా మబ్బు విడిపోవు తారా మండలంబెల్ల కళావిహీనంబైన తారాసముదాయంబుచే చెన్నుదరిగి ప్రాగ్దిశాభాగంబు పాండు రచ్ఛాయతో గూడి వేకువ పొలుపుం దెలుపు చుండెను. అవ్వేళ రాజ చంద్రుండు విన్ననగు మొగంబుతో ప్రియురాలైన కలభాషిణికై యాప్రదేశమంతయు వెదకివెదకివిసిగియమ్మానినీవతంసముపులినోటబడినదనియెంచుకొని తన యవివేకమునకును దాని దౌర్భాగ్య రేఖకును చింతించుచు ఖిన్నుండై యొక బండమీద కూర్చుండి యుండెను.

అప్పుడు వీరలనెల్ల తన కరంబులచే స్పృశించి వణకుచు శాపి యారోగ్యవంతులఁ జేసి జగద్బంధు నామము స్పష్టీకరించు కొనుటకై వడివడి నేగుదెంచినాఁడను నట్టులా రోగ్య కిరణంబులు దయా చలంబు నధిరోహించెను. అంతట సజీవులై యున్న సైనికులెల్ల నెండఁ గ్రాగి కొంచెము బలధైర్యంబుల వహించి రాజుగారిని సమీపించిరి. సైనికులు సమీపించువరకు రాజు చింతలో మునిఁగి యున్నవాఁడైనను తన ఖేదంబును గనుపర్చి సైనికులు మతిచెడ నడలఁబెట్టుట ధీరోదాత్త లక్షణంబుగాదని యెంచి ధైర్యంబును వహించి యుత్సాహకర వాక్యంబు లుగ్గడించి వారల దయలమట బాప నెంచెనుగాని యారాజచంద్రుని ప్రస్క నారాపను ఖీల లామంబు కనిపింపమిచే వీరల నయనోత్పలంబులు వికసించి రాజున కాహ్లాదము గల్గించినవి కావు. గనుక రాజు వారలతో చచ్చినవారికై దుఃఖింపకుఁడు జన్మమెత్తిన తర్వాత నెవ్వారైన శాశ్వతంబుగా జీవింతురా వారలయాయుఃప్రమాణములు పూర్తియైనవిగావున వారు దివంబుని నెపంబుతో నలంకరించిరి ఖేదంబు వహింపకుఁడు ధైర్యంబు బొందుఁడన వారలు రాజుఁ జూచి స్వామీ సాధ్వీమణి యగు కలభాషిణి యేమయ్యె ఆమె ముఖపద్మంబు కనుపింపమి హూదప్పి పరంపరల నెడి భ్రమరంబుల కూరటగలుగకున్న యది యెఱింగింపు డన నారాజ వరేణ్యుండు శార్దూలగర్భంబువిన వచ్చినది మొదలుకొని వారలు తనను దర్శించువరకు జరిగినకథనంతను వారికివినిపించిన వారును కూడ నాచుట్టుప్రక్కల ప్రదేశములరసి కానక రాజుగారితో పాటు పులియెత్తుకొని పోయినదని నిశ్చయించుకొని నిరాశాపూరితచేతస్కులై చింతించు చుండిరి.

అరాత్రి ఝంఝామారుతంబు మెండుగానుండె గాని వర్షము మాత్రము స్వల్పముగా నుండుటంజేసి సైనికులకు చాలామందికి దెబ్బలు తగిలినవే గాని జీవంబుల బాసినవారరుదు. పిమ్మట వేంకటాద్రి నాయకుండు తన సైన్యంబు దోడ్కొని మరునాడు సాయంత్రమునకు అమరావతీ పురంబు జేరి దెబ్బలు తగిలిన సైనికుల కంతటికి దిట్టముగా భోజనంబులు పెట్టించి బ్రాహద్వైద్య శిఖామణులచేత మందులిప్పించి చికిత్సలు జేయించుచు కలభాషిణిని మఱచి సుఖించుచుండెను.



# వేంకటాద్రినాయఁడు.

నవమోల్లాసము.

అట్టులా కలభాషిణి యాఁపాడునూతిలోఁబడి నాలు
నైదు గడియల ప్రొద్దెక్కువరకు స్మృతిలేక యుండి భగవం
తుని కృపవలన దేఱితేచి కూర్చుండి పారజూడ నిరులు దట్ట
ముగాగ విసి యుండుటచే నది బావియని గ్రహింపలేక మహా
భయంబుతో నిలువంబడి ముందుకు రెండడుగులు వేయఁగో
డమూ దిరిబావిదరి కొంచెము గట్టిగా సోకనేమియు తోచని
దై మఱియొక ప్రక్కకు బోవ నటుకూడనటులనే తగిలిన
మఱి రెండు ప్రక్కలుకూడ చూచి యెటుబోవను వీలుగా
మినది బావియని గ్రహించి తందరపాటుజెంది మబ్బు గాలిం
వాన సంగతి జ్ఞాపకమురాగ ప్రమాదవశమున తానందుగూలితి
ననుకొని దానిలో చాలభాగము తీఁగెల యాకులచే పూడిత
నగుచుకంతయు దెబ్బ తగులకునికే సంతసించుచు వేంకటాద్రి
నాయునికే యాపద ఘటిల్లెనో యని లోనచలించుచు నతం
డాపైనున్న వాఁడనియెంచి భూపాలా ప్రమాదవశముననే
నిందు బడితి రక్షింపుమని యెంత మొఱవెట్టినను నాపె మొఱ
యరణ్యరోదనంబయ్యె. ఇట్లు కొంతవడికు పిలిచిపిలిచి ప్రత్యు

త్తరంబేమియు రామి నామహారాజందు లేదని నిశ్చయించి యూర్ధ్వదృష్టి సారించి చూచుచుండ నాతీగెల సందులలో నుంచి సూర్యరశ్మిలోన జొరబాఱి బావియొక్క పైభాగ మంతు ప్రసరించి వెలుంగ జేయుచుండెను.

అంతట నాకలభాషిణియుది పగలని గ్రహించి యేపు ణ్యాత్ముడైన నా బావి సమీపమున వెళ్ళుచు తనయార్తనాదం బువిని తన్ను వెలికిదీసి రక్షింతురను పేరాసతో నన్ను బైటికి దీయుడయ్యలారా బైటికిదీయు డయ్యలారా; యని విరామ ములేకుండ కుయ్యిడుచుండెను.

అచ్చటికొక క్రోసుదూరమున నొక లంబాడీతండా గలదు. ఆటండాలో ముత్తరాచ కులంబునబుట్టిన రసానాయకా భిఖ్యజెలఁగు వాడొకఁడు గలడు. అతండు ప్రతిరోజు తుపాకి కట్టెనొకదానిని భుజమున బెట్టుకొనిపోయి యేకుందేలుపిల్లనో కొట్టి తెచ్చుకొని కడుపునింపుకొనుచు పాపిష్టికండలను బెంచుకొని పాపభీతి రవ్వంతయులేక కండ్లుగానక సంచరించువాఁడు హాఁడీరోజున నింటపుల్లలు లేకపోగా తుపాకికి మారుగా గొడ్డలిని భుజముపై బెట్టుకొని కట్టెలను మోపుగట్టుట కదలక మోకును చేతబట్టుకొని ఝూముప్రొద్దెక్కువరకా పాడుబావి ప్రక్కగానున్న బాటనుబడి యేఁగుచుండ నీకూతవాని చెవుల బడియె. కలభాషిణి యదృష్టమేమోకాని చచ్చుచున్నను కండ్లజూడని యాకటికము తరాఁచవాఁడాపె యార్తనాదంబు చెవి సోకినంతనే పరువెత్తుకొని బావియొద్దునకువచ్చి యెవరు నీవు యిందేలబడితివన నాపె నన్ను త్వరగా బైటికిదీయుము,

నాయుదరంబు బ్రాఁకవచ్చినవెనక చెప్పెదనన వాఁడు బోవి
నావంకరించిన తీఁగెలను గొడ్డలిచే మొదల్నుదప్పించి వీఁకవెంట
తెరపిజేసి గట్టివాటి కట్టెనొకదాని నడ్డముగా వేసి దానిపైనొక
యెముగును భూమిపై నొకయెనుబదుంప తనచేతనున్న మోకు
కొన కచ్చుగాసి గోనెఁడిచిన నాపై యాయుమ్మ్రను తల
దూర్చి చేతులను దప్పించి చంకలలో జెప్పకొని బిగించెను.
అంతటవాఁడు మోకును గట్టిగాఁ బట్టుకొని యుల్లిమొలగా చేని
గొయ్యన ఒడనెడి బాసి యూపురేఁక కచ్చుగువారించుచు కనురె
ప్పవేయక చూచు నాగెను. శిశువుసును కోసులంబున సమా
నిని గాత్రంబా కటకటా ప్రాణియొరపిశిచే నెంతనొచ్చి యెంత
కందెనో భగవంతునికేయికె దూపికేయికే అంటుపైన నాపై
యూరక చూచుచున్న వగపానాయకునిఁ గాంచి అన్నా నీది
యేవూరు యెందుబోవుచు నిందు నాప్రాణంబుల గాచి పున్నె
బుగట్టుకొంటివన నాతండాపెతో దనవృత్తాంతమును జెప్పి
మనోక్షేత్రంబున మోహబీజంబు నాటరాఁగా రసంబున నం
కురింపించుచుండెను. కలభాషిణి వానిమనోభావంబు కొంత
గ్రహించినదై యాచోటువాయనెంచి. అన్నా యిక్కడి
కేయే గ్రామములు సమీపమున నున్నవని యడుగ నతండు
ఇక్కడికి కేవూళ్లుదగ్గర లేవు మాటాండా యొక్కటే క్రోసెడు
దూరములో నున్నది. యూవూరికి పోదామురా నీకు బువ్వ
బెట్టి బాగా సాకుకుంటా నాకు తుపాకివేట బాగా వచ్చును.
రోజు తిన్నంత మాంసము తెచ్చిపెడ్తా మేమునల్గురన్నదమ్ము
లము మాకుజతగాండ్లు చాలామందున్నారు. నువ్వేమిపని
సేయనక్కఱ లేదు నువ్వి పెద్ద యడివిలో నుంచి దారికిను
క్కలేవు. ఎగోలాలు మెకాలు ఎలుగుబంట్లు కొర్నాసి

గాండ్లు యెక్కడచూచినా అయ్యో పాపము నువ్వుచూస్తే పం
డాల మెత్తాగానున్నావు నిన్ను వదలివేసిపోవుటకు నాకుకాళ్లు
రావడంలేదు జాలేస్తుంది. బువ్వకు చాలాపొద్దెక్కింది పోదా
మురా పోదమురా అని తొందరించిన నక్కలికి మనంబున
నిట్లు విచారించుకొనసాగె. అయ్యో యితండు బావినుంచి
తీసి ప్రాణదానం బొసంగినందుకు సంతోసించితినిగాని యీతం
డిపారాల మూలకముగా దాస్యభావంబును వెల్లడించుచు
మంచిమాటలతో దనయింటికి గొనిపోవ నెంచుచున్నాడే మా
నభంగ కాలమందనృతంబు వచించినను పాపంబురాదని పెద్ద
లు వంచింతురుగదా. ఇపుడు నేనత్యవసరంపు పనిమీద నమ
రావతి నగరంబున కరుగుచున్నదాన తిరిగి వచ్చునప్పుడు మీ
యూరికి వచ్చెదనని చెప్పి చూచెద. నంతకువినకమించి వచ్చిన
నాపై వీనిపుటమార్చెదను.

అని యానర్సునాయకుని జూచి అన్నా నీయింటికిరాక
వెళ్ళుదు ననుకొంటివా. నేనిప్పుడు తొందరపనిమీద నమరా
వతీ పురంబున కరుగుచున్నదాన తిరిగివచ్చినప్పుడు వచ్చెదను
ఆపురంబున కేమార్గంబున బోవలయునో చెప్పుము నాకు తల్లి
వైన తండ్రివైన నిప్పట్లు నీవేకదా నాయందింతమాత్రము
దయయుంచుమన నమ్మృతరాచ నాయకుండు లోననిట్లను కొ
నెను. ఇది అమరావతికి బోవుచున్నానని చెప్పుచున్నదే దీని
కమరావతీలో నేమిపని యుండవచ్చును. వేంకటాద్రినాయుని
వరించి పోవుచున్నదేమో అట్లయిననిది యచ్చటికివెళ్ళి నమ్మ
హారాజును వదలివచ్చునా నన్నుమాయజేసి తప్పించుకుని పో
వాలనని చూస్తుంది దీనికి బాటచెప్పగూడదు. దీన్ని పోనియ్య

కూడదు. అని యామెతో నీవు చూచిపోవటానికి వస్తానని చెప్తున్నావు. అట్లాకాదు నేను చెప్పినమాటలు తెలియలే నీవునన్ను పెండ్లిజేసుకొని మాయింటికాడనే యెప్పుడూ నాకు బువ్వొండిపెడుతూ వుండాల పోనియ్యి పోదాము రా మాయింటికని చేయిపట్టుకోనపోగా నవ్వుకొనుచు కొంచెము వెనుకకుదగ్గి నన్ను బలవంతముగ తీసుకొని పోవనవసరము లేదు. నీమనసు కనుగొందమని యింతవరకట్లంటినేకాని నా ప్రాణములను రక్షించిన నిన్ను పెండ్లిచేసుకొనక నీవు పొమ్మన్నను పోదునా కొట్టుము కొట్టుము కట్టెలుగట్టి మోపుగట్టుకొనుమని తొందరించినవాఁడు సంతోషాతిశయంబుచేనుప్పొంగి యావచ్ఛక్తి నుపయోగించి నాలుగు దెబ్బలతో నరబండి కట్టెల పగులగొట్టి మోపుగట్టి తలపైబెట్టుకొని గొడ్డలిని భుజముపై తగిలించుకొని రావే రావే ప్రొద్దెక్కింది. అని యుత్కలభాషిణిని వెంటబెట్టుకొని బిరబిర నడచుచుండెను.



# వేంకటాద్రినాయఁడు.

## దశమోల్లాసము.

ఆనర్సానాయకుండు సంతోషాతిశయంబున మైమఱచి నడచునప్పుడు బుజముపైనున్న గొడ్డలిజారి కాలిపైఁబడి కొంకి నరము తెగ నాకట్టెలమోపుతోసహా నతండు నేలగూలి వాపోవఁజొచ్చెను. అప్పుడు కలభాషిణి నాకు ప్రాణదానం బొనర్చిన వీని కిప్పట్లనేమి యుపకారంబు గావింతునాయనియెంచి మరల వానిదౌష్ట్యంబును దలంచి వాని బారినుండి తప్పించుకొనుటకు భగవంతుం డిట్లొనర్చినాడని సంతసించుచు వానివైపు కన్నెత్తియైనచూడక వచ్చిన బాటనే తిరిగి పోవుచుండ ముతరాచవాఁడు చూచి దీనితల్లి సిగగొయ్య వచ్చేదాని వలెనే యిష్టపడివచ్చి నాకాలు తెగంగనే తప్పించుకొని పోతుందిరా దీన్ని యెట్లాపోనిచ్చేదిరా బాబూ. అనివండ్లుపటపట గొరుకుకొనుచున్నంతలో దారికటునిటు పక్కలనున్న గొడ్లచప్పిడి గొడ్లగాచే వాండ్లమాటలు వానికి వినబడెను. అంతలో వాఁడొక యుక్తిపన్ని ఆరేహేమ్లా ఓరేరూప్లా యేమిరోశిత్లా అని పెద్దగా కేకలుబెట్టి ఓరియెవతో నావెంట తండాలోకి వస్తానని చెప్పినా గొడ్డలిమోసు కోస్తానని తీసుకొనివచ్చినట్టే వచ్చి నమ్మించి నాకాలు తెగనరికి పోతుందిరో నేను బతకనురో బాబో అని బిట్టుగానేడ్వ నాలంబాడివాండ్లు పరువెత్తుకొనివచ్చి వానినిజూచి వెంటనే పరువెత్తుకొని పోయి

కలభాషిణిని చుట్టుకొనిరి కలభాషిణికి లంబాడి వాండ్లను జూచినంతనే తాకరుసైన్యము జ్ఞప్తికివచ్చి ధృతిదూలి మాటల వాండ్లు నశించిరిగదా యను వివేకంబుతప్పిణమే గలిగి. అయ్యో మీరలెవరు. నేనేమితప్పు జేసితి నన్నేచ్చుటకి గాని పోయెదరు మీరెచ్చటికి రమ్మన్నను వచ్చెదనుగాని నన్ను ముట్టకుండన నాలంబాడివాండ్లు మాముతరాచ నాయకుని కాలు నరికివచ్చి నేనేమితప్పు చేశానంటున్నావు. పోదాముపా మానాయకుని దగ్గరకు పోదాముపా.

అని యామెను వెంటబెట్టుకొని యా నర్సానాయకుని దగ్గఱకుదీసికొని వచ్చి యాతనితో దీనిని మననాయకుని దగ్గరకు దీసుకొని పోతున్నాము మీవాండ్లకు నీసంగతి చెప్తాము లేఅని యాకలభాషిణిని గొనిపోయి యా టాండాకు నాయకుండైన రాజుగాని యెదుటనిల్పిన రాజుగారు లంబాడీ బాసతో వాండ్లనిట్లడిగిన వాండ్లిట్లుచెప్పిరి.

రా॥ ఈమెయెవరు ఎందుకు తీసుకొని వచ్చితిరి.

లం—ఇదియెవతో మాకు దెలియదుముతరాచనర్సా నాయకుని కాలునరికి పారిపోతూ వుంటే మేముపట్టుకొని వచ్చినాము.

రా—నర్సానాయకుడి కాలేమిటి యీపెనరుకు టేమిటి ఆశ్చర్యముగా నున్నదే

లం—అడవిలోకి నర్సానాయకుడు కట్టెలకొఱకు పోయి కొట్టి మోపుగట్టుకొని వచ్చుచుండగా యిది దారిలో కలిసి నేనుకూడ మీటాండాకే వస్తాను. ఆగొడ్డలి

నిటు దెమ్ము నీకు కట్టెలమోపే చాలబరువుగా నున్నది అని గొణఁగుకొని వెంటనే మామిడికొయ్య వాగు దనుక వచ్చి దీనికేమి చేటుకాలమో కాని యతని కాలు నలికినదట పాపమా నాయకుఁడచ్చటనే పడి యున్నాఁడు వాండ్లకు జెప్పవలయు పోయిమంచము మీద నైనకట్టి తెచ్చుకొందురు.

రా — అటులనే చేయుదు అవర్నానాయకుని మాత్రమచ్చట నుండియే నాయొద్దకు గొనిరమ్మని చెప్పఁను పొండు.

అని యానతిచ్చిన నాలంబాడి వాండ్లు ముతిరాచ వాండ్లయింటికిఁ బోయి యీసంగతిని వాండ్లకెఱిఁగింప నా యింటివాండ్లందఱు గుబగుబలాడుచు పగుల గ్రుద్దుకొని యేడ్చుచు మంచముకుక్కి నొకబానిని నెత్తిన వైచుకొని మామిడికొయ్య వాగుయొద్దకు పఱుగిడిరి. వీండ్లు సమీపించు వరకు నర్సానాయకుండు వీరినిజూచి నాగతి యిట్లైనది నేను బ్రతుకుదునా అన్నలారాయని తనకాలును జూపి పెద్ద పెట్టున నేడ్వ వీండ్లుగూడ వానిపైబడి యేడ్చి యేడ్చి యామంచము పైవేసికట్టి మోసుకొనివచ్చి రాజుగాని యెదుట బెట్టిరి.

రా — ఏమోయి నీకాలెటుల తెగినది యిమానముగా జెప్పుము

న — (తనలో) దీనిపైని లేనిపోని నేరమునుమోపి యిబ్బంది పఱచితినా యిది యీ వూళ్లోనే వుంటుంది నాకాలు నయమైన తర్వాత పెండ్లిచేసుకొన వచ్చునుగాని దీనిపై నీనింద మోపవలసినదేయని యాలోచించుకొని

నాయకునితో నేమిచెప్పేది యీ మాయలమారిని నమ్మిన నింతచేసినది ఆడువాండ్లెంత పనులైన జేతురు ఇది బావిలోపడియుండగా దీసి పాపమని వెంటబెట్టుకొచ్చినందుకు నాకాలు నరికి పున్నెము గట్టుకొన్నది. దీనిని వదలిపెట్టకు నాయకుడూ వదలిపెట్టకు

రా— ఈపె దేవ్వూరు వొచ్చేటికి పోవుచు నే బావిలోబడినది ఆ బావియొద్దకు నీవెందుకు పోతివి యీపెనెటుల దీసితివి నీవింత మేలుచేస్తే ఆమె నీకాలెందుకు నరికింది నేను నమ్మజాల నీవు వట్టినేరములు మోపుటలో గట్టివాడవుకదా?

న— వినండి అనితనకు తెలిసినంతమట్టుకు యీపెవృత్తాంతంబును యీపె బావిలో బడిన కారణంబును. తానచ్చటికి కట్టెలకైపోయి యీపెను తీసినవిధంబును జెప్పి యూరిలోనికి వచ్చేదనని నా వెంటవచ్చుచు మోసుకొనివచ్చెదనని నాచేతిలోని గొడ్డలినడిగి తీసుకొని యిట్టివని జేసెంది. దీనిపట్టికట్టి నేయించక చూస్తావేమి నాయకుడూ చూస్తావు.

రా— అప్పుడా కలభాషిణింజూచి నిన్నా బావిలోనుంచి యితండు తీసినాడా. నీకేమియు భయములేదు ధైర్యముతో నిజమును జెప్పుము.

క— నన్ను బావిలోనుంచి తీసి నాప్రాణముల కాపాడిన మాటమాత్రము యదార్థము.

రా— అట్లయిన నీవు కృతఘ్నురాలవై వాని కాలు నేలనతికి తిని అన్నము పెట్టిన వానికి సున్నము పెట్టెదవా

క— నేనింతమంది యెదుట భగవంతుని సాక్షిగా చెప్పుచున్నాను వినుడు యీతండు నన్ను బావిలోనుంచి తీసి తనయింటికివచ్చి తనను పెండ్లిచేసుకొంటేనే తప్పవల్లగాదని పట్టుబట్ట కాదనిన నేమన్నానోయని భయపడి యిష్టతను నభినయించి మీబోటులకు చెప్పకొనుటకై యీతెండాకు రానొడంబడి యాతండు కట్టెల మోపును దీసుకొని గొడ్డలి భుజమున బెట్టుకొని ముందు నడచుచుండ నేనను వెంబడించి నడచుచుంటి ఇట్లిర్వురము కొంతదూరంబు నడచునసరికి యతని భుజముపై గొడ్డలిజారి కాలుతెగినది ఇంతకన్న నేనెఱుంగ

రా— అట్లయిననీవు మాగొడ్లకాచే లంబాడీలు వచ్చువరకు వెనుక కెందుకు పోవుచుంటివి ?

క— ఇష్టములేక యేమన్ననో యనుభయంబున వచ్చుదాన నగుటచే నిక్కండేమియు నన్నికచేయలేమగదా యని నెంచి మరలి పోవుచుంటిని అంతలో మీలంబాడీలు వచ్చి మానాయకుని యొద్దకు బోవలయునని నిర్బంధించుటచే వచ్చితి.

రా— ఆ తెలిసినది నిజము వాడునిన్ను పెండ్లిచేసుకొందమని యెంచి యింటికి రమ్మనినమాటయు నిజమే

నీవు విధిలేక వచ్చుచు వానికాలు నఱికి పారిపోవు
చున్నమాట నిజమే నీవుతప్పక దండనార్హురాలవు.

అని శేఖ్‌సిందును బిలిచి దీనిని దీసుకొని పోయిమన పటేలు గారికి వప్పజెప్ప ప్రొద్దుక్రుంకెఁ బోవుచున్నది. యీ రాత్రి తప్పించుకొని పోయిన యెడల లేనిపోని యిబ్బంది మనకు వచ్చును.. అని రెండుగడియల ప్రొద్దువేళ శేఖ్‌సింద్ కింకొక వానిని తోడిచ్చి బహుజాగ్రత్తగా గొనిపొండు సుమా యని కలభాషిణిని వారికొప్పగించెను.



# వేంకటాద్రినాయఁడు.

ఏకాదశోల్లాసము.

ఈతండాకు పటేలుండు నట్టి గ్రామము మూఁడుక్రోసుల దూరములో నున్నది వీరెంత వేగముగా గొనిపోవుదమన్నను యారోజున నాఁడు పూర్తిగా నుపవాసంబుంటవలన నడువలేనిదై యా ప్రొద్దు నొకమైలు దూరములోనే క్రుంకించెను. ప్రొద్దుగ్రుంకిన తరువాత నడువవలసిన దంతయు నరణ్యప్రదేశమే అయినను వాండ్లు చిరపరిచితులుగనుక ధైర్యంబుతో నమ్మానిని నడువుమని యాదలించుచు కొనిపోవుచుండిరి. ఇట్లు మెల్లగా మఱియొక మైలుదూరము పోవువఱకి పియొక్క యడుగైన సడలేక నిస్సత్తువతో కూలబడిన వాండ్లు బోరా యాఁపె పొద్దుటినుంచి కూడులేక నిస్త్రాణ దశలోనికి వచ్చినది మనమిప్పట్టున నీపె నెంత బాధించిన సంమకంతేయు లాభంబులేదు. ఇచ్చటికి దగ్గరలో నొకకోయ గూడెమున్నదికదా కోయదొర యింటికిపోయి కొంచెము పాలైనను తీసుకొనివచ్చి త్రాపి సేదదేర్చి తరువాత నెమ్మదిగా గొనిపోవుదము అని వారిరువురుకూడ బలుకుకొని యొకండాపెకు

కావలిగానుండి మఱియొకడు పాలుగొనివచ్చుటకై కోయగూడెము జేరెను. ఆకోయగూడెములో ప్రతియింటికి నాలుగో మూడో ఆవులుండియే యున్నవి. పాలిచ్చునవి మాత్రము బహుతక్కువగా నుండుటవలన నిశేఖ్‌సింద్ కడుపరియాసపడి ప్రతియింటికీ తిరిగి యడిగి యడిగి విసుగుజెంది తుదకుఁలోభిని యాచించిన యాచకుని విధంబున విచారపరీత హృదయుండై వచ్చు సమయంబున నొక కోయపెట్ట యెటకేనిం జనివచ్చుచు నితనికంటబడియె. అంతట శేక్‌సింద్ దానితో పెట్టా ప్రాణము మీదికి వచ్చివచ్చినను మీగూడెములో నిన్నిదాహము దయచేయువారు కూడలేరుగదా యనదని అయ్యా నేనిచ్చెదను రాయని యతని మరల గూడెములోనికి గొనిపోయి నిలువుచెంబు పరిశుభ్రముగా తోమి యూటవాగులోనుంచి తెచ్చిన మెట్టనీరు తీసుకొనివచ్చి యీయబోవనతండు మీనీరుత్రాగి కులము చెడగొట్టుకొననాయని మరల పోవుచుండెను. అప్పుడాపెట్ట యెదురువచ్చి పోనియకడ్డువెట్టి మానీళ్ళు త్రాగంది యెందు కడిగితివయ్యా యనఁతండు దాహమనగా నిన్ని త్రాగిన పాలిస్తావను కొంటినిగాని నీరు తెచ్చి యిచ్చెదవను కొనలేదు. నేనువచ్చి యడిగిన నిన్ని పాలుబొట్టుకూడ యియ్యలేవా యేమిటిపోని నీజుట్టునాచేతిలోనే వున్నదిలే నిన్నటిసంగతి మఱచిపొయ్యా ననుకొంటివా యనదని క్రిందటిరోజున నొకతప్పు జేసి యాతప్పు బయలుపెట్టవద్దని కాళ్ళుకడుపులు పట్టుకొని బ్రతిమాలు కొనినదగుటచే నిప్పుడితనికిన్ని పాలచుక్క పోయకుండిన నాతప్పు వెలువరించునేమో యనుభయంబున యతని

గడ్డము పట్టుకొనివచ్చి మంచము వేసి కూర్చుండబెట్టి తనకైన పాలన్నియు చెంబులో పోసి తెచ్చి యాతని ముందుంచెను. అతం డా చెంబు చేతబట్టుకొని మాయింటికివెళ్లి చెంబును రేపుపంపించెదనని చెప్పి వడివడి నచ్చోటుగదలి కలభాషిణిని సమీపించువరకు ఝాముప్రొద్దుపోయెను. కలభాషిణి వాఁడు తెచ్చి ఇచ్చిన పాలచెంబు చేతబుచ్చుకొని మిక్కిలియలసి దాహము గొనియున్నదగుటచే నాగోక్షీరంబులనత్యాపేక్షతో గ్రోలి సొమ్మసిలినటుల పరుండ వారలుకూడ నచ్చటనే కూర్చుండి కునికిపాటు పడుచుండిరి.

ఆసమయంబున నొక చిఱుతపులి గఱ్ఱుచు వీరిమీఁది కుఱుక భయభ్రాంతచిత్తులై చెరియొకదారి నరణ్యంబునంబడి పరువిడసాగిరి. అంతయొక చిరుతపులి కలతజెంది ప్రాంతగిరి గహ్వరంబులు ప్రతిధ్వనులీయ గుబ్బెట్టుచునల్లకల్లోలంబొనరింప కలభాషిణియు వెఱ్ఱిపట్టిన దానివలె తటాలునలేచి యడవింబడి చెట్లులు పుట్టలు రాళ్ళుముండ్లనక పలాయనంబు జూపెను. ఓరాచూచితిరా యెట్టి యిడుములనుభవించినను ప్రాణంబుపై నెంత తీపిగల్గియున్నదో సర్వసంగ పరిత్యాగులై కాననంబుల వసించి కందమూలముల భుజించెడి మహానులే భస్మాసురుండు వెంటనంటిన నొడలెరుంగక పారిపోయి తిరన యువప్రాయంబుననుండి మదన సామ్రాజ్య పట్టాభిషిక్తురాలుగానుండి నలలన యిట్టిసమయంబున నట్లు పరువిడుటాశ్చర్యంబుగాదు. ఇది ప్రాణికోటికి నైజలక్షణము. ఇట్లొకరు పోయిన దారినొకరుపోక వారిద్దఱు చెరియొకచెట్టునెక్కి ప్రాణంబులు

కాపాడుకొనిరిగాని కలభాషిణిని విడిచినందుకు నాయకుం డేమి సేయునోయను భీతిమాత్రము మనంబుల గలంపఁ యుదయమున నెట్టకేలకు టాండా జేరి జరిగినవృత్తాంతము నాయకునికి విన్నవించి ప్రార్థించినతఁడు వారల నిర్దుష్టులుగా నెంచి నేమియు ననక విడిచిపుచ్చెను. ఇఁక కలభాషిణి గతినారయుదము

అట్లు కొంతతడవు పరువెత్తి నిలువంబడి యిట్లు వితర్కించుకొన దొడంగె యమకింకరుల వంటి వారిరువురి బారినుండి విధి యీ మిషతో తప్పించినందు కొంతయు సంతసం బొదవుచుండ దానితోపాటే యరణ్యంబున నెందుబోవుదని తోచక చింతయుకూడ బొడముచున్నది. యీ యంధకారంబున నే దెస నొక్కయడుగు గుంచినను తిప్పనో తుప్పనోయని ముప్పు గలిగించుచున్నదే కాని చొప్పుగాన్పించుట లేదు మహాభీతి యను మైకమెక్కించి జగన్నాటక సూత్రధారుఁడీ వనరంగంబులోని కెట్లుదెచ్చెనో యెఱుంగను. అసమర్థపాత్రకు హారోమ్నీధ్వని వినినంతనే హృదయము కంపించునట్లు నాకర్ణంబుల కింపలి జంతుజాలంబుల శ్రావ్యగానంబులు కూడ రుచించుట లేదే నేనికాన రంగంబెట్లుత్తరించి ప్రియసందర్శన లాభంబు వడసెదనని యనేకవిధంబుల చింతించుచున్న యమ్మానవతీతిలకంబున కగ్నిదేవుండు ప్రత్యక్షమైనాఁడోయన సమీపమందున నొకపెద్ద వెలుగు గాన్పించెను.

అప్పుడాపె యది జనపదంబ కానోపునని సంతసంబుతో. నావెలుంగున పొదలసందులనుండి మెల్లగా తప్పించుకొని యాప్రదేశమును సమీపించెను సమీపమునకు రాను రాను

క్రమేణన తేజంబు మిగుల బలమైచిన్నపూసను సైతము గు
ర్తించుటకు వీలుగానుండి మున్ముందు ముగ్గుబుట్టల మాదిరి
బూడిదె దిబ్బలు కాన్పించి సంతసమునకు మారుగా భయం
బు గూర్పసాగెను. తిరిగి నిదానించిచూడ తలపుర్రెలు వెన్నె
ముకలు మోకాలి చిప్పలు మొదలైన శల్య సముదయంబులు
పిమ్మట భాండంబులు భాండశకలంబులు నెత్తుగా కాలిన ప్రదే
శంబులు కనబడి భయసంబంధమైన నివ్వెఱపాటు గల్పిం
చెను తదుపరి నిదానించి చూడ నామంటగో కమలిన శవంబు
నేత్రగోచరంబుగా నాపెనునంబున గరుడపురాణంబున చూ
పబడియున్న భూతప్రేత పిశాచాదుల భయంకర వికారస్వ
రూపంబులు సాక్షాత్కరింప చేతనంబుదక్కి చిత్రకారుండులి
ఖించిన తెరబొమ్మవలె నిలువబడెను కొంచెముసేపట్లు నిలువ
బడి యనేక రాపిళ్లకోర్చి యనేకకష్ట సముద్రంబుల నీదినద
గుటవలన వెఱ్ఱిధైర్యంబు వహించి యాశ్మశానము నుండి
తొలంగి పోవుచుండ హఠాత్తుగా కారుదున్నలవలె నేవురుమ
నుష్యులు నీవిగుడ్డ గోచీలతో నాపెయెదుట బడిన నాచిత్తం
బప్పుడెట్లుండునో వర్ణించుటకు నావల్లనైనదికాదు మొదట నా
వికారపు మానవ్యులీ పెంజూచి కామిసి భూతమని నెఱచి దరి
జేరకుండిరి పిమ్మట నమ్మానిని భయకంపిత గాత్రంబు నీక్షించి
నిజమైన వనితయని గ్రహించి వాండ్లేనాటి భాషతో పరస్పర
మిట్లు మాట్లాడుకొనిరి.

మొ—అరే తమ్ములారా మనను మెచ్చుకొని భగవంతుండీ
కన్నెను మనకొఱకు సృజించి యిచ్చుటకే బంపినాడు

రా లేకున్న నిశ్చయార్థరాత్రియందున నీవల్ల కాటి దగ్గర
కీ చిన్నది యెందుకు వచ్చునురా ఆహా దీనిచక్కదన
మును వర్ణించండిరా మనము కొన్ని గ్రామములలో ననేక
యిండ్లకు కన్నములు వేసి భూషణాదులతో పాటనేక
మందికన్యల నెత్తుకొనివచ్చి యిచ్ఛవచ్చినట్లు భోగించి
వదలుచుంటిమి గాని యిట్టికన్నె యెన్నడైన కనుపడి
యుండెనా ఈదినము బహుసుదినము మనమీ రోజున
దొంగతనమునకు వెళ్ళవద్దు దీనిని యెత్తుకొని మనయింటి
కిపట్టుక కరుగుదము ఇదు మీయభిప్రాయ మేమి

రెం— బుద్ధిమంతుండవును పెద్దవాడవునైన నీ యభిప్రాయ
ముకడ్డు చెప్పుదునా అదయినంగాక యిట్టిదానిసట్టి
వాడైన విడచునా తప్పక గొనిపోదము.

మూ— బీదవాడు చేతికి దొరికిన మొహరీని విడిచితేనే దీనిని
మనము విడచుట

నా— మీరొకవేళ దయదలచినవదలినను నేను మాత్రము
దీనిని వదలను

ఐ— గుడ్డివాడేమో కాని తెలితటిండు దీనినిగొని రావల
దనునా

ఇట్లందఱుకూడ బలుకుకొని యా కలభాషిణిని చుట్టు
కొని పిల్లా చక్కనిపిల్లా నీ వెవ్వరు. యిక్కడ కెందుకొ
చ్చావు అనియడుగ నాపె వీండ్లదురాలోచన నంతను కరనం

జ్ఞల మూలకముగా గ్రహించినది కావున మూఢులయెడ నీతి వాక్యము లుపకరింపవని యెఱింగి కాలానుసరణంబుగా మాట్లాడి వాంఛ్ల నెలవునకు వాండ్రవెంట నడచిపోవుట కొడంబడెను హాంస్లతట మనయింటికి వచ్చినది మనకనుభవ గాక పోవునాయని యెంచి యాపెను తమవెంట నడిపించుకొని తా మునివసించు కొండగుహకు జేర్చిరి. చూచితిరా విధివైదము.

యెట్టి సుశీలకైనను యెట్టిబ్రహ్మచారికైనను కర్మశే షంబనుభవింపక తీరదుగదా యింటికిం జేరినవెనుక నాయే వురుదొంగలు కలభాషిణి సౌంధర్య మాధుర్యంబును నయ నేంద్రియముల ద్వారాత్మప్రిమాఱం గ్రోలి మోహావశంబున తనువులు మఱచి దీనిని నేను పెండ్లిచేసుకొంటానంటే నేను చేసుకొంటానని క్రమముగా లాటీకఱ్ఱలు దీసుకొని కొట్టుకొన బోవువరకు జగడమాడి కొంచెము శాంతించి యాపెయిష్టము వెంటవర్తించుద మని యేర్పాటు చేసుకొని తత్సతీమతల్లిక కడకరిగి తమసంధి విషయమును వినుపించిరి అప్పుడాప డొక యుక్తిపన్ని యిట్లనియె పుర్వారమగురు నన్నేకకాలంబు నంగవి జాయాటుగా నిచ్చుటకె గొనితెచ్చిరి కనుక నేను మీ యందొకరని విడిచి రెండవకరిని పెండ్లియాడుటుచితంబుగాదు మీరు నామసంబున గల కోరికనొకదానిని దీర్చి ద్రౌపదిని పాండవులనుబలె నన్ను మీరేవురు పెండ్లియాడి యైకమత్య

ముఁగల్గి వంతులవెంట భోగించుదన నాదొంగలాపె మాటల
కలరి నీ కోరికను దెల్పుమనిరి.

అంతట కలభాషిణి నేను వేంకటాద్రినాయుఁడు తన భార్యమెడలోని కంటె కాసులపేరు నాకుబెట్టి చేపట్టెదనని కబురంపయమరావతీనగరంబున కేగుచుదారిదప్పియిటుదక్కితిని మీ కేమి యాయనకన్న తక్కువవారుగారు కాని నాకా రేఁడువస్తువులపెట్టుకొనవలేనను కోరికమాత్రము పూర్తిగాగలిగియున్నది గాన నవి తెచ్చియిచ్చి నాకు ముదంబొనగూర్చుఁడు ఇదియే నాకోరిక అనమోహావేశంబున వివేకశూన్యులై యున్నవారు కావున నక్కార్యసాధ్యాసాధ్యంబును ప్రాణసంకటంబును నిర్ణయింపనేరక నవ్వస్తువుల తెచ్చి యిచ్చి దీనిని సంతోషపెట్టి యే పెండ్లి జేసుకొందమని నిశ్చయించుకొని యాట్లు తెచ్చి యిచ్చెదమని వాగ్దానంబిచ్చి బావమరుదులతో దీనికి చవిగల ఫలంబుల దెచ్చిపెట్టి గాపాడుచుండుడని చెప్పి యా దొంగలేవురు తత్కార్య నిర్వహణంబునకై యమరావతీ మార్గంబున బట్టి యేఁగుచుండిరి.



# వేంకటాద్రినాయఁడు.

## ద్వాదశోల్లాసము.

ఒక్కనాఁడమరావతీనగరంబున వేంకటాద్రినాయుమహీపాలుండు మంత్రివిద్వజ్జన పరివృతుండై కార్యాలోచనమందిరంబున నలంకరించి యుండ ముదుకధోవతలు పైసెక్కికొని దుప్పట్లు ముసుఁగుబెట్టుకొని మోట్లుకట్టల చేబూని కొన్నిగ్రామము రైతులువచ్చి రాజుగారికి దడమలుబెట్టి మాయూరిదగ్గిర గుట్టలమీఁద మోకములు చిరుతపులులు పందులు వగైరాలు మాదుంపదెంచి మాపైరులన్నియును పాడుచేయుచున్న వని మొఱవెట్టుకొన నమ్మహారాజు తత్క్షణమే సైన్యయుక్తముగా బయలుదేఱి క్రూరజంతు సంహారణార్థ మాయూరగుట్టలచుట్టు ముట్టెను ఆరోజున నయ్యేవురు దొంగలు రాత్రి యొంటిఘంటకమరావతీ నగరంబును బ్రవేశించి మోకుదుమును గట్టిగాడీ గోడపై విసరివేసి తద్వారాలోన జొచ్చి యంతపురంబు గోడకు కన్నమువేయ వలెనని కడువ్రయాస పడిరిగాని యప్పని సాధనకానికి రామి మఱికొంత విచారించి గడిదగ్గర గోడ రాయికి చేయిపట్టునట్టి బెజ్జము తొలిచి గడిలాగి తలుపుల

నెట్టి చూచిన నుత్తరాశ మండిగములకు మఱిరెండు గొల్సులు తగిలించి దిట్టపఱచి యున్నవగుటచే నాతలుపులు వచ్చినవి కావు వాండ్లు దొంగతనములో నారితేరి యనేకమరుగులు కనియున్న వాండ్లగుటచే నామర్మము గ్రహించి బెజ్జముతొల్చి గొల్సుల దప్పించి లోనప్రవేశించి యారాణిపరుండి యున్నతల్పమును సమీపించి యచ్చటనున్న దీపము వెలుంగునజూడనాపెకంత మంచివస్తువులగు పడమినెచ్చటనో దాచియుంచ బోలునని యెంచుచుండ నచ్చటనొక చక్కని కొయ్యపెట్టె తళ తళ లాడుచు నేత్రానంద మొనరింప నందుండబోలునని యెంచి తమయొద్దనున్న తాళపు చెవులంగొని యొక్కొక్క దానిని క్రమముగా నందుంచి త్రిప్పి చూచుచుండ నొకచెవి త్రిప్పనకాతాళము వచ్చెను. ఆ వస్తువులు రెండును మఱి కొన్ని విలువగల భూషణంబులును వీండ్లభాగ్య వశంబున నందే యుండెను. ఆరాణి నారాత్రి నిద్రాదేవత పూర్తిగా వరించుటవలన నీ దొంగల ప్రయత్నంబున కించుకంతయు నంతరాయము వాటిల్లినది కాదు దొంగలందున్న వస్తువులన్నింటిని గైకొని సంపూర్ణానంద జవసత్వంబులతో నగడీని తొంటి రీతి నిర్గమించి దొంగబాటలం బడి యునికిపట్టున కేగిరి రాణి యరుణోదయంబున లేచి తలుపులు దెఱచియుంట ననుమానపడి సొమ్ములపెట్టె కడ కేగి చూడ నదియును దెఱవబడి భారమంతయు తగ్గి ఖాలీగానుండెను అప్పుడామె దాదిముఖతానావార్తను మంత్రికి దెలియ జేయ మంత్రివచ్చి సంగతిసందర్భములు పరీక్షించిచూచి యాదొంగల నేర్పరితనమునకు నంత

సించుచు దూతనుబిలిచి లేఖనిచ్చి తత్ప్రదేశం బెఱింగించి రాజుగారి కడకుపుత్తెంచెను

వేటకై యేఁగిన భూపాలుండచ్చట సైన్యసహాయుండై క్రూరజంతు జాలంబుల లెక్కకుమిక్కిలి సంహరించి అలసినిశాలఁపు వటమహీరుహచ్ఛాయ విశ్రమించియుండ మంత్రిచే పంపబడినదూత యేతెంచి నమస్కరించి లేఖనిచ్చెను. అది చదువుకొని వేంకటాద్రి నాథుండు వెంటనే నగరంబునకు మరలుండని సైనికుల కాజ్ఞనిడి హయారోహణం బొనర్చి యతివేగంబున నగరంబునకు వచ్చి మంత్రులగూడి కొంత యాలోచన సల్పి బుద్ధిబల దేహబలశాలుర కొందరి రప్పించి తద్వృత్తాంతం బెఱింగించి మీరు చోరుల శోధించి యాదొంగల బట్టి తెండని యనుజ్ఞనిడ వారలిండ్ల కేగి ప్రయాణానుకూలాహారపదార్థంబుల సిద్ధపఱుచుకొని బయలుదేరిరి వారలిట్టి సాహసంబుబూని రాణిగారి భూషణంబు లపహరించిన వాండ్లాటవికులేయని యెంచుకొని అందులో మేటిలునల్వురు నొకరిద్దఱి సహాయముతో నాలుగు దారుల పట్టి యరణ్యంబుల జాడలు దీయుచు నేగుచుండిరి ప్రభువుగారింట సొమ్ములెత్తుకొనిపోయిన దొంగలు సొమ్ములు తీసుకొని సంతోషంబున తమగుహ కడకేఁగు వఱకు కలభాషిణి కనుపింపక పోగా బావమరదులతో నేదిరా యాకన్నెయెటు బోయినదిరా యనిరి. అప్పుడు వాండ్లు తెల్లమొగములతో నేలజూచుచు మంచిమాటలతో మమ్ము మోసగించి తప్పించుకొని పోయినదన వీండ్లగుండెలలో బండబడ నపుడుకటచి అరే మిమ్ముల నమ్మిన నెంతపనిచేసినా

దురా దానిని వదలి మేమెట్లు బ్రతుకుదుమురా యెన్నిరోజులై నదిరా అదితప్పించుకొని పోయి చెప్పుడన వారలు మూఁడు రోజులైనదనిరి అంతట వాండ్లు సాహుకార్ల నింట బారవైచి పిచ్చి యెత్తిన కుక్కలమాదిరి భిన్నమార్గములఁ బడి కలభాషిణి నారయుటకై పరువిడిరి వీండ్లు చింతించుచు వెదకువని ప్రయత్నం బున రెండుయామముల వరకు పరుగెత్తుసరికి వీండ్లలో పెద్ద వాని కెదురుగా ముగ్గురుమనుష్యులు వచ్చుచు యేమిరా యిట్లు పరుగిడుచున్నావనిరి దొంగవాఁడు ఏమిలేదు బాబూ మీకీదారి నొకచుక్క వంటికన్నె యగుపడినదా అది మమ్ము టక్కరిచేసి పోవుచున్నది దానినెట్లులైన పట్టుకోవలెను.

అవిన వారలు కన్నెయెవరు అది నిన్నెట్టుల బొంకించి పోవుచున్నది. దాని పుట్టుపూర్వము మాకెఱింగించిన దాని జాడ నీకు జెప్పెదము అన నద్దొంగవాఁడు వారలను బాటసారులనఁగా నెంచి తమకు శ్మశానములో నక్కన్నియ కనుపడిన దాది తమనెలవులకు గొనువచ్చువరకు జరిగినకథను నిర్భయముగా వినిపించి యంతట కొంచెము సందేహించిన వారలు వీనియొక్క మాటలను యాకృతిని బట్టియాధవిఁడని గ్రహించి మనపిచ్చినటుల వర్తించి మర్మంబును రాబట్ట వలెనని యిట్లనిరి. మాయెడ నీవనుమానంబు వహింపకుము మేమును కారణాంతరంబున నివేషంబుల నేఁగుచుంటిమిగాని చోరవృత్తితో జీవించు వారమే నిస్సందేహముగా నున్నదున్నట్లు వచింపుము తోడ్పడి నీ కామితం బొడగూర్తుము అనవానికి సహజమందమతికి దోడు మదనభూతంబుకూడ సోకియున్నది

ముందుగల దింక ముందుగలదని యాసఁగొల్పుచు చాలదూరమువరకు గొనిపోయి యాకస్మికముగా శృంఖల బద్ధుం జేసి యక్కన్యకు మారుగా మ్లేచ్ఛకన్యచే వరింపఁజేయ తమవాక్యంబుల కనృతదోషం బాపాదిల్లక చేసియుండిరి తమపని ఈ ముప్పురియం దొక్కండా దొంగనుగొనిపోయి యమరావతి జేర్చెను. తతిమ్మాయిద్దరు మిగతా దొంగలబట్టు ప్రయత్నములోనుండిరి. భిన్నమార్గంబుల పరువిడిన మిగతా దొంగల నల్గురి కాకన్నియయు చిక్కనది కాదు. తతిమ్మా రాజబంట్లకు దొంగలు చిక్కనారు గారు.



# వేంకటాద్రినాయఁడు.

## త్రయోదశోల్లాసము.

దొంగలు కాసులపేరు కంటె దొంగిలించుకొని రాగ లంజలకై యమరావతీ నగరంబున కేగినపిదప కలభాషిణి తనకు నావలిగానున్న వాండ్ల బావమరదుల నిర్వురజూచి మీకు పెండ్లిండ్లయినవా మీకు తలిదండ్రులున్నారా మీరెందుకని పట్టణంబుల నివసింపక యీయడవుల పడియుండెదరని యెరుగనిదానివోలె నడిగిన నావారు వాండ్లిట్లనిరి. మేము పుట్టడము బస్తీలోనే పుట్టాము. మేముపుట్టగానే మాఅయ్య అమ్మ చచ్చిపోయారు. మాబావలకు అయ్య అమ్మలు లేరు. మేమందఱము బిచ్చమెత్తుకొని పెదవాండ్లమై కొద్ది కొద్ది దొంగపనులుచేస్తు నల్లరుచేయ నారంభిస్తిమి. ఆబస్తీవాండ్లు రాజుగారితో మేమల్లరులుచేస్తూ చెంబులు బిందెలు దొంగిలించుకొని పోతున్నామని మొఱబెట్టుకున్నారు. అంతట రాజుగారు మమ్ముల బిలపించి నాలుగునెల్లు కొట్లోబెట్టించి వదలిపెట్టారు. అప్పటికైనను మేముమానక మునుపటికంటె కాస్తపెద్ద పెద్ద దొంగతనాలే చేస్తుంటిమి. మళ్ళీ వూళ్లోవారుపోయి మొఱబెట్టుకొనగా రాజుగారు మళ్లీ మమ్ముల్ని బంట్రోతులచాతకట్టి తెప్పించుకొని వీండ్లకు కొట్టులో బెడితే లచ్చనము లేదు. చెట్లకంటగట్టి చింతబరికెలతో బాదమన్నాడు అలంజల

ముండాకొడుకులమా నీమాట తప్పకుండావిని నీవుచెప్పినటు చేస్తాము. మామీద దయయుంచి చెప్పవేఅక్కా యని ప్రతి మాలిన నక్కలభాషిణి వారలంజూచి యెఱుంగుదురుగదా నేనుమొదట మీబావలకు కనుపడిన శ్మశానము.

అచ్చటికనువరకు శ్మశానమంటే యేందో మాకు తెలియదు అన నాపె శ్మశానమనిన మనుష్యులను గాల్చు చోటు వల్లకాడు అనిచెప్పిన దానికి కొంచెము పడమరగా పెద్ద మఱ్ఱిచెట్టున్నది. ఆమఱ్ఱిచెట్టుక్రింద నొక కన్యకలదు. అక్కవ్వ యెవరు అదియచ్చట నున్నసంగతి నీకెట్లు తెలియు ననెదరేమో వినుడు దానివృత్తాంతము అదినాకు మేనమామ కూతురు మరదలు అది నేనుకలసి యమరావతి కేగవలయు నని వచ్చుచు మార్గంబు దప్పి యామఱ్ఱిచెట్టు కడకు వచ్చు వరకు పెద్దవెల్తురు మాకు కనుపడినది.

అంతనేను ఆ వెల్తురుదగ్గిర మనుష్యులుండ వచ్చును. పోయి మార్గము నడిగి తెలిసికొనివచ్చెదను. యీమూట లు ముల్లెలు యిచ్చట బెట్టుకొని యీ మఱ్ఱిచెట్టుమొదట కూర్చుండుమని చెప్పినేను బయలుదేరి చాలదూరము వచ్చి ననుగాని మొదట దగ్గరగా కాన్పించినవల్ల కాదు గాన్పించినది కాదు నే నదిపొలమునం దున్నమనుష్యులచే కంపో కట్టోత గల బెట్టబకిన వెల్తురుగా నెంచి వచ్చినదాన నగుటచేయా వల్లకాటిని చూచినతోడనే ప్రాణములు పైననే పోయినవి అంతలో మీబావలువచ్చి నాకు కొంచెము ధైర్యముగలిగించి

తీసుకొని వచ్చినారు. నేనుదాని మాటిప్పటి వరకు మఱచి
పోతిని మీరు మాటప్రస్తావన గానే కన్నియనై సలంకించు
కొనవలెనను నగరు చక్కన జ్ఞాపకమువచ్చినది. అది యెట్లు
బోవుటకు దారి నెఱుంగని దగుటచే నచ్చటనే పడి యుల్లాను
చుండును మీయదృష్టము వలన మృగములేవియు నింతవరకు
భక్షింప కుండెను. నాకును మీకును గూడ మేలు గలుగును ఇదిగో
చీటి వ్రాయుచున్నాను యీచీటిని గొనిపోయి దానికి చూపి
నట్లైన సంతోషముతో మీవెంట పడుగిడి వచ్చును అని
యొక తాటియాకు ముక్కమీద ఘంటముతో నేదియో
వ్రాసి వాండ్లకిచ్చిన నా యిర్వురు నొకరికన్న ముందొ
కండేగి యా కన్నెను చూడవలయునని కోరికతో
నడుచుచు లేచుచు ప్రాణములకుం దెగించి యాశ్మశానంబు నై
వు దారిపరువిడిరి కలభాషిణి చీటి వ్రాసియిచ్చుటకు తాటి
యాకును ఘంటంబును నెటనొందుదు గొనిపోయెనని శంకిం
తురేమో ఆపె వెంటగొని పోలేదు అదాంగ లెచ్చటనో దొం
గిలించి తెచ్చిన తాటియాకుల కవిలెలకట్టలు ఘంటములు
నాగుహ యందెన్నియో కలవు.

అంతట కలభాషిణి యాపాడు గుహను విడిచి మెల్ల
గా నొకదారి బట్టి దైవమే తనకు సహాయముగా నొక్క
యామడ దూరము నడచి యందందు చెట్లక్రింద రాలియున్న
యాటవిక ఫలంబుల చవిమీర మెక్కుచు కొంత శాంతింపఁ
జేసుకొని గమనా యాసంబు వాయచల్లనైన చెట్టునీడ కటిక

రా నేలపై మేనుజేర్చి తనకష్టంబున కంత్యం బెపుడాయని యోచించుచు నెన్నికష్టముల సహించినను తుదకా వెంకటాద్రి నాయని మహీపాలుని గూర్చుమని దయామయుండగు భగవంతుని ప్రార్థించుచు నెండవేడిమి తగ్గువరకు విశ్రమించి మరల లేచి మార్గంబు నంబడి శూరార్యాశ్రమ ద్వారంబువరకు నడచినను యాపికంటి కొక్క మనుష్యుండైన గాన్పించిన వాఁడు గాడు అంతట నాపెపొద్దు గ్రుంకిన వెన్కనీ మహారణ్యంబు నదాటి గాన్పింప నొంటి జోవశక్యంబు గాదని యెందసమయ మయ్యానో తత్ప్రదేశ మందే మారేయిగడప నిచ్చయించుకొని నిలువబడియుండ ప్రక్కమార్గంబున నుండి సావుకారొక్కండు బిరబిరవచ్చి యెవరమ్మా నీవనిన యాతనిముఖంబు నైపు తేరిపార జూచి దుష్టుండుగాడని యెంచి తనవృత్తాంతమును కొంతవరకు క్లుప్తముగా నాతని కెఱింగించి తనను కూడ సమ్మదిగానొక గ్రామంబు జేర్చుమని ప్రార్థించిన నతండు ప్రపంచజ్ఞానము విస్తారముగాగల వాఁడు గావున వల్లెయని యాపెను వెంటనిడుకొని ఝామురపొద్దు పోవువరకు తమ గ్రామంబైన తిరువూరికి జేర్చి తమయింట భోజనంబు పెట్టించిపరుండుట కొకచాప నిచ్చినపుచ్చుకొని యాతని యోగ్యతా బుద్ధిని స్తవించుచు నిశ్చింతగా నిదురించెను.



# వేంకటాద్రి నాయుడు

## చతుర్దశోల్లాసము.

తతిమ్మా నల్వురుదొంగలు వెఱ్ఱిపట్టినమాదిరి నడవి యెల్లతిరిగి తిరిగి యొక విశాలమార్గంబుకడ కలుసుకొని వాండ్లలో వాండ్లు మాట్లాడుకొన జొచ్చిరి.

మొ॥ తమ్ముల్లారా ఆముండ కన్పడకపోతే మనమేట్లా బతకాలరా నాల్గురోజులు టిక్కుటిక్కుమంట మురిపించి మననోట మన్నుగొట్టి పోయిందిరా.

రెం—నిబద్దే అన్నానిబద్దే దాన్నివదలిపెట్టి బతకలేమన్నా దాన్ని మన పాణాలున్నంతమట్టుకు తిరిగి పట్టుకొందామన్నా.

మూ—ఆముండ పాడుగాను తిరిగితిరిగి కాళ్ళనిండా కంపముల్లిరుచుకొన్నాము అదికనబడినదికాదు. దాన్నివదలిపెట్ట బుద్ధిలేదు: అది మనపాణాలకే దోఁకిందిరా అన్నట్లు.

నా—ఏదిదొరకలేదు. మరెల్లె మన అన్నకూడ అగపడలే డెటుపోయాడురా అనియిట్లు కలభాషిణిని గురించి విచారించుకొనుచు నిలువఁబడియుండ నాతోటి ప్రయాణికులమాదిరి పదుగురు మనుష్యులు వాండ్లసమీపమునకువచ్చిరి, వారినిజూచి దొంగలు అయ్యల్లా మీకెక్కడైన చక్కంటికన్నె అగుపడ్డదాయని వారలు వీండ్లమాటలవల్ల యాత్రికులనుగనిపెట్టి మిగతా నల్గురు దొంగలు వీరలే కావచ్చుననుకొని మాకునిన్నటిరోజున మధ్యాహ్నము చక్కనికన్య యొకతె దారిలో కనుపించినది ఆపె యెందువలననోగాని చచ్చుచు బ్రదుకుచు పరువిడుచున్నది. నీదేవూరు నీవెవరు అని పలకరించి నప్పటికి జవాబు చెప్పినదికాదు ఆకన్యతో మీకేమిపనియని బాటసారులు పలుక నాదొంగలు వారికాపె వృత్తాంతంబును వినిపించి యదిమీకెక్కడగుపడిందో అక్కడికి మమ్మల్ని తీసుకొనిపోయి దానిజాడ గట్టిపట్టుకొని మాకిస్తే మీకు మోయగలంత సొమ్మిస్తాము బాబుల్లా అనిబ్రతిమాలిని ధనంబునకై యాసించిన వారిమాటరివల్లెయని వాండ్ల వెంటబెట్టుకొని చాలదూరము తీసుకవచ్చి వారలు ప్రచ్ఛన్నరూపంబులతో నీదొంగల బట్టుటకై తిరుగుచున్న వెంకటాద్రినాయుని బంట్లకనుక చటాలున నొక్కొక్కనికిద్దరుముగ్గురు తలపడి సంకెలలచే బంధించి యమరావతీ నగరమార్గంబున గొనిపోవుచుండిరి.

అచ్చట కలభాషిణి మరునాడుదయంబున నా సావుకారిచే నమరావతీ మార్గంబును దెలుసుకొని మెల్లగా నామార్గంబునుబట్టి చనుచుండ నద్దొంగల బట్టుకొని వచ్చుచున్న రాజబంట్లామెను సమీపించి యమ్మానినీమణి యందంబున కచ్చెరువంది నిదానించిచూచి ఈమె నెచ్చటనో చూచితిమని సంశయాకులులై యొకరిమొగం బొకరు చూచుకొను చుండ నద్దొంగలు తలయెత్తిచూచి మమ్ముల్నిట్లా చేసి పోతున్నావా యని యొక్కపెట్టున నేడువ నారంభించిరి. అప్పుడు రాజభటులు నీచోరుల మోసపుచ్చి పోవుచున్న కన్యకారత్నమిద్దియే యని గ్రహించి యామెవృత్తాంతం బడుగందలంచి అమ్మాయని సంబోధించి నీవెవరో యెచ్చటిదానవు యెచ్చటికిటుల నొంటరిగా నేగ నేమి కారణమో యెలనిన్ను చూచి యీదొంగ లేడ్చుచున్నారో నీయావత్కథావిస్తారమును మాకు వినుపింపుమని ప్రార్థనాపూర్వకముగా నడిగిన తనకు దోచుచున్న శుభనిమిత్తంబుల వలన కలకదేరిన మనంబుగలదై నిస్సంశయముగా తనయావద్వృత్తాంతమును రాజభటుల కెఱింగించెను. రాజభటులు వికసించిన ముఖములు గలవారై తమసంగతిని వినుపించి కలభాషిణి కుల్లాసంబు గల్పించి యామెయలసటనీక్షించి నడిపించుకొని కొంతపోవుట కిష్టములేనివారై యొకరిద్దరమ్మానవతీవతంసమునకు కాపుగా నుండి మిగతావారు దొంగలతో సహా యమరావతీ నగరంబు ప్రవేశించి యజ్ఞశాలయందు సవనదీక్షా దక్షుండైయున్న వేంకటాద్రినాయ ప్రభుచంద్రునితో దొంగలు చిక్కిన తెఱంగు

ను కలభాషిణి కనుపించిన క్షేమోదంతము వినుపించిన మహారాజచంద్రుని మనంబప్పట్లు నెట్లుండునో వర్ణించుటకన్న నూహించుట సులభముగదా

తదనంతరము కలభాషిణి కృత్తాంతము నామూలాగ్రముగా నరసి జగన్నాటక సూత్రధారి ప్రజ్ఞావిశేషంబున కలరుచు శిక్షించుట కుసమయంబుగా మిసద్దొంగల చెరసాలయందుంచుమని యాజ్ఞాపత్రిక వ్రాసియిచ్చి శిబికనుగొని పోయి కలభాషిణిని సత్వరంబుతోడ్కొని రండని రాజానుమతినద్దొంగల పత్రికతో సహా చెఱసాల యజమాని కొప్పగించి బోయలచేశిబికను మోయించుకొని పోయికలభాషిణి నందుకూర్చుండబెట్టుకొని వేవేగ నమరావతిని జేరి కలభాషిణి గొనివచ్చితిమని రాజుగారికెఱింగించిరి రాజంతట ననుకూల సమయంబునవచ్చి తాలినుండు కావునన ద్యానిని ముఖపద్మంబును వికసింపఁజేసి యంతఃపురంబున జేర్చుమని సెలవొసంగి మరలయాజ్ఞాల కరిగెను కలభాషిణికి వేంకటాద్రినాయ మహీపాలుని యంతఃపురంబున వసియించు భాగ్యము నేటికబ్బినది సుశీలయైన కన్యకామణికి నడుమ నెన్ని యిక్కట్టులు సంప్రాప్తమైనను తుదకభిలషిత పురుషుని చేపట్టి సుఖించుట నిశ్చయము.

అంతఃపురంబునగల యింతులెల్ల సంతసంబు నకాంతామణియైన కలభాషిణిని సందర్శించ వచ్చినవారినెల్ల నాపెయు చితసముస్కార విధులహర్షింప జేయుచుండెను. అప్పారంబున

యాగమాహాత్మ్యము దినదినాభివృద్ధిజెందుచుండ రాష్ట్రంబు
నగలబీదసాదలు విప్రోత్తములందరు నాననరంబున నిండియుండిరి.
అపట్టణ వైభవంబయ్యాగదినంబులలో జూడని వారి కన్నులు
నిష్ప్రయోజనంబులుగదా మందాకినీ తీరమందలి యయ్యమ
రావతి కృష్ణాతీరమందలి యియ్యమరావతితో నానుసామ్య
మేగాని వైభవంబున దీని శతాంశమునకును సమానము కా
జాలదని నిర్భయముగా దేవసభయందును వక్కాణించి జయ
పత్రికల బొందవచ్చును.



# వేంకటాద్రినాయఁడు.

## పంచదశోల్లాసము.

ఒక్క రోజున శుభముహూర్తంబున బహుజనసమ్మర్దం
బుగల యాగశాలయందు సమస్తశుభలక్షణములతో నొ
ప్పారెడు పశుశ్రేష్ఠంబును బట్టి మంత్రానుసరణంబుగా సంహ
రింపబూనియున్న సమయంబున పాపము పాపము సంహరిం
పకుఁడను గంభీరారావము తత్సభవారి కెల్లఱకు శ్రోత్రరం
ధ్రంబుల జొరఁబాఱెను. అంతట సభవారెల్ల సంశయాకుల
మానసులై చూచుచుండ సిద్ధుఁడొక్కరుండు తటాలున నాయా
గశాల ప్రవేశించెను. ఆసభయందు కొందరు పుణ్యపురుషు
లాసిద్ధుని పూర్వము చూచియున్నవారు కావున మహారాజ
సమేతంబుగా లేచి నమస్కరించిరి. పిమ్మట సభవారెల్లరు
నమస్కరింప నుచితరీతి నందఱ దీవించి సన్మానపూర్వకము
గా నీయఁబడిన గద్దియ నధిష్ఠించి రాజేంద్రునిం జూచి నేనిచ్చ
టికి రాకుండిన నవివేకబుద్ధి నిప్పటికి యాగనెపంబున పశువధ
మహాపాతకంబు మెడఁగట్టుకొందువు గదా యీ యాగంబు

కొఱకు పశువును సంహరించినను పాపంబుగలదా స్వామీ యనుచు సంశయముతో నడిగిన కలదని యాసిద్ధుండిట్లు చెప్పెను.

సీ— భూలోకంబున పూర్వమిటులనే యొకప్పు డాకరాజేంద్రుండు పశుబంధ యాగంబొనర్చుచుండ మహేంద్రుండు బృహస్పతింజూచి గురువర్యా యాగనెపంబున భూలోకంబునపశువులను సంహారించి బ్రాహ్మణులను వారు సైతము మాంసమును భక్షించుచున్నారు పశువధంబున వారలకేమైన పాపంబుగలదా యనిప్రశ్నించి నబృహస్పతి యిట్లు జెప్పెను దేవేంద్రా వినుము జిహ్వాచాపల్యమణచుటకు గాను యజ్ఞముల యందు మాంసమును చవిజూచి తజ్జంతు సంహారదోష హరణార్థము సంఖ్యాకజనంబుల మృష్టాన్న పానాదుల పరితృప్తులం జేయుచున్నారు అంతమాత్రము నహింసా పాపంబు శమించదు అదియునుగాక యజ్ఞంబులందు నీవు హవిర్భాగములంగొని వారల కుశిదినంబున రంభాస యోగా మహాసౌఖ్యంబులగూర్చుదువని ప్రభుమపకీయా నాథలగు సాధుజంతువులబట్టి హింసించి తత్పాపంబున నధోగతులపాలై మరుజన్మమున దరిద్రులై పుట్టి మహాకష్టంబుల ననుభవించుచున్నారు. ఇన్నివిధంబుల జూచినను మాంసభక్షణం బుడిగి భూతదయార్ద్రహృదయుండైన మహాపురుషుండే సర్వలోక సర్వజనపూజ్య సామ్రాజ్యచక్రవర్తి భూతదయతోసాటి యగునది ప్రపంచంబున మఱొకటి లేదు. ఒక్కప్రాణిని హింసించిన పాపము నూరు పుణ్యవ్రతంబు లొనర్చినను పోనేరదు. హింస జేయకుండ వ్రతము నెపంబున పెక్కుమంది బీదలను భోజన

పావాదుల సంతుష్టిపఱచుట కడు శ్లాఘాపాత్రమైన కార్యము అహింసయనునది నాలుగు పాదంబులచే నొప్పిన గోవువలె యున్నది గోవునకొక కాలు లేకుండిన నెటుల నడువనేరదో యీయహింసా వ్రతంబుకూడ నటులే నాలుగింటియందొకటి చెడినను చెడును. అవి నాలుగేవి యనగా మనంబున హింస చేయుదమని తలంచుట వాక్కుతో చేసెదనని చెప్పుట. కాయంబుతోఁ జేయుట. తన్మాంసమును భక్షించుట యనునవి నాలుగు ఇఁక నీవాలోచించుకొనుము. సాధుజంతుహింసవలన నెట్టిపాపంబు గలదోయని నుడివిన నింద్రుండు మహాత్మా మీ దయవలన నిసంశయంబు తీరినది కాని శ్రద్ధాదికర్మలని మానవులు మాంసములతో పితృదేవతల పేరుజెప్పి భోజనంబుచేయుచుందురు. నిజముగా హానిపితృకులకు వీరుబెట్టునట్టి శ్రాద్ధాలు ముట్టుచున్నవా అజాతుహింసవలన పాపంబులేదుగదా యన దేవగురుండు మరల నిటులనియె శ్రాద్ధమనగా శ్రద్ధతో చేయునది. సజీవులైన జననీజనకులను సుతులు శ్రద్ధతో నుపచారాదులు చేయుట శ్రాద్ధముగాని మృతించినవెనుక వీరు తల్లితండ్రుల పేరుజెప్పి విప్రులకు మనోల్లాసంబు గల్గునటుల కుంచముల కొలది బియ్యము మూటలుగట్టి పంపించినవి యెంత మాత్రము చనిపోయిన తల్లితండ్రులకు సద్గతుల గూర్పజాలవు. చేనియొద్దనున్న వానిపేరుజెప్పి యింటనున్నవాఁడు భుజించిన వానియాకలి యేమాత్రము శాంతించునో అదియు నంతయే యిఁకనిట్టి యఫలత కార్యమునకుగాను చేయునట్టి జీవహింస పాపమని వేఱుగ జెప్పవలయునా యే కార్యమునకుగాని సాధు జంతుహింస గూడదు. ముమ్మాటికి కూడదు.



# వేంకటాద్రినాయఁడు

## షోడశోల్లాసము.

ఆదియుటుండ పంచమ వేదంబనబరగు మహాభారతం బున ధర్మవరావతారుండగు ధర్మరాజునకు సకలశ్రుతిస్మృతి వేత్తయగు భీష్ముండహింసాతత్త్వంబును గూర్చి చెప్పినపద్యం బులు వినుము.

ఆ॥ వె॥ దంతియడుగులోన ♦ దక్కిన జంతుచ
యంబు నడుగులెల్ల ♦ నడఁగియుండు
నట్లు ధర్మకోటు ♦ లన్నియు లోనగు
నిద్ధగుణ యహింస ♦ కింతనిజము

తే॥ గీ॥ వాజిమేధంబుకంటెను ♦ పూజనీయ
కర్మ సుందరు మాంస భ♦క్షణము విడుపు
విషము చంపుటయును చంప ♦ బనుచుటయును
కల్మషంబుల కెల్లన ♦ గ్గలసుడధప



కం॥ తనుసమలిన వానినములు
నని మాంసము తెలుఁగు సెప్పు ♦ నాగమములుగా
పున దద్భక్షణముడిగిన
ననఘ తపంబునకు జాలు ♦ నదియొక్కండున్

ఉ॥ మాఱినరు రాతనుంగలదే ♦ మాంసము ప్రాణులమీఁద గాకయ
మ్మేనల బొందుసప్డుతము ♦ మేనులు సోకినమాత్రయొట్లగున్
దాని దలంపగావలదె ♦ కానడి మానిన హింసలన్నియుఁ
మానవె యుంచును త్తముఁడు ♦ మాంసము మానుదయా
ర్ద్రచిత్తుఁడై

ఆ॥ వె॥ మాంసమాన కునికి ♦ మను జేశ ప్రాణవ
ధాభిరతి దొరంగు ♦ టగుటఁ జేసి
యుట్టివాని కథయ ♦ మఖలభూతంబుల
వలన నెపుడు నెందు ♦ గలిమి నిజము

కం॥ స్వాయంభువుఁడను మనువును
నీయర్థము సెప్పలోక ♦ హితముగ యూర్కం
డేయాదులు మాంసముడుగు
టాయు శ్రీరూపకారి ♦ యగుననిరధిపా

కం॥ విను మాంసముగోరు నరుఁడు
దనుజుఁడ శూవెమును దేవ ♦ తలుమాంసంబుఁ
దినుటుడిగి గాదె దానవ
జనితభయము బ్రోవద్రోయ ♦ జాలిరివత్స

కం॥ దానము ధర్మము తపము
జ్ఞానిష్ఠయు నంగబరగు ♦ సత్క్రియ లెల్లన్
మానవనాథ యహింసా
నూనాకృతు లండ్రు శ్రుతుల ♦ నూనిన పెద్దల్

కం॥ శతవర్ష దుష్కరతపః
కృతిసంజాదు దినమినగుసు ♦ కృతమిలి రెండున్
మతిదలప నొక్కరూపని
శ్రుతివేదులు చెప్పుదురు ధ ♦ రాక్షితినాథా

కం॥ తపముల దానంబుల బ్ర
హ్మపురి నివాసంబుతప్ప ♦ దనరాదు జనా
ధిపమాంసమున మలనిపు
ణ్యపురుషునకు సులభమందు ♦ రానెలవాద్యుల్

తే॥ గీ॥ అధిప యాషాఢముఖ్యంబు ♦ లైన నెలలు
నాలుగింటను మాంసంబు ♦ నమలకుడుగు
టాయురారోగ్య బలకీర్తు ♦ లను ఫలములు
నాలుగింటనుగూర్చున ♦ న్నగునకండ్రు.

ఆ॥ వె॥ అన్యమాంసమునని ♦ జాంగమాంసమును పో
షింతునటకంటె ♦ జెట్టలేదు
మాంసభక్షణంబు ♦ మానుటకంటెను
మేలు లేదికర్మ ♦ జాలకమున,

తే॥ గీ॥ మాంసభక్షణదోషంబు ♦ మాను దాన
మహిమ నన టయు మాంసంబు ♦ మఱి భుజింప
కున్న జాలైశ్వర్యములెల్ల ♦ యను దలంప
దయకు సదృశంబు లేదు ♦ ధరణినాథ.

తే. గీ॥ ఆత్మసదృశత ప్రాణభ ♦ యంబు సంను
ప్రాణులకు నెల్ల గని మాంస ♦ భక్షణంబు
మాను దయ నార్ద్రమానసుం ♦ డైన పురుషుఁ
డాతనికి బ్రహ్మలోకాదు ♦ రాటపట్టు

కం॥ భూతములు కలుగ నతనికి
భూతము లఖినములు నలుగు ♦ భూతహితార్థి
భూతతతికభయమిచ్చిన
పూతాత్మున కభయమిచ్చు ♦ భూతావళియున్

అ॥ వె॥ దానములును దపంబు ♦ ధర్మంబు యజ్ఞంబు
శౌచమంత్రతంత్ర ♦ సత్యములును
బుధులహింసరూప ♦ మఁలుగాగ జెప్పుట
యెల్లకలిమి సుమ్ము ♦ హింసకలిమి.

కం॥ నరనాథయహింసాగుణ
పరిగణనము కొంతమాత్ర ♦ బలికితి ధర్మే
తరయగు నహింస మేలిమి
యరయంగడు పెద్దదాని ♦ నలవరవుమదిన్,

ఇటుల నహింసయే పరమధర్మమని యుద్గ్రంధములు
వేనోళ్ళ జాటుచుండ వివేకశూన్యుఁడవై నీవు కూడ నవివేకుల

మాదిరి సాధుజంతుహింసతోఁ గూడిన యజ్ఞంబులు మొదల పెట్టితివా చాలించుమిట్టియజ్ఞంబులుకూడదు. చాలించుమనిన సిద్ధునితో స్వామీ యేకార్యమునకును జంతుహింస కూడదని శ్రుతిస్మృతులయందు జెప్పబడియున్నదా లేక యొక్క భారతేతిహాసంబుననే నాయనిన సిద్ధుండిట్లు జెప్పెను.

శ్లో॥ వాకృత్వాప్రాణినాంహింసాం
మాంసముత్పద్యతేక్వచిత్
నచప్రాణివధస్స్వర్గ్య
స్తస్మాన్ మాంసంవివర్జయేత్''

వర్జయేన్మధుమాంసంచ అని శ్లోకరూపమున స్మృతులకెల్ల నుత్తమమగు మనుస్మృతియందుఁ జెప్పబడియున్నది. యీశ్లోకపదమున కర్థమేమనిన ప్రాణిహింస చేయక మాంసంబు లభించదు. ప్రాణిహింసఁ జేసిన స్వర్గము దొరకదు గావున మాంసము వర్జింపవలయు దానితో బాటుమధువును కూడవర్జించవలయునని ఇఁక యజుర్వేదంబున "నమాంగ్నను శ్నీయాదితిశ్రుతిః" అని యున్నది దీనికర్థమేమనిన మాంసభక్షణము సురాపానము. జూదము వ్యభిచారము మానవులయొక్క మనస్సామర్థ్యములను సంపూర్ణముగా నిర్మూలించును అనినీవు గుఱ్ఱమును చంపకుము నీవు ఆవునుచంపగూడదు నీవు మేకనుగాని గొఱ్ఱెనుగాని చంపగూడదు జింకను రక్షింపుము పాలిచ్చునట్టిగాని మఱేవిధము గానుపయోగ పడునట్టిగాని మఱేవిధముగా నుపయోగపడునట్టిగాని పశువులను జంపగూడదు యని యజుర్వే

దమువంద నేక చోట్ల జంతుహింసగూడ దని ప్రమాణవచనములున్నవి గావున ప్రతిమానవుండును జంతుహింసఁ జేయక సమస్తప్రాణులను స్వప్రాణముగా చూచుచుండు దయార్ద్రహృదయులకు నిర్వాణపదంబు కరతలామలకంబని రాజునకు బోధించిన నాసభవారందఱు నాసిద్ధుని యొక్క యహింసాతత్వబోధమును శ్రద్ధతో వినియుఁ గనీ రోజు మొదలుకొని హింసను మానుదమని నిశ్చయించుకొనిరి

రాజు—తనయహింసా తత్వబోధామృతంబును గ్రోలియు తృప్తుఁడ నైతిని నిక ముందు హింసా కార్యములను మొదలు పెట్టియుఁక నేను చేయను నారాష్ట్రజనుల కెల్లఱకు బోధించిన నివారిని కఠినముగా శాసించి నారాజ్యమందు జీవహింసా పిశాచమును లేకుండ జేసెద యిదివరకు నేజేసిన జీవహింసలకు ప్రాయశ్చిత్తంబు లొనరించుకొనియెద నీయాగంబుతో నింక నాపని లేదు చాలించెదనని సభవారి నైపుజూచి యాగంబును చాలించితిననని చెప్పబోవుచుండ సిద్ధుండు కరసంజ్ఞచే వారించియశేష సాంఖ్యగల బీదజనులువచ్చి నీయాగంబున సంతుష్టిగా భుజించుదమన పేరాసలు గల్గియున్న నగరంబున బసియున్నవారలు కావున నీవిప్పుడు దీనిహింస లేనిక్రమముతో పూర్తిగావించి బీదలకెల్లరకు సంతుష్టి భోజనంబులు పెట్టించుమనిన రాజట్లయొనరించి బీదలకు షడ్రసోపేతంబుగా భోజనం

బులు వెట్టించి వస్త్రములు దానమిచ్చి వీడ్కొలిపిన సజ్జనం బెల్ల భూపాలుని యౌదార్య గుణంబును వేవిధులఁగొనియాడుచు సుఖంబుగా యునికిపట్టులఁ జేరిరి తరువాత భూపాలుఁడు సిద్ధుని తోడ్కొని కలభాషిణి యంతఃపురంబున కరిగిననమ్మానవతీమణి సంపూర్ణ సంభ్రమమున నేగుదెంచి సిద్ధునకు నమస్కరించి దీవన గైకొని ప్రభువునకు నమస్కరించిన నతండును సముచితరీతి దీవించెను. ఆపైని కలభాషిణి సిద్ధునికి మిక్కిలి కృతజ్ఞత నుపచారములు సల్పుచు రెండుమూడురోజుల సెల్వుకొని పూజించి సంతోషపూర్వకముగా సాగనంపెను తదుపరి వేంకటాద్రినాయ మహీపాలుఁడు కలభాషిణితో గూడుయౌరాజ్యసుఖంబుతోపాటు మదనసామ్రాజ్య వైభవమును కూడ సంపూర్ణముగా ననుభవించు తనదేశంబున హింసయనునది పేరునకు గూడ లేకుండునట్లు జేసి యేకోత్తర శతశివాలయంబులు గట్టించి యాశివాలయంబు లన్నింటియం దొక్క ముహూర్తంబున లింగాకారప్రతిష్ఠలఁ జేయించి హిరణ్మయగోగర్భమును జొచ్చుట మయూరవాహనారూఢుఁడై సాంఖ్యామనస్కారాదియోగంబుల నభ్యసించుట మొదలగు కార్యములాచరించి జ్ఞానధనమును సముపార్జించి ప్రజలకన్నబిడ్డలరీతి కృపాదృష్టి నిల్పించి రక్షించుచు జగద్విశ్రాంతానంత సత్కీర్తి గణించుచుండెను. కలభాషిణి పతియే దైవమని భావించి పతి

దాస్యమే మోక్షప్రదంబుగా నెంచి రాజపత్నులయెడ గౌరవ విశ్వాసములుగల్గి మాతృభావంబుతో మెలంగుచు పతియును మఱియు తనతల్లియుకూడ నచ్చటికి రప్పించుకొని పోషించుచు పతివ్రతా శిరోమణుల కెల్లనగ్రగణ్యయై యష్టైశ్వర్యంబుల ననుభవించుచు నిరహంకృతితో విజ్ఞానధనంబు నార్జించి లోకమందలి స్త్రీలకెల్ల దారిచూపించు చుండెను రాజపత్నులు కూడ నీపెయందసూయ లేక నిర్మత్సరత్వంబున కలసిమెలసి యప్పటినుండియు నన్యోన్య ప్రేమానుబంధంబుల మెలంగుచుండిరి. యీసకలభామిని గుణంబును శీలంబునుబట్టి యేకులంబున జేర్పవలెనో యేపతివ్రతామణితో బోల్పదగునో చదువరులే నిర్ణయించుకొందురుగాత. అష్టకష్టంబుల కోర్చి మాయోపాయంబు వలన చెంచులదోడ్కొని వచ్చిన భుజంగ[illegible]ను, స్త్రీవేషముదాల్చి మంగాభాయి యనుపేరుతో [illegible]గారితో స్నేహముజేసి భుజంగరావు మాయానాటకంబునకు ముఖ్యపాత్రయై నటించినదూతిను పాతూరినగరంబునను మీర్ ఖాసిమ్ పిటయందును మాయావేషంబులతో నంటిచి ప్రభువునకు జయంబుగూర్చిన యోధచతుష్టయంబును, దొంగలను పదకిపట్టుకొని వచ్చిన వీరాగ్రేసరులను, సన్మాన గౌరవ బహుమానంబుల సంతోషింపజేసెను, తరువాత నంతఃపుర చోరులశిరంబులు ఖండించుడని మహారాజాజ్ఞ

నీతూబోవుచుండ కలభాషిణి వలదని వారించి యోజ్ఞాన్యంత మునకు కఠినశిక్ష విధించుడని పలుకానీయ ప్రభుండ నొన రించె మనదేశమందలి స్త్రీలనెల్ల నీకలభాషిణి వంటి పతివ్ర మణులగావించి భారతమాతకు వన్నియు హెచ్చుటకు కృపా మయుండగు భగవంతుని మనమెల్లరము సర్వకాలము సర్వా వస్థలయందును నిశ్చలబుద్ధిమై ధ్యానించుచుందుము. నాత మనదేశమునకు నెవ్వనికిగాని జీవహింస జేయువలయునను తలం పుదయింపకుండునుగాత




ఓం హ్రీం హిరణ్యగర్భాయనమః

దాస్యమే మోక్షప్రదంబుగా నెంచి రాజపత్నులయెడ గౌరవ విశ్వాసములుఁగల్గి మాతృభావంబుతో మెలంగుచు పతియును మెచ్చి తనతల్లినికూడ నచ్చటికి రప్పించుకొని పోషించుచు పతివ్రతా శిరోమణుల కెల్లనగ్రగణ్యయై యష్టైశ్వర్యంబుల ననుభవించుచు నిరహంకృతితో విజ్ఞానఘనంబు నార్జించి లోకమందలి స్త్రీలకెల్ల దారిచూపించు చుండెను. రాజపత్నులు కూడ నీమెయందసూయ లేక నిర్మత్సరత్వంబున కలసిమెలసి యప్పచెల్లెండ్రమాదిరి నన్యోన్య ప్రేమానుబంధంబుల మెలంగుచుండిరి. యీకలభాషిణి గుణంబును శీలంబునుబట్టి యేకులంబున జేర్పఁబడెనో యాపతివ్రతామణితో జోల్పదగునో చదువరులే నిర్ణయించుకొందురుగాత. అష్టకష్టంబుల కోర్చి మాయోపాయంబు వలన కొంచులదోడ్కొని వచ్చినభుజంగరావును, స్త్రీవేషముదాల్చి మంగాభాయి యను పేరుతో బంగారిలో స్నేహముజేసి భుజంగరావు మాయానాటకంబు నడుమ సాక్ష్యపాత్రయై నటించినదూతను పాతూరినగరంబునను మీర్ ఖాసిమ్ పెటయందును మాయవేషంబులతో నటించి ప్రభువునకు జయంబుగూర్చిన యోధచతుష్టయంబును, దొంగలను వదిపట్టుకొని వచ్చిన వీరాగ్రేసరులను, సన్మాన గౌరవ బహుమానంబుల సంతోషింపఁ జేసెను, తరువాత నంతఃపుర చోరులశిరంబులు ఖండించుఁడని మహారాజాజ్ఞ

నీయుంబోవుచుండ కలభాషిణి వలదని వారించి చిరజన్మాంత మునకు కఠినశిక్ష విధించుండని సలహానీయ ప్రభుండట్లొన రించె మన దేశమందలి స్త్రీలనెల్ల నీకలభాషిణి వంటిపతివ్రతా మణులగావించి భారతమాతకు వన్నియుహెచ్చుటకు కృపా మయుండగు భగవంతుని మనమెల్లరము సర్వకాలము సర్వా వస్థలయందును నిశ్చలబుద్ధిమై ధ్యానించుచుందురు గాత మనదేశము నెవ్వనికిగాని జీవహింస జేయువలయుననూ తలం పుదయింప కుండునుగాత




ఓం హిం రహిరణ్యగర్భాయనమః



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B164 |
| పుస్తకం పేరు | వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 251 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | ii ,3a,4a,2 130 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |